# T. M. S. S. M. Library, Tanjore.

**Presented by** Maharaja Sri V. S. Ranga Rao Bahadur G. C. I. E., C. B. E. Bobbili

**Received from** do

**Date of Receipt.** 16 - 8 1922

T. Sambamurthi Rao

***Honorary Secretary.***

श्री रावु वंशीय चरित्रमु

# శ్రీ రావు వంశీయుల చారిత్రము.



గురుజాడ శ్రీరామమూర్తి కృతము.




చెన్నపురి:

శ్రీ "వైజయంతీ"ముద్రాశాలయందు

ముద్రింపఁబడినది.

1902.

# పీఠిక

ఈ చారిత్రమును నేను వ్రాయునట్లుగా సంకల్పించిన ప్రస్తుతపు సంస్థానాధిపతులవలన నాకుఁ గల్గింపఁబడిన గౌరవాతిశయమునకుఁ బరమానందమునంది వారియెడల నేనెంతయుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాఁడను. సంస్థానములయొక్క పూర్వపు వృత్తాంతములు తెలుపు గ్రంథసామగ్రి విశేషించి లభియింపకుండుటచేత నాకు లభియించిన మిక్కిలి కొంచెపు సాధనముల ననుసరించి యింత ప్రాచీనకుటుంబముయొక్క చారిత్రము వ్రాయఁ గమకించుట నాయతిసాహసతను దెలుపకపోదు. అట్టి సాహసకృత్యమును మన్నింపఁ బండితప్రభువులను బ్రార్థించుచు నాకడనున్న సాధనసామగ్రిని నేకముఖము చేసిన భవిష్యత్కాలమునందలి చరిత్రకారులకుఁ గొంత సహాయముఁ జేసినట్లగునని యిపుడీగ్రంథారంభము చేయుచున్నాఁడను.

యీ చరిత్ర మెటనుండి యేవిధముగఁ బ్రారంభించవలయునని యాలోచించుతఱి నొక పూర్వ వృత్తాంత మీ గోత్రజుల యది దృష్టికి వచ్చినది. అది యెద్దియనఁగా:—పద్మనాయక చరిత్రములో వివరింపఁబడిన రావుబ్రహ్మానృపతి యను పురుషశ్రేష్ఠుఁడు మహాగౌరవములనందిన తమ కులమువారి గోత్ర బిరుదావళీ ఖండనను ప్రకటింపం జేసెనను కార్యమై యున్నది. అట్టి పురుషుని కులమువారును వంశమువారును దిన

దిన ప్రవర్థమానులై శాఖోపశాఖలు గల్గి మన యాంధ్రదేశ మందంతటను పెక్కు సంస్థానములను సంపాదించి ప్రసిద్ధివడసి యున్నవారు. ఆ సంస్థానము లన్నిటిలో గల్గిన పౌరుషాదికము లన్నియు మూర్తీభవించి యొకచోట నిలిచెనా యనునట్లుగ నవియన్నియు నీబొబ్బిలి సంస్థానములోఁ గాన్పించుటం జేసి యట్టి సంస్థానీకుల వృత్తాంతము నుడువుటకుఁ బూర్వము వారి కులమగు పద్మనాయక కులగోత్రాదుల వివరమును, యొక్కొక గోత్రమువారి బిరుదములును, వారిలోఁ బ్రతాపరుద్రునికడ సేనానులుగానుండు పురుషుల నామవివరణముచేసి యనంతరము పద్మనాయకశబ్ద నిర్వచనపూర్వకమగు నన్యజన పూర్వపక్షఖండనమును, శిలాశాసన తామ్రశాసనముల మూలముగా గోత్రప్రవరల నేర్పరించిన కాకతీయప్రతాపరుద్రవైభవ వర్ణనయును, ఆరాజు కాలనిర్ణయముం జేయంజాలిన యొక శాసనమును వివరింపఁబడిన లెస్సయని యెంచి యీగ్రంథముయొక్క ప్రారంభములోఁ బైగాథలతోడనె చేయం దలఁచినాడను.

గురుజాడ శ్రీరామమూర్తి.

# విషయసూచిక




| | పుట. |
|---|---|
| వెలమవారి 77 గోత్రముల వివరము ... ... ... ... | 1 |
| 77 వెలమ నాయకులు పేరులు ... ... ... ... | 8 |
| 77 వెలమనాయకుల గోత్రముల వారి బిరుదులు. ... ... | 5 |
| శాసనాదికము, ప్రభువు ... ... ... ... ... | 30 |
| పద్మనాయక చారిత్రముపై విమర్శనము. ... ... ... | 35 |
| వెలమల జన్మవృత్తాంతము ... ... ... ... ... | 41 |
| పూర్వకుల పరిశీలన ... ... ... ... ... | 42 |
| పద్మనాయక కులోద్భవము ... ... ... ... ... | 42 |
| పద్మనాయక శబ్దార్థము ... ... ... ... ... | 47 |
| సచ్ఛూద్ర శబ్దార్థ నిరూపణము ... ... ... ... | 57 |
| పద్మనాయక వీరపత్నీ వర్ణనము ... ... ... ... | 63 |
| పద్మనాయక చారిత్రములో ప్రతాపరుద్రుల చారిత్రము ... ... | 66 |
| రుద్రుని ముఖ్యపట్టణమగు నేకశిలానగర వర్ణన ... ... | 70 |
| ప్రతాపరుద్రుని యాహ్నికము ... ... ... ... | 73 |
| రుద్రదేవుని కాలనిర్ణయము ... ... ... ... | 74 |
| కాకతి రుద్రనృపశాసనము ... ... ... ... ... | 75 |
| ఆది జగన్నాథరావు ... ... ... ... ... | 85 |
| చెవ్విరెడ్డి వృత్తాంతము ... ... ... ... ... | 86 |
| చెవ్విరెడ్డి యోరుగంటికిఁ బోవుట ... ... ... ... | 95 |
| చెవ్విరెడ్డి పిడుగుం గొట్టుట ... ... ... ... ... | 96 |
| భేతాళుఁడు ప్రత్యక్షమగుట ... ... ... ... | 98 |
| భేతాళుఁడు వరములిచ్చుట ... ... ... ... ... | 99 |
| చెవ్విరెడ్డిని కాకతీయ గణపతి పిల్పించి బహుమానించుట ... | 101 |

| | |
|---|---|
| | పుట. |
| చెవ్విరెడ్డికి పిల్లలమఱ్ఱి భేతాళనామము గల్గుట ... ... ... | 103 |
| పద్మనాయక గోత్ర సీసమాలిక ... ... ... ... | 105 |
| చెవ్విరెడ్డి సంతానము ... ... ... ... | 108 |
| దామానాయని చరిత్రము ... ... ... ... ... | 109 |
| ప్రసాదిత్యుని చరిత్రము ... ... ... ... ... | 109 |
| ప్రసాదిత్యుఁ డితరనాయకులచేత మ్రొక్కించుకొనుట ... | 112 |
| రుద్రనాయకుఁడు... ... ... ... ... ... | 114 |
| లింగమనాయని వృత్తాంతము ... ... ... ... | 116 |
| అన్నమనాయని వృత్తాంతము... ... ... ... ... | 122 |
| సర్వజ్ఞ సింగమనీని వృత్తాంతము ... ... ... .. | 123 |

శ్రీరస్తు.

# శ్రీ రావు వంశీయుల చారిత్రము.

## వెలమవారి 77 గోత్రముల వివరము.

1. రేచర్లగోత్రం.
2. దేవనూళ్ల వారు.
3. రేపాలవారు.
4. విప్పర్లవారు.
5. విరియాలవారు.
6. ఆరట్లవారు.
7. అల్లుచెర్ల వారు.
8. సన్నగిరి లేక సన్నకూరవారు.
9. సామంతరావువారు.
10. పెంపాలవారు.
11. పైశాలవారు.
12. ఇనుగాలవారు.

20. చెరకులవారు.
21. శనగపూడివారు.
22. పసుపునూళ్ల వారు.
23. పల్లవెళ్ల వారు.
24. పాండురాజులవారు.
25. మోతేవారు.
26. పేటకూరవారు.
27. ఆరవెల్లివారు.
28. వేసట్లవారు.
29. వెగుళ్ల వారు.
30. శ్రీమల్లెవారు.
31. ఆమూళ్లవారు ప్రభుడు

39. పేర[illegible]ాళ్ల వారు.
40. డెబ్బిరులవారు.
41. అరట్లవారు.
42. రావిపాలవారు.
43. కొమరువెల్లివారు.
44. కొమ్ములూరివారు.
45. శిరిమల్లెవారు.
46. కుందిపల్లెవారు.
47. మగువట్లవారు.
48. మధుపాలవారు.
49. మంగిపూండివారు
50. మలిచేపివారు.
51. అయోగ్యవారు.
52. మల్లెచెర్ల వారు.
53. మాఘవరేకులవారు.
54. పాలూరువారు.
55. పైడిపాలవారు.
56. పైడిముక్కులవారు.
57. పాయేటివారు.
[illegible]వారు.

59. పూర్వడివారు.
60. పులియాలవారు.
61. నరకూలవారు.
62. నింగివెల్లివారు.
63. పెర్నంకులవారు.
64. ధాన్యవ్రోలువారు.
65. యెంపరాలవారు.
66. గూడూరివారు.
67. వల్లపులవారు.
68. గూడేవారు.
69. పల్కనూరివారు.
70. గుండెకరీటులవారు.
71. అనుగంటివారు.
72. గుండేటివారు.
73. అంపుల్లివారు.
74. జయపట్లవారు.
75. వెలవ్రూరివారు.
76. పెగుడునూళ్ల వారు.
77. పెనుగొండవారు.

## 77 వెలమనాయకుల పేరులు.

1. దేవర్ల అప్పనామాత్యుడు.
2. మర్దనపాత్రుడు.
3. అనాదిమర్దేవుడు.
4. అల్లూరిరుద్రదేవుడు.
5. మురారిమర్దేవుడు.
6. సంగరాజు.
7. మోదుకూరిరామనాథుడు.
8. అన్నవోలిరుద్రదేవుడు.
9. గోనరాజుమద్రయ.
10. బూవిరాజుభీమయ.
11. ఖండయదేవుడు.
12. పోతుగంటిమల్లయ.
13. ఇంటుమాళి.
14. గొండప్పర్తిగణపతిదేవుడు.
15. దాడినాగదేవునిసహదేవుడు.
16. మహాదేవరాయనిసహదేవుడు.
17. మల్లికార్జునుడు.
18. కోరిపాకనాచిరెడ్డి.
9. తాటిపర్తిగణరెడ్డి.
20. బుచ్చిబాపారెడ్డి.
21. గండమన్నారెడ్డి.
22. బారిపచ్చిమల్లారెడ్డి.
23. పెదకోటిభైరవదేవుడు.
24. కోపూరినాచదేవుడు.
25. భోలయమంగడు.
26. కొరివినిశ్వంగడు.
27. నుంగిరిగణపతిదేవుడు.
28. గండయనాయడు.
29. చెరుకుకోటచెన్న.
30. చెట్టావారిబొల్లయ.
31. కుమారగణపయ.
32. తిప్పుడిబొల్లయ.
33. గోనకోటారెడ్డి.
34. మల్రెడ్డిపోతయ.
35. మారసాహిణి.
36. మద్రదేవుడు.
37. యెల్లసాహిణి.
38. మన్నురుద్రదేవుడు.
39. శ్రీకంఠుడు.
40. పెనకూరిమద్రదేవుడు.
41. ఇందులూరిఅన్నమదేవుడు.
42. అప్పరమర్దేవుడు.
43. బండేదేవుడు.
44. కవిదేవుడు.
45. దేవరాజువీరన్న.
46. విశాలాక్షుడు.
47. వీరకొమ్మయ.
48. వెంగళేశ్వరుడు.
49. సాళ్వుడు.
50. సూరయమల్లు.

51. కర్ణకుమారుడు.
52. గోగుపాలినేడు.
53. నాగనాథుడు.
54. వాణీకపదేవు.
55. సారిరాజుయొజ్జ.
56. అఖంగరాయోత్తరాయడు.
57. అన్నమదేవులక్క.
58. జన్నలక్క.
59. గోగులక్క.
60. మాచర్లనాగలక్క.
61. కోటామల్లులక్క.
62. మామగన్నులక్క.
63. వాసెలుబ్రహ్మలక్క.
64. దేగలన్నలక్క.
65. పడిగముపోతులక్క.
66. బట్టిమాచులక్క.
67. ఊగాహేలక్క.

# 77 వెలమనాయకుల గోత్రములవారి బిరుదులు.

---

ఇట్టివంశమ్ములవారి పూర్వోత్తరములనుగూర్చి వ్రాయుటకుఁ బూర్వమందు వీరిలోఁగల 77 గోత్రములవారి బిరుదులలోని చారిత్రము వ్రాయవలసియున్నది. అందుకుగాను పద్మనాయక చారిత్రమను గ్రంథములో నీ క్రిందివిధముగానున్నది. ఎట్లన్నను:

1. రేచర్లవారివి:—

   1. పంచవాద్యైయదళవిఘాల.
   2. కాకతిరాయరాజ్యస్థాప [illegible]ార్య.
   3. చలమర్తిగండ.
   4. జల్లిపల్లివీరక్షేత్రణేభారతీకమల్లా.
   5. సోమకులపరశురామ.
   6. యంబిరుదగండ.
   7. సర్వబిరుదకుమారవేశ్యాభుజంగ.
   8. ఆమనగంటిపురవరాధీశ్వర.
   9. గజదళవిఘాళి
   10. గాగ్గోవాళ.
   11. కంచికవాటచూరకార.

2. దేవనూళ్లవారివి:—

   1. బిరుదుబిట్టురగండ.
   2. చనసునాయకరగండ.
   3. కలగోపాలపార్థివ.
   4. దంబులతలగుండుగండ.
   5. కోడిబిబ్బోనాయకరగండ.
   6. గురిజాలగణపతికరకుఠార,

7. ముమ్మడితలగుంటుగండ.
8. అర్ధనారీతలాటరాయ.
9. రాహుత్తవేశ్యాభుజంగ.

3. రేపాలవారివి :—

1. రేపాలసింహామ.
2. పాతాళగరుడ.
3. మన్మథనాథ.
4. సజ్జనాటిభోరుతలుపా.
5. వంకినారిమల్లా.
6. నిడువ్రోలవీరక్షేత్రణేభారతీకమల్లా.
7. బెదర్లింబరగండ.
8. ఉత్తమగండా.
9. ఏదృరాజ్యస్థాపనాచార్య.
10. తెల్లతలాటరాయ.
11. రాహుత్తవేశ్యాభుజంగ.

4. విప్పర్లవారివి.

1. కరవాలభైరవ.
2. దివిచూడకాప.
3. గండభేరుండతలాటరాయ.
4. రాయరాహుత్తవేశ్యాభుజంగ.
5. ఉభయరగండ.
6. హన్నిబ్బరగండ.
7. హత్తుమువ్వరగండ.
8. ధీరాసామంత.
9. బారామండలీక.
10. భాగ్నుకటాకచూరకార,

11. దుష్టగోపులతలగుండుగండా.
12. సమరపురితలాటరాయ.
13. రాహుత్తవేశ్యాభుజంగ.
14. బాణవర్ణకులాలంకరణ.
15. చోళరాజ్యస్థాపనాచార్య.

5. విరియాలవారివి :—

1. పరబలభీమ.
2. దుష్టరిపుగజాంకుశ.
3. తేరాసామంత.
4. బారామండలీకాచ్ఛామ్లా.
5. తాతగుంటపురవరాధీశ్వర.
6. కాకతిరాజ్యస్థాపనాచార్య.
7. కరుహొత్తుమల్లా.
8. కన్నడదళవిభాళ.
9. గూటూరివంకిదేవరాజసప్తాంగహరణ.
10. దానవతలాటరాయ.
11. రాహుత్తవేశ్యాభుజంగ.

6. అరట్లవారిబిరుదులు :—

1. పతిహితహనుమంత.
2. భండనభీమ.
3. ఏకసంఖ్యానుడువురాహొత్తరగండా.
4. గండరవ్రొరగల్లా.
5. అర్ధనారీతలాటరాయ.
6. రాహుత్తవేశ్యాభుజంగ.

7. అల్లుచెర్లవారివి :—

1. సాహసహనుమంత.

2. సంగ్రామవిజయ.
3. ముదుమకోలనువీరక్షేత్రణభారతీకమల్లా.
4. అరిరాయభూతభైరవా.
5. మల్లినితలగుండుగండా.
6. పద్దుకటారిరాయ.
7. బసవశంకరయువరాజ్యస్థాపనాచార్య.

8. సన్నగిరి లేక సన్నకూరువారివి:—

1. ఇరువెత్తుగండా.
2. గండగోపాల.
3. కంచిపురిరక్షపాల.
4. బారామన్నెభయంకరా.
5. దారితిమన్నియవిఫాల.
6. చోళరాజ్యస్థాపనాచార్య.
7. వీరతలాటరాయ.
8. రాహుత్తవేశ్యాభుజంగ.

9. సామంతరావువారివి:—

1. సామంతకొమరఖండేరాయ.
2. సామంతకొమరజెమిణికనారాయణవెంగియపురగండా.
3. కోరుగంటిపిన్నతలగుండుగండా.
4. వంకిణాగోటదురివిఫాల.
5. సత్యకదేవునితలగుండుగండా.
6. విజయరాయనిదిశాపట్టా.
7. తెలుంగుదేశవెలమరాహుత్త.
8. నహీరునాతిరుమారచ్ఛామ్లా.
9. కాకతిరాజ్యస్థాపనాచార్య.

10. పెంపాలవారివి:—

1. పెంపాలకులకమలమార్తాండ.
2. మెరుదెరంగులకరినాయంకురుగండా.
3. సాహసాగ్జన.
4. గాజ్లిభైరినాయనితలగుండుగండా.
5. మల్లినాయనితలగుండుగండా.
6. అసహాయసింహసాహసోత్తుంగతరంగ.
7. కృష్ణవేశ్యాజలక్రీడావినోద.
8. ఉత్తమగండా.
9. ఉభయరగండా.
10. గండభేరుండా.
11. యువరాజ్యస్థాపనాచార్య.

11. పైశాలవారివి:—

1. వైరిగజభీమ.
2. దండోరుమండలీకరగండా.
3. ఎల్లనాయకలనందనవనమా.
4. వాలుచెవులును, వ్రేలుగడ్డమునుకుమరకుంగొండనారికెగల రెడ్డినాయకచ్ఛాన్లా.
5. నల్లనిరేవులో తెల్లనికూడిన తినివాసాలక్రిందబడ్డ రెడ్డినాయకచ్ఛాన్లా.
6. తెనుగుబిజ్జలుమణినూపురచక్రతిలాటరాయ.
7. గుండిచెర్వుకట్టయెక్కి, బెడ్డమార్గంముగవిని దూరేరెడ్డినాయకాచ్ఛాన్లా.
8. రాహుత్తవేశ్యాభుజంగా.

12. ఇనుగాలవారివి:—

1. గదికోర్లమల్లా.

2. కదనత్రినేత్రా.

3. వాలూరిపురవరాధీశ్వరా.

4. నబలీసహస్రబాహా.

5. పృథివియమార్గోళ్ళగండా.

6. ఉభయదళపితామహ.

7. కోదండసింహ.

8. యువరాజ్యస్థాపనాచార్య.

13 పునుగోటివారివి :—

1. నిశ్శంకభయమల్లా.

2. జాజువరాయపురుపలింగము.

3. సప్తాదిదళపతినాయకాచార్యమ్మా.

4. పుట్టకోటవిడిచికలుకోటబెట్టినాయకాచార్యుల్లో.

5. మలకనేమాపునెదళభయంకరా.

6. గజగంధతలాటరాయ.

7. రాహూత్తవేశ్యాభుజంగ.

8. సరగరుద్రదేవుని పునఃపట్టణంబుగట్టిన కాకతిరాజ్యస్థాపనాచార్య.

14. మట్లూళ్ళవారివి :—

1. ఖండనభయంకర.

2. తొండనగజకేసర.

3. కానిపాంచాలయేకదళవీరం.

4. వోరుదళభయంకర.

5. నల్లతలాటరాయ.

6. రాహూత్తవేశ్యాభుజంగ.

7. ఉత్తమగండా.

8. చోళరాజ్యస్థాపనాచార్య.

15. పాటూన్ళ్లవారివి :—

1. కాలునితలగుండుగండ.
2. వెంట్లరకోటకొంగా.
3. పట్టిరుమానమర్దనా.
4. కళ్యాణిమోరకార.
5. కోసలరాజ్యవిహార.
6. ఏర్వగోకర్ణనిదక్షిణభుజాగండా.

16. మారుట్లవారివి :—

1. మారుట్లసింహము.
2. మల్లవ్రోలిపురవరాధీశ్వరా.
3. దుర్భిక్షవైరిమధ్యాహ్నకల్పవృక్షమా.
4. నుడుదంతదండా.
5. అభిమానసుర్యోధన.
6. శరభతలాటరాయ.
7. రాహుత్తవేశ్యాభుజంగ.

17. మల్లేలవారివి :—

1. హేనబిరుదుగండ.
2. వద్దిఝుదళవిఘాల.
3. శంబేటనారాయణ.
4. ఆప్రూనభాతి.
5. మన్నియలమోరచిక్కమా.
6. రాయగరుడబేగమూటిగండా.
7. గరుడతలాటరాయ.
8. రాహుత్తవేశ్యాభుజంగ.

18. పానేపల్లివారివి :—

1. మండలీకరసాహస్తుమల్లా.

2. భుజబలభీమా.

3. తంబులమరీడబ్బులదిశాపట్టాడంబా.

4. క్ష్మలటలగుండుగండా.

5. మడిమిదిష్మగుబిరుదుకుమారనాయకాచార్యామ్నా.

6. గుడిగుంటవీరక్షేత్రశాజంఝానిలపంటఘట్టా.

7. తంటతలాటరాయ.

8. రాహుత్తవేశ్యాభుజంగ.

19. జమ్ములూరివారు లేక జిమ్మలూరువారివి :—

1. కాంచిమారకార.

2. గజమల్లుతలగుండుగండా.

3. అరడమల్లుఘోరిరావుత్తోయదళాచ్ఛాన్లా.

4. చాగచిక్కమన్నీనితలగుండుగండా.

5. చెరుకురేతారెడ్డితలగుండుగండా.

6. మలయ్యపులవంశోద్భవా.

7. వలసినరాజుకు పల్లిప్రసాదమున్నూ, వల్లనిరాజుకు ఖడ్గ ప్రసాదమున్ను.

8. వలసినరాజుకుజగదాళి.

9. వల్లనిరాజుకువుపదాపి.

20. చెరకులవారివి :—

1. నరవాహుగండా.

2. సరసరక్షక.

3. అభంగప్రభవులగండా.

4. హత్తిగంధరాయణ.

5. వ్రాసితెనుగుబ్రహ్మదళవాయమాయదేవచ్ఛాన్లా.

6. నెల్లూరివీరక్షేత్రశాభారతీకమల్లా.

7. పంచపాండ్రియలరాజ్యస్థాపనాచార్య.

8. కలవకొలనుగండభూపతిశిరఃఖండన.

9. బేదిదగ్గ కాంచినాయనిప్రాణసంహార.

10. పసుపులవంశనిర్ధూమధామ.

21. శనగపూడివారివి (చన్నకుల) :—

1. విప్పర్లకోటిపిలువిద్యాపరశురామ.

2. కుయ్యాలింపుపెరమోటుగండా.

3. కిన్నరసాధకా.

4. గంధగజతలాటరాయ.

5. రాహొత్తవేశ్యాభుజంగా.

6. గొబ్బిరాయరగండా.

7. ఒగుగుండివీరక్షేత్రణేభారతీకమల్లా.

8. యువరాజ్యస్థాపనాచార్య.

22. పసుపునూళ్లవారివి (భోనేపల్లి) :—

1. అరిగండభైరవా.

2. మణికట్టునారాయణ.

3. దశోలచెదిరిరావుజింగుళదళపతియాచ్ఛమ్లా.

4. మీసరగండా.

5. మీసామండలీచ్ఛమ్లా.

6. కలుబరిగెచూరకారా.

7. కాకతిగణపతిరాజు అంగసంరక్షణా.

8. గోసంగివైరితలగుండుగండా.

9. చెరుకునాయకులనిర్ధూమధామా.

23. పల్లచెళ్లవారివి :—

1. రాయంకసూరియాకారా.

2. భేతాళా.

3. కలుగొండవీరక్షేత్రణేమహాభారతీకమల్లా.

4. చంద్రగిరిసోమనాథునిదిశాపట్టా.
5. హుజ్జనీపురవిస్తారకా.
6. ఘూనూరిపాంశ్చత్యవంగనిదళవిఫాలా.
7. ఉత్తమగండా.
8. ఉభయరగండా.
9. గండరగండా.
10. గండభేరుండా.
11. చేటిరామనాగునిశిరఃఖండనా.
12. ఆర్యభీమునిసప్తాంగహరణా.
13. బుట్టునాగదేవునికోలాహలా
14. ముత్యాలతలాటరాయా.
15. రాహుత వేశ్యాభుజంగ.

24. పాండురాజులవారివి :—

1. త్రైలోక్యమల్లా
2. భుజబలభీమా.
3. అష్టమహాసిద్ధా.
4. పాండ్యరాజ్యప్రతిష్టాపనాచార్యా.
5. హేమంచిరాయతలగుండుగండా.
6. మన్నెకులసరోవరా.
7. కాకతిరాజ్యస్థాపనాచార్య.

25. మోతేవారివి :—

1. మోతేగజసింహనా.
2. సంగులూరివీగక్షేత్రణోభారతీకమల్లా.
3. యానమదలశాసనాధీశ్వరా.
4. మంభిన్నిదుర్గదళవిఫాలా.
5. కోయదేవునిభైరవదేవునిసప్తాంగహరణా.

6. సువర్ణతూర్యమహాబిరుదరాయా.
7. రాహోత్తవేశ్యాభుజంగ.
8. యువరాజ్యస్థాపనాచార్యా.

26. వేటకూరవారివి లేక యాటక్కూరవారివి :—

1. రణరంగభైరవా.
2. మల్లికావల్లభా.
3. గండధనుంజయా.
4. యేలరాజురక్కసా.
5. బుధవర్మవంశోద్భవా.
6. కులాలంకరణా.
7. వొరపూరిపురవరాధీశ్వరా.
8. గూడ అంగమదేవుని శ్రీపాదపద్మారాధకా.

27. ఆరవెల్లివారివి (రేమెళ్లవారు) లేక చిట్యూరివారివి :—

1. పోరాటమార్బలసింహమా.
2. సింహతలాటరాయ.
3. రాహుత్తవేశ్యాభుజంగ.
4. ఉత్తమగండా.
5. యువరాజ్యస్థాపనాచార్య.

28. వేసట్లవారివి :—

1. రామునిదూత.
2. రావణునికోలుగండా.
3. కుంభకర్ణునిముట్టిపిదార్యదాయనాయక.
4. పద్దిటిమీదిగండా.
5. పద్దనున్నబిడుగా.
6. నీళ్లలోనిముల్లా.
7. దెప్పరపుకొయ్యా.

8. మజ్జనముల్లోని తెలదాయనాయక.

9. దన్నాలకోటిరాయ.

10. రాహుత్త వేశ్యాభుజంగ.

11. యౌవరాజ్యస్థాపనాచార్య.

29. వెదుళ్ల వారివి :—

1. ఏరట్లసింహమా.

2. కటారి నెరట్లబసుకు విూరగండా.

3. సుర్యభేతాళ దేవవంకిణకోటిరాజ్య.

4. ఐనవానదుర్గవిఫాలా.

5. కల్లూరివీర క్షేత్రణేభారతీకమల్లా.

6. సువర్ణతలాటరాయ.

7. రాహుత్త వేశ్యాభుజంగ.

30. శ్రీమల్లెవారివి :—

1. చలమర్తిగండా.

2. అసహాయగరుడనారాయణా.

3. త్రిభువనకోలగంగా.

4. తిక్కంబయ్యతలగుండుగండా.

5. ఆదూరిగంగనిసస్త్రాంగహరణా.

6. మాకుల వెట్టివీర క్షేత్రణేభారతీకమల్లా.

7. వైరవకొండదుర్గవిఫాలా.

8. కాకతిరాజ్యస్థాపనాచార్యా.

31. ఆదూళ్ల వారివి :—

1. ఆదూరివుద్దండమండలీకరగండా.

2. తేరాసామంతా.

3. జలధిబడబానలా.

4. మాళవీరయమృగవేటకాడా.

5. ఉద్దండరాయా.
6. ఉరగవైనతేయా.
7. గర్వితరాయకగండా.
8. గండభేరుండా.
9. ఉభయరాయగండా.
10. యవనరాజ్యస్థాపనాచార్య.
11. తెల్లతలాటరాయా.
12. రాహుత్తవేశ్యాభుజంగా

32. వాలూరివారివి :—

1. గండరాది త్యగండరవ్వారిగర్గ.
2. కంచిచూరకారం.
3. గద్దుమల్లుతలగుంచుగండా.
4. గంగేశ్వరభైరవునిపురంబు నాటబోడిచి పండించి సురలాం
పనము దెచ్చిన పెలమర్తిగండా.
5. ఉత్పటవ-ర్గబాంధవ.
6. కాకతిరాజ్యస్థాపనాచార్య.

33. కంచెర్లవారివి :—

1. గండపీరాభరణా.
2. గండపెండేరదెంబేటనారాయణా.
3 త్రిభువనకోటగొంగా.
4. పరదళముగని లాగటుట్టి నాయకాచప్లా.
5. పట్టుతలాటరాయా.
6. రాహుత్తవశ్యాభుజంగ.

34. కదుపసూళ్లవారివి :—

1. ఘుటనాధబాహుత్తమల్లా.
2. కప్రపీటికొంగా.

3. కలహత్తుమల్లా.
4. కోటగొమ్మజీవరాలయేలికా.
5. ఎడగావిడిచిపోవునాయకరగండా.
6. నిడిగొండవీరక్షేత్రణేభారతీకమల్లా.

35. కొప్పనూళ్ళవారివి (చెలికానివారివి) గజరావువారివి:—

1. జంగవినాయకాచ్ఛాల్లా.
2. ఆబాగునాయకాచ్ఛాల్లా.
3. కాదమనాయకరగండా.
4. దాయలతలగుండుగండా.
5. నేలకుపట్టమడిగేనాయకాచ్ఛాల్లా.
6. మగతలదుర్గవిభాళా.
7. కాకతిరాజ్యస్థాపనాచార్యా.

36. దాసునూళ్ళవారివి :—

1. పరదళఖేచరా.
2. బాలమారీశిరఃఖండనా.
3. ఆవుదంబరాయనితలగుండుగండా.
4. కొండలదళవిభాళా.
5. కారవరప్రాంత్యకదనగాంగేయా.
6. కాకతిరాజ్యస్థాపనాచార్యా.

37. ముదునూళ్ళవారివి :—

1. ముదునూళ్లనిత్యమహిమానుకూలకరవాలక్షేత్రపాలా.
2. నింగివెల్లిసప్తాంగహరణా.
3. రామాసాహిణీతలగుండుగండా.
4. మొనయుమొనలమోనిసూత్రధారివేగీ.
5. సామరౌతురాగోలా.
6. దాయలతలగుండుగండా.

7. తలుపునారసింహమా.

8. అరదుమడుగువీరక్షేత్రణేభారతీకమల్లా.

38. గాలూరివారివి :—

1. నెరెవారిగొంగా.

2. దారిసేనానాయకాచ్ఛాప్లా.

3. మగదళదుర్గవిభాళా.

4. శ్వేతాళునిభేదహుంకారా.

5. అలంకారా.

6. కొదమవాయుకరగండా.

7. త్రిభువనకోటలగొంగా.

8. చొల్లాతవీరక్షేత్రణేభారతీకమల్లా.

39. పేకినూళ్లవారివి :—

1. తేరాసామంతరగండా.

2. భారామండలీకరగండా.

3. అమూరివీరక్షేత్రణేభారతీకమల్లా.

4. భల్లారోరాయనిదళభయంకరా.

5. మేదినీరాయములవరగండా.

6. తెన్నరాయహల్లకల్లోలా.

7. యవనాశ్వరాజ్యస్థాపనాచార్యా.

40. డెబ్బిరులవారివి :—

1. రాజనాయకరాజాధిరాజా.

2. రవికులతిలకా.

3. రణరంగభైరవా.

4. ధనివారసిద్ధమాధవా.

5. మర్త్యమశ్వవిస్తారా.

6. బెజవాడదుర్గాంబికాలబ్ధప్రసాదకా.

41. అరట్లవారివి :—

1. అకలంక రామా.
2. బల్లరగండం.
3. మూర్తిమ్ముకుంచబిరుదాంక.
4. రుద్రబిరుదుబ్రహ్మరాక్షస.
5. కోరిపాకగోరకుత్రినేత్రా.
6. త్యాగసింహాసనా.

42. రావిపాలవారివి :—

1. రణరంగమల్లా.
2. రావుపైకోలుగండా.
3. రఘురామరాజ్యస్థాపనాచార్య.
4. క్షితిజేహనుమంతా.
5. నవబిరుదు మేరవేశ్యాభుజంగా.

43 కోమరువెల్లివారివి :—

1. కల్యాణమూరకారా.
2. గడిమన్నెభీమా.
3 అదరుఘనాయకచాళ్లా.
4. మొనకలుగులుగనిబెదరునాయకులమిండా.
5. యశాష్వరాజ్యస్థాపనాచార్య.
6. గూని వంగబుదేశదివ్య శ్రీపాదపద్మారాధకా.

44. కొమ్మలూరివారివి :—

1. పరబలభీమా.
2. బాలమార్తాండా.
3. పరగబెక్కెలుగండా.
4. బండరభావా.

5. మద్దిపేటిపేరక్షేత్రణీకాయదళవిభాళా.

6. కాకతి రాజ్యస్థాపనాచార్యా.

45. శిరిమల్లెవారివి :—

1. కలియుగభేతాళా.

2. గండలబాలా.

3. వైరినాయకులదోపాళిక మల్లా.

4. వైరినాయకమదగజపంచాననా.

5. నగరూరిమగ్గవిభాళా.

6. నానావర్ణమండలీకరగండా.

7. ప్రతాపరుద్రమహారాజపట్టవదంగీకారా.

46. కుందిపల్లెవారివి :—

1. కుందిపల్లెసింహామా.

2. లచ్చివైరిరాజరాజ్యచూరకార

3. మురారివైరినారాయణా.

4. సప్తమరియరాయహల్లకల్లోలా.

5. కాంతిమనోరంజనా.

6. కాచల్లనిదుర్గస్థాపనాచార్యా.

47. మగువట్లవారివి :—

1. క్షురికభేతాళా.

2. కాదమనాయకరగండా.

3. బెల్లముకొండరామనాథునిశిరఃఖండనా.

4. కోడూరిమల్లినాయునిశిలిగుండుగండా.

5. అవేభానుని సప్తాంగహరణా.

48 మధుపాలవారివి :—

1. మధుపాలనాయకాభరణా.

2. యిలకాయెలయెన్నుసంపెటా.

3. ఘోరరణశూరా.

4. పరకార్యసముద్ధరణా.

5. కాలనువీరక్షేత్రేశభారతీకమల్లా.

6. యోవ్వరాజ్యస్థాపనాచార్య.

49. మంగిపూడివారివి :—

1. అత్యుగ్రనారసింహా.

2. అతులప్రతాప.

3. మరివేగనాసంపన్నా.

4. భీమవిఖ్యాతా.

5. బిరుదునాయకురాలి రణరంగరాఘవ త్రాణసహస్రబాహా.

50. మలిచేపివారివి :—

1. మేచేవెంబరిగండా.

2. మార్తాండమండలాధీశ్వరా.

3. కప్రపిపిగంగా.

4. కంచుపెంచునగరుజోచ్చే నాయకాచాఫ్లా.

5. పాండవరిపోటున్న పెట్టనితెగువునున్న పొగడించుకొనే నాయకాచాఫ్లా.

6. యాదగిరి మారకారా.

51. అయోధ్యవారివి :—

1. తపోవరగండా.

2. పేరిణీహనుమంతా.

3. దక్షిణపురీసాగకా.

4. వనాలకోటరాయ.

5. రాహోత్తవేశ్యాభుజంగా.

6. మార్వసింహాసన అయోధ్యాపురవరాధీశ్వరా.

7. కాకతిరాయరాజ్యస్థాపనాచార్యా.

52. మల్లచెర్లవారివి :—

1. మహాసామంతా.
2. మండలీకరగండా.
3. మహాసామంతమదవిదారా.
4. కటకచూరకారా.
5. కహోత్తుమల్లా.
6. గండరవ్రారుగల్లా.
7. గర్వితరాయఘంటభీమా.
8. సడనోడుగండా.
9. యావద్రాజ్యస్థాపనాచార్యా.

53. మాధవరేకులవారివి :—

1. రాయకోదండదీక్షసమర్థా.
2. హరిరాయ వెన్నుసంపెటా.
3. రణముపొడగని మొగముస్పృహించే నాయకాచ్ఛాఘ్లా.
4. కాయధాన్యంకోరుచిప్పించే నాయకాచ్ఛాఘ్లా.
5. వూరివెలుగున్ను, కోటవెలుగున్ను చేయించే నాయకా చ్ఛాఘ్లా.
6. గుహన్నిరాజ్యస్థాపనాచార్యా.

54 పాలూనువారివి (ముప్పాళ) :—

1. యెబ్బికంగుబెత్తులగండా.
2. వ్రాసబిరుసుకొమరవేశ్యాభుజంగా.
3. క్రొత్తబిరుసుల నెత్తిపిశుగా.
4. అసహాయకామరపల్లకల్లాలా.
5. జానాకుమారవివేకనారాయణా.
6. బలియునకుత్రినేత్రా.

7. వెంగిరాయమానమర్దనా.
8. గొల్లపల్లివీరక్షేత్రణేభారతీకమల్లా.

55 పైడిపాళ్ళవారివి (చిన్నపాలవార్లు) :—

1. సువర్ణక్షేత్రణ్యేకఛత్రలాంఛనా.
2. స్వామికార్యవంచకులతలగుండుగండా.
3. గేదెయంకమచ్చా.
4. యావద్రాజ్యస్థాపనాచార్యా.

56. పైడిముక్కలవారివి :—

1. పరబలనిశ్శంకా.
2. దాలమార్తాండా.
3. కోదండపార్థివా.
4. కొన్నిదేవునితలగుండుగండా.
5. పర్వయుకుంటవీరక్షేత్రణేభారతీకమల్లా.
6. జంగిలిమన్నెవేశ్యాభుజంగా.
7. ఉత్తమగండా.
8. యేర్వగాకన్ననిదక్షిణభుజదండా.

57. పాయేటివారివి :—

1. మానినీమన్మథా.
2. మాకొమారా.
3. నానానాయకరగండా.
4. కూడితప్పేనాయకరగండా.
5. కూడుపిచ్చేనాయకరగండా.
6. అరికాలా.
7. మండలీకరగండా.
8. హరిదేవుపల్లి వీరక్షేత్రణాహల్లకల్లోలా.

58. బలిశిఖవారివి :—

1. అప్రతీకనరవల్లభా.
2. శివపాత్రదానచింతామణీ.
3. కుల్లాపురీకోలాహలా.
4. దేశింగురాయభయంకరా.
5. ఉద్దండరాయగండభేరుండా.
6. తాండేశ్వరదేవదివ్యపాదపద్మారాధకా.

59. పూర్వషివారివి :—

1. మదగజకేసరి.
2. బారామన్నెకుమారనాయకాచప్పళ్లా.
3. రాయనాయంకరనాగాంగభీమా.
4. నుడిగినమాటరెండాడేనాయకరగండా.

60. పులియాలవారివి :—

1. ముల్లోకరగండా.
2. మురిగొండపిరక్షేత్రణా.
3. సంగ్రామపార్థవా.
4. చెంచుమలమారకారా.
5. సత్యహరిశ్చంద్రా.
6. శీలగాంగేయా.
7. త్యాగరత్నాకరా.

61. నరిమాలవారివి :—

1. రాయమన్నెసిరాయగండభేరుండా.
2. రణరంగమల్లా.
3. రాయనాయకనిశ్శంకశూరా.
4. రాయనాయకనిర్భయశూరా.

5. ఉనకుగొండపురవరాధీశ్వరా.

6. ఆహవమల్లా.

7. గ్రామరాజ్యస్థాపనాచార్యా.

8. త్రిభువనకంటకులమిండ.

9. స్వయంభువనాథదేవదివ్యశ్రీపాదపద్మారాధకా.

62. నింగివెల్లివారివి:—

1. త్యాగకులవంశా.

2. త్యాగకులమహామండలేశ్వరా.

3. ద్రోహికులవంచనిశరీర.

4. కులదాయనోనాయకాచార్యమ్లా.

5. మారులమెట్టువీరక్షేత్రణాభారతీకమల్లా.

63. పెర్నంకులవారివి.—

1. కటారచూరకారా.

2. కటారసామంతరగండ.

3. యడగంరాజుతలగుండుగండా.

4. అభంగరాయరాహుత్తవేశ్యాభుజంగా.

5. రణముపాడగనిరాజుతోమంతనమాడేనాయకాచార్యమ్లా

64 ధాన్యపోలువారివి:—

1. సహస్రాభరణా.

2. సామంతగోపాలా.

3. మండలీకసంస్తుత్యా.

4. మండనభయభంగవర్జితా.

5. స్వామిద్రోహిమురారితలగుండుగండా.

6. యేర్వరాజ్యస్థాపనాచార్యా.

65. యెంపరాలవారివి:—

1. అరమన్నెకొండియురగండా.

2. అచ్చన మేనియరగండా.
3. ఆదిరాజహృదయశల్యా.
4. పరబల మేఘపవనా.
5. ప్రతిశౌర్యధురంధరా.
6. భకాచ్ఛాబాంధవా.

66. గూడూరువారివి :—

1. కోటలగొంగా.
2. కారమనాయకరగండా.
3. కొండమురాజుపస్తాంగమూరకారుం.
4. అరిబలవీరహంకార.
5. చనసురిశనాయకరగండా.
6. యౌవ్వరాజ్యధురంధరా.

67. వల్లవులవారివి :—

1. వల్లవాదిత్యా.
2. వల్లవచక్రవర్తి.
3. వల్లవత్రినేత్రా.
4. పట్టుకగిరిరాయబసవశంకర.
5. రాయశపులకోటగట్టుముగువగండా.
6. గండపేరుండా.
7. ఉజ్వలతలాటరాయరాహుత్తవేశ్యాభుజంగా.

68. గూడేవారివి :—

1. మలసామ్ములవరిగండా.
2. మల్లికమార్తాండా.
3. కానంగివిశాపట్టా.
4. కోపూరిహొమ్మినాయనితలగుండుగండా.
5. కోణధుర్తివీరక్షేత్రణాహల్లకల్లోలా.

69. పల్కునూరివారివి :—

1. ప్రజమెచ్చుగండా.
2. బారమన్నియరగండా.
3. నగళ్లమంత్రనమాడేనాయకరగండా.
4. దళముచూచితొలగివచ్చేనాయకా గ్రణా

70. గుండెకరీతులవారివి :—

1. జారిరాజ్యస్థాపనాచార్యా.
2. జంతుకర్నాటకహల్లకల్లోల.
3. మద్దిపిరక్షేత్రదశాహల్లకల్లోల.
4. గోదావరీతీరాగ్రహారనిర్మాతా.
5. కాకతిప్రోలరాజకార్యధురంధరా.

71. అనుగంటివారివి :—

1. అప్రతీకమల్లా.
2. గేరాసామంతా.
3. ధారమండలీకరగండా.
4. గండరగండా.
5. గండభేరుండా.
6. భటాచ్చా.
7. ధావనాట్రాజ్యస్థాపనాచార్యా.

72. గుండేటివారివి :—

1. గండరాధగణా
2. గండరఘూళీ.
3. గండరధనంజయ.
4. మండలీకరసంస్తుత్యా.
5. పర్వతేంద్రునిదక్షిణభుజాదండా.

73. అంపుల్లి వారివి :—

1. హరినాయకరగండా.
2. అంబాళీరాయుని తలగుండుగండా.
3. కంధారపుర కారం.
4. కాకతిరాజ్యస్థాపనాచార్యా.

74. జయపట్లవారివి :—

1. మద్రనాపిగంగా.
2. మగలతలపూరకారా.
3. కంగుకూరి మల్లినాయుని శిరచ్ఛేదనా.
4. దుష్టారిగండా.
5. సంగడిరక్షపాలా.

75. శైలప్రోరివారివి :—

1. చెంచుమాన్నియపిఫాలా.
2. సముని మదుదుగువాల్లకల్లోలా.
3. ముప్పిడి తలగుండుగండా.

76. చెరుకుమూళ్ల వారివి (కంగిమళ్ల. కటినది) :—

1. మామిడిసింహామా.
2. మద్దిపల్లి ధారతీకమల్లా
3. నైరు ఆలవపుఖాన తలగుండుగండా.
4. పాలకొండదుర్గ వర స్థలరిపుగాయభయంకరా.

77. పెనుగొండలవారివి :—

1. కౌముంబరాధరమల్లా.
2. భటాభార వనాని సహోదరా.
3. ఖండేరాయ నటాంతరహోద్వంతర.
4. అరిరాజమాంపిలీకులతలగండుగండా.
5. రాజమాడామణి.

---

## శాసనాదికము, ప్రభువు.

చ॥ గుఱుడుప్రతాపరుద్రుఁడునుగూర్చినయాఁడఁశచెవ్విరెడ్డియుఁ ।
బొరిబిరుదాంకగోత్రములుబూన్చినయాబడబాగ్నిభట్టునుం।
బరజితశౌర్యమానుషపుభామినిపద్మయునిష్టసఖ్యులై ।
స్థిరముగఁబ్రోవవర్ధిగిరిశ్రీహరిసత్కృపప్రసాయకల్॥

సీ॥ ఏకశిలాపురిజోకతో వెలసినఘనమైనశంభులింగంబుసాక్షి । ఆ
దిత్యవసురుద్రులాస్తసంయముల్ సాహస్రకరకర్తసాక్షిసాక్షి।
పంచమహాభూతపర్వేందుతారకల్ హరిహరులాదియాసుర
లుసాక్షి । గాగమాగధవందిగణముచేఁబ్రకటించివార్తకెక్కిన
యట్టికీర్తిసాక్షి । వెలయుముప్పదిమూడునేయుశతాబ్దముల్
వరఖరవత్సరఫాల్గుణంపు। సౌమ్యవాసరపాడ్యమిశ్రవణతార।
లగ్నమూకర్కటంబయ్యురహిచెలంగ । గోత్రబిరుదాంకితం
బలుగోష్యముగను। రుద్రసముమూర్తికాకతిరుద్రువలన। ఖ్యాతి
యమ్యెనుధరనుసనాతనముగ॥ శా॥ ౧౦౩౯॥

గీ॥ వరదళవిభాళుడాపద్మనాయకులకు । గొలఁదిగోత్రాదిబిరుద
ముల్ కుదురుపరచి । కలితవర్ణక్రమాచారగతులుతెలియ ।
బలికెనిపుణతసంధానలలితఫణితి॥

సీ॥ అమ్మహాదేవునికతిప్రేమపుత్రుఁడైగంజిల్లునాగభైరవునికృపను ।
వీరాధివీరుఁడైవెలయుపిల్లమర్రిబేతాళవరమహాపృథులశక్తి ।
శ్రీరంగనిలయుఁడౌశ్రీరమానాథునిఁజెన్నొందుకరుణావిశేష

31

మునను । మల్లికార్జునపాదమననంబుగోరెడుతనమనోనిశ్చ
యధర్మమునను । కులము వేయిండ్లపనుకనుగుదుపకోనును।
అనుచునియమించిపలికెనుఘనతఁజెలఁగిలక్షణవిహితశుభ
చిహ్నలక్షితుండు । చండశౌర్యుండుసుప్రభూమండలుఁడు॥

సీ॥ మూలంబుపాలభూముఖ్యుసి చెపరెడ్డియొగి యాలవాలమా
యోరుగల్లు । నాయకసికంబునలునైనశాఖలుసారంబువం
శౌర్యసహితగుణము । బహుతరడాంబికప్రత్యాతస్థూలంబు
పత్రిపల్లవములుబహుళగతి । మానగాంభీర్యముల్ సూనక
రాటులుదానకసౌత్రంబులుతగుఫలములు । కల్పవృక్షంబు
సత్యసంకల్పితంబు। ఎచ్చుతారాతిరంధ్రనినముచహేళి। శాత్ర
వానీకమేఘజంఝూనిలంబు। యార్యవినుతంబుపద్మనాయక
కులంబు॥

సీ॥ పద్మనాయకవంశపాలనుండగుననిగోత్రసంతానాది పాత్రమె
ఱిఁగి। కాలీనముచునుకిళవళంబంపక కాకతీయమటంచుఁగిప
బులేక। యొద్దాణముండలాద్యద్భుతంబనకను నెడ్డినాయకుడం
చునోగిటపడక । సంగ్రామభూమినిజయలక్ష్మిఁజేకొన్నగ్ర
హామండలముదూరిగరిమకొన్న। పరగసలనెల్లవినుతించియ
ర్చించి। తత్ప్రధానత్వసందసంపని। వసలెనేనివాఁడువంశ
వర్ధనుఁడయి । యిహపరంబుసౌఖ్యమహిమగాంచు॥

సీ॥ పరిపంథిభద్రేభపంచాననుండైనమన్నసాహెబుగానిమనుప
లేడు।హాలాహలజహాటుహాలాయుధసమానమానధుర్యుఁడు
గానిపూనలేడు । తుండాగ్రవిపమండితోద్దండితసహాస్రఫణి

సమానుఁడుగానిపట్ట లేడు । హాటకాసురప్రాణహాననృకేసరి
దంభధుర్యుఁడుగానిదనుప లేడు । ఈచరిత్రంబుకొలఁదులనిత
రులకును।ననుగమింపనసాధ్యంబులవనిలోన । వితరణగుణాది
సాహసవిదుఁడుగాని।యితరులుఘటింపనోపరీతతులహిమపు॥

సీ॥ మానసంపన్నుఁడైనమహిలోనవెలసినగాంభీర్యవృత్తియుఁగలు
గవలయు । ధైర్యంబుగలిగియుధరలోనవెలిసినస్థైర్యమహావ
హాలంగదనరవలయు। శౌర్యసమగ్రతసాహసంబందెనాపాట
వాటోపతబరగవలయు । వీరాగ్రగణ్యుఁడై వినుతులుగాంచె
నాదానధారాపూర్తివనరవలయు । జలధికైలాసంఘురామ
జామదగ్ని । రీతులనుబొందిదనరువిఖ్యాతినుచుఁ । బలికెగజ
పతిపక్షజప్రకరమునకు । నీతికోవిదుఁడుతుండిలుపుటకుఁడు॥

క॥ మానంబునుశౌర్యంబును । మానుగసద్బంధుపోషమాశ్రిత
హితముఁ।ప్రానికమానినమెలగు । మానంబుగనచిరేనియు
మేటులనందుఁ॥

వ॥ అని నియమించి వారికులక్రమనియమంబులకై మరియు
నిట్లనియె॥

గీ॥ రాయదత్తమైనరావుపేరాదిగా । ప్రానినతఁడుముఖ్యభూభు
జుండు। రెండవదియునన్యునుండుసామాన్యమై । నాయకా
ఖ్యబద్ధనాయకునకు॥

క॥ రణభుక్తిబెట్టిభూపుల । గణుతింపఁగబంధుసమితిఁగాచినవాఁ
డే । ప్రణుతింపఁగఁగులగురుఁడగు । అణిమాదులుశౌర్యమ
హిమనాతనిబొందుఁ॥

క॥ మానవిహీనతఁ జెందిన । మేనాక్షణమాత్రలోన మేదినిదొరఁ
గున్ । దానాయుధమునహతముగు । మానవతిలకుండుపద్మ
మానినిభంగిన్॥

క॥ మోదమునఁబరులఁగూడియు । భేదంబునఁబతికిఁగీడు బెనిచెడి
వేళన్ । సోదరజనకులదునుమును । మేదురుఁడై మన్నె వెలమ
మేటిమగఁడై॥

క॥ గురుధనమువిప్రధనమును । గరళసమంబనుచుఁజూచుఁ గార్య
క్షాంత్యా । స్థిరబుద్ధిగలిగిమెలఁగును । బరికింపగఁబ్రస్తంశపావను
డెలమిన్॥

క॥ సన్మినప్రభునకురణమున । సన్మతిగను దేహమిచ్చి సంగరకేళిన్ ।
యున్మలికమెల్లఁజూపిన । సున్మతఁ డేప్ర్మ జూడు సూయఁడు
కడిమిన్॥

క॥ మానమునిత్యంబనుచును । ప్రాణముతృణమాత్రముగను
బాటించియనిన్ । మేనుందాచనివాఁడే । భూనుతుఁడగు మన్నె
వెలమపురుషాహ్వయుఁడున్॥

క॥ బలుకోరవిషముఖ్యములకు । బాలిపొవనిపుచ్ఛవిషముపాదలు
నళులకున్ । నిలువెల్లవిషముఖులులకు । సులభులుపన్మజులు
శత్రుసూదనవిషముల్॥

క॥ పులిగోరు చిలువకోరయు । కులసతికుచభరము సింహగూఢ
పొసటలున్ । ఇలమన్నెవెలమమానము । పొలియకచేఁజక్క
దనిరిభూజనులెల్లన్॥

క॥ పరనారిసహోదరిగా। విరివిగఁదిలకించుధర్మవిశదాత్ముండే।
స్థిరపుణ్యమానసుండగు । నరముఖ్యుఁడు పద్మజుండునాగఁ
జెలంగున్॥

క॥ కొలచినబంధులనలతిగ । సులభులుగాఁజూచెనేనిసొంపరిధర
లోఁ। గులనాపకుఁడనఁబరగును। వెలిమాన్యవిహీనుఁడనఁగ
వెలయుధరిత్రిన్॥

గీ॥ ఆదిబడబాగ్ని భట్టునమిత యశుఁడు। కేళీ మనదీనిసంస్కృత
మొనర్చె । రసికతఁజెలంగఁగస్తూరిరంగనుకవి । దానిదెని
గించియుంచెనుధారిసో క్తి॥

ఈవృత్తాంతంబు కొంతకొంత పద్మనాయకచార్త్రిములో పలను, మఱికొంత ప్రతాపరుద్రచారిత్రములోను గానవచ్చును. అయితే యీ రెండు గ్రంథములును ప్రతి పరుద్రరాజ్యకాలంబు నాటి కవివరులచే వ్రాయఁబడక తదనంతర కాలీనులచే మఱి కొంతకాలంబైన పిమ్మట తమతమ ప్రభువుల నలరించుటకుగాను కొన్ని నూతనగాథలను చేర్చి యప్పటికిఁ దోచినట్లుగా వ్రాయంబడినవి. అటుగాపున నా గ్రంథములు సంవాదము లేక నిర్వివాదములుగా నంగీకరింప వీలులేకయున్నవి. ప్రతాపరుద్ర చారిత్రముపై మనము చేయు విమర్శనము ఆ రాజు కథావిధానంబులోఁ జూడఁదగును. ప్రస్తుతము వెలమలవంశ చారిత్రములం దెల్పునట్టి పద్మానాయకచారిత్రమను గ్రంథములోఁ జెప్పంబడిన సంగతులంగూర్చిమాత్రము కొంచమాలోచింతము. అది యెట్లన్నను:—

## పద్మనాయకచారిత్రముపై విమర్శనము.

ఈ గ్రంథము రావు వంశపువారిలో నొక్కండగు బ్రహ్మన్నయను నతనినాడు రచియింపఁబడినట్లును, దీనిలోని శాసనముల నాంధ్రీకరించిన కవి కస్తూరిరంగయ్య యైనట్లును గాన్పించును ఈ బ్రహ్మన్ననుగూర్చి పూర్ణముగ వ్రాయక యుండినను అనపోతమనీని వంశజుండగు సర్వజ్ఞసింగమనీనివరకును వ్రాయంబడియుండుటచేత సింగమనీని యనంతర మీ బ్రహ్మన్న యున్నట్లును, ఇతఁడే యీ గ్రంథమునకుఁ బేరకుఁడైనట్లును సూచింపఁబడును. ఇంతియకాక యీ గ్రంథము సామాన్యపు బట్రాజులచే రచియింపఁబడినట్లును గానుపించు. అటుగాకున్న బట్టులవలననే కాకున్నఁ బద్మనాయకులకు గౌరవము లేదని బహుభంగుల వక్కాణించఁబడుట తటస్థించదు. కవిత్వమో పేలవముగానున్నది. గాని ప్రాచీనకవులు రచియించిన శాసనములంలోని వాక్యములవలెఁ గాన్పించదు

ప్రతాపరుద్రుని కాలమువారు రచియించినట్లుండునపుడే దానిలోని గాథలు నమ్మవలసియుండునుగాని యటుగాకచో నందలి గాథలు నమ్మిన ప్రమాణబాహుళ్యము గలుగును. గావున వెలమదొరల జన్మవృత్తాంతముంగూర్చిగాని; బట్టులు లేకున్న వెలమవారలకు మర్యాద లేదనుదానింగూర్చిగాని యింకను యిట్టిముఖ్యాంశములంగూర్చిగాని పద్మనాయకచారిత్రములోఁ జెప్పంబడిన గాథలు నమ్మ వీలులేదని వక్కాణించి చెప్పెదను.

ఇదియునుంగాక యీ గ్రంథములో నిమిడించంబడిన కొన్నిపద్యములును, వృత్తాంతములును, వెలమవారి పూర్వో త్తరములును, ప్రతాపరుద్రుని కథలును తెలుఁగనివారిచే రచి యింపఁబడినట్లును, అక్కడక్కడ దశవిధవెలమలలోఁ గొందఱి విషయమై వాడుకొనంబడు నీచవృత్తాంతములు నోటికివచ్చిన ట్లెల్లనుఁ జెప్పంబడినవిగాని చరిత్రవాసన యించుకంతయైన నెఱిఁగి వక్కాణింపఁబడలేదు. అట్టివాని నీ దేశచారిత్ర గ్రంథములోన విమర్శనముగాఁ జేయుటకు వీలులేదు కావున నిందుఁ గొంచెముగా విమర్శనముచేసి వ్రాసెదను. అయితే సంపూర్ణ విమర్శన మిది కోరినను గ్రంథవిస్తరభయంబున నట్లుచేయక దిక్ప్రదర్శనముగ దోషములం జూపెదను. అవి యెట్లంటేని:—

(1) ఓరుగల్లు (ఏకశిలానగరంబు) వర్ణనఁ జేయుటకు నుద్దేశించుకొని గ్రంథకర్త కథాసందర్భమునకు నీక్రిందివిధం బున వ్రాసె. "శ్రీమహావిష్ణు పాదోద్భవులై చెలంగుచున్న సప్తసప్తతిపద్మనాయకులు మహాప్రతాపశాలులై నానాదేశంబుల కధీశులై యుండిరి. కావున వారిలో గోత్రనామంబులును, వారికులంబును ప్రఖ్యాతంబుగా నిర్ణయింపందలంచి గ్రామ స్వస్థాన ఆశ్లేయ పౌరుషేయంబులును, నాయకాభిధానంబు లును, గోత్రక్రమంబులును, పురుషాంతరపరంపరాభిసంపాదిత బిరుదాంకంబులును, నానాదేశ సభాంతర విఖ్యాత కుతూహల చిత్తుండైన నాగజరాయరాజధానియైన యేకశిలానగరం బెట్టి దనిన." అని దీని సందర్భము పాఠకులకే బోధయగును.

కావున దానింగూర్చి వ్రాయక యీ సందర్భములోఁ జెప్పిన గ్రామస్వస్థాన ఆర్షేయ పౌరుషేయంబులును, నాయకాభిధానంబులును గోత్రక్రమంబులు ననుదానిఫలన సూచింపఁబడు ఆర్షేయ పౌరుషేయ గోత్రక్రమంబులన నేమియని యోచించితిమి. గోత్రప్రవరలు చెప్పుచోటఁ జెప్పఁబడిన పద్యము.

సీ॥ ఏయూరనుండిన నాయూరిపేరను గ్రామాంకనామముల్ గా
నొనర్చి। నేస్థలంబుననుండ నాస్థలంబుగురించి స్వస్థానయుక్తిని
సుజ్ఞనిల్పి। జనకపితామహ సత్ప్రపితామహయార్షేయసూక్తి
నియమనుఘటించి । తగుభుజబలమున దానొనర్చినయట్టిపౌ
ర్షేయమూర్తినిఁబరిణమించి । యెలమిగోత్రంబులన్నియు నేర్ప
డఁగ । గోత్రసదనంబులన్నియుగు నుగుపరిచి । నందిబృం
దంబుకిప్పించివరుసఁజే సెభద్రయశుఁడైన కాకతిరుద్రవిభుఁడు॥
అని యున్నది.

ఆ గ్రంథములోనే మఱియొకసందర్భమున నీ గోత్రప్రవరాదికము గల్గుటకుఁ గారణ మీ క్రిందివిధంబున వ్రాయంబడియున్నది. ఎట్లన్నను:—

వ॥ "ఇట్లు డెబ్బదియేడ్గురునాయకులును, కాకతీశ్వరునిఁ గొలిచియుండియు నా గాళేశ్వరప్రేరితంబై, యవన, మరాట, ఘూర్జర, మాళవవాహినీసందోహంబు ఏకశిలానగరంబు చుట్టువిడిచి కొత్తళంబులు (బురుజులు) హత్తుకొని నిశీథసమయంబునఁ గట్టాయితంబై మట్టుమీరు శత్రుదళంబులఁ బన్నజులు నవలక్షవాహినీ పరివృతులై పుట్టకోటదాటినడిచి

జయంబు చేకొనిరి. గావున వారికి గోత్రనామంబులు క్షేత్రపరిమాణంబులు నొసంగి వరుసానుక్రమంబు లేర్పరచి కీర్తిదిక్స్ఫూరితంబు చేయించి ధవళశంఖభేరీమృదంగ ధవళ ఛత్రకేతనంబులు 'మొదలుగాఁగల బిరుదులు, ఘంటికా తురంగాందోళికాభద్రగజచీనిచీనాంబరసింహతలాటంబులు బహుమానంబులు నొసంగి, బిరుదు బహుమానాస్పదంబగు సంవత్సరంబును వక్కాణింపఁజేసె" అని చెప్పంబడియె.

ఇది ప్రతాపరుద్రుని చారిత్రగ్రంథములో నిట్లుగఁ జెప్పఁబడదయ్యె. అందలి వృత్తాంతమునకును దీనికింగల కథా సందర్భంబు పాఠకులకే బోధయగునని యెంచి దాని నీ క్రింద వివరించెద నెట్లన్నను:—

పంచనసోమదేవరాజీయము:— "కొండొక దివసంబున దుష్టనాయకులు గుమిఁగూడి స్వర్ణవేదిలింగంబుపైఁ బందివడి కొనిపో నుద్యోగించి బహుజనంబులం గూర్చుకొని దేవునిం బందిపట్టిన దుష్టనాయకులం దునిమె. ఆ మరునాఁడు కొందఱు దుష్టులుగూడి యా కులచంద్రుఁడను బ్రాహ్మణునిమీఁద బంది పడి సర్వధనం బపహరించి విప్రునిం బొడిచిన నతండు మూర్ఛాగతుండై పడియున్న, భూపాలుండు విని విప్రుండు చచ్చినం దనకు బ్రహ్మహత్య గలుగునోయని భయపడి చింతించుచున్నయెడ నా విప్రునిభార్య సావిత్రియనుకాంత పతివ్రతఁ గావున లక్ష్మిదేవి నారాధించి తత్ప్రసాదంబునఁ దనపెనిమిటిని మూర్ఛఁదేరిచి బోధితుంగా జేసికొనియె. ఆవార్త రాజు విని

యవ్విప్ర దంపతుల కపారధనం బొసంగి యొకగ్రామం బగ్ర హారం బిచ్చె"

"మఱియును కాకతిరుద్రుండు, తనకుం బ్రహ్మహత్య లప్పుటకు సంతోషచిత్తుండై కొల్వుకూటంబునకువచ్చి సింహాసనాసీనుండై తన బంధుజనుల రావించి మఱియు సోమదేవ రాజులనాటనుండి వంశపారంపర్యముగా గొల్చియున్న దొరల, మన్నీల, ప్రగ్గడలఁ, బురంబునంగల విప్రవరుల, వివేకచతురుల, మఱియు సకలనియోగంబులవారినిఁ బిలుపించి యుచితాసనంబులఁ గూర్చుండ నియమించి గంధకర్పూర కాస్మీర కస్తూరికా పరిమళమిశ్రితంబైన కలపంబులొసంగి, పుష్పమాలికా తాంబూలంబులిచ్చి సంతోషితచిత్తులంజేసి ప్రతాపరుద్రుండు వారితో నిట్లనియె:—వింటిరే మొన్నటి రేయి స్వయం భూదేవునిపై బందిపడి, యీరేయి విప్రునిపై బందిపడిరి; రాజ్యం బనాయకంబై యున్నయది సుస్థిరంబుగా నుండుట కేపనియని తెలియంబలికిన, వారలాడను విని యేకగ్రీవంబుగాఁ జెయ్యెత్తి యిట్లనిరి. నీవు సాక్షాద్రుద్రుండవు గావున నీవేరీతిగాఁజేసిన నది మాకు సమ్మతంబు. అనిన నారాజుహర్షించి మనంబులో విచారించి యిట్లనియె. గణపతిమహారాజు నానావర్ణంబుల వారికిని నాయకత్వంబు లిచ్చుటంజేసి బహునాయకంబై యున్నయది. బహునాయకత్వం బనాయకత్వంబు నొక్కసరియే కావున నాయకత్వంబున కుత్తమవంశజాతులుగాని యితరజాతులవారలర్హులుగారు. మఱియు నొక్కమాటఁజెప్పెద. మానధనులును,

అతివివేకసంపన్నులును, గాంభీర్యసముద్రులును, మంత్రవివేక దక్షులును, పాపభీరులును, స్వామిహితానుచరులును, సచ్ఛూద్రులునైన పద్మనాయకులు నాయకత్వంబునకుఁ దగుదురని సభాసదులతోఁ బలికిన విని వారు రాజు వివేకి బుసరు హర్షించి కొనియాడి దేవరవారి కెయ్యది సమ్మతమో యట్లు చేయవలయునని పలికిరి. వారలమాటలు విని ప్రతాపరుద్రదేవుండు పద్మనాయకులం బిలుపించి వారిలో నాయకత్వంబున కర్హులగు వారి నేర్పరిచి యొక్కొక గోత్రంబునకు సర్వలక్షణ సంపన్నునిగా నేర్చి ధనకనకవస్తువాహనాందోళికాదులును, చీనిచీనాంబరాదులును, ఛత్రచామరాదులును, పట్టధ్వజంబులును, మఱియు సాహసకృత్యంబులును బిరుదులు నొసంగి సకలబహుమానంబులుం జేసి డెబ్బదియేడుగోత్రంబులకును డెబ్బదియేగురు నాయకుల నేర్పరచి యేకశిలానగరంబు శిలాప్రాకారమునకు డెబ్బదియేడు కొత్తడంబులకును (బురుజులు) నొక్కొకరికి నొక్కొక కొత్తడంబున నుండంజేసి, వారిబంధువులకు నాయకత్వబొసంగి పుట్టకోటకొత్తడంబుల నుండంజేసి వారివెనక నాయకుల భూమికోటకొత్తడంబుల నుండంజేసి యితరజాతినాయకులఁ గ్రమించి వెలిపాలెంబుల నుండంజేసె. మఱియు డెబ్బదేగురినాయకులకుఁ దనరాజ్యం బప్పగించె. అందొకభాగంబు వారిజీతంబులకు, నాల్గుభాగంబులు భాండాగారంబులకు, నొకభాగము బంధువులకు, మఱియొకభాగంబు దేవతావైభవంబులకుగా నిర్ణయించి, చోరబాధాదికంబు లేకుండ మహిమతో రాజ్యంబు పాలించెను" అని.

(2) ఈ పై గ్రంథమంతయుఁ జదివినచోఁ బద్మనాయక చారిత్రములోని వెలమవారిగోత్రనిర్ణయము ప్రతాపరుద్రుఁడు చేయలేదనియు, నదివఱలోఁ బ్రసిద్ధులై యుండు పద్మనాయకులను గారవించి ప్రతాపరుద్రుఁడు వారికిఁ దన సర్వరాజ్యమునకు నాయకత్వ మిచ్చెననియు నిట్టివారిచేఁ బరిరక్షింపఁబడుటకుగాను దనకోటకు 77 బురుజులు కట్టించెననియు, నీ పద్మనాయకులు సచ్ఛూద్రులనియు, ననేక సుగుణవిశిష్టులనియుం దేలినది ఈ సచ్ఛూద్రు లనుదానింగూర్చి ముందు మీమాంస చేయంచలంచి పద్మనాయక చరిత్రములోఁ గొండపీటి దండకవిలెల్లో వ్రాయంబడిన యసూపర్భపు గాథలను నమ్మి వ్రాసిన కొన్ని పద్యంబులు నిరాకరించఁబడతగినవని వక్కాణించెదను. అవి యెవ్వియన :—

---

వెలమల జన్మవృత్తాంతముంగూర్చి.

---

క॥ శూరులజన్మస్థానము । నారసినియమింపఁగూడదదియెట్లన్నన్ ।
పీరులుషణ్ముఖమారులు । సూరిజనులబోలమిగులఁజోద్యాంబగుచున్ ॥

ఉ॥ కొందఱు రెడ్డినాయకులు గోప్యముసాదిరి మానుషంబునన్ ।
గొందరులక్కనాయకులుకుంభినిక్షీరజలోక్తిఁబొల్చిరా । కొందరుకొంకణోద్భవులు ఘోరపరాక్రమలీలఁగ్రాలఁగా । నందఱునేక మైధరనునద్భుతలీలఁ జెలంగిరెంతయున్ ॥

---

## పూర్వకులపరిశీలన.

గీ॥ కొంకణాదిక సేతుపుకుంభినులను । నాంధ్రద్రవిడాది దేశంబు లందు వెలమ । పేరు ప్రఖ్యాతినొందివిస్తారముగుచుఁ । గరము బహుముఖవర్ణసంగతులఁదనరి॥

క॥ లోహము తామ్రముసిద్ధుఁడు। సాహసమునఁజేయుంజతిస్వర్ణముభంగిఁ । యాహతమైనకులంబున । నూహింబ్రబలించె నృపతియుర్విపులెన్నఁ॥

క॥ మధ్రుతజలకణసంతతి । ముద్రితవరశుక్తిపతితిముక్తాముభంగిఁ । శూద్రాభావంబయ్యెను । రుద్రక్షితిపాలుఁవాక్యరూజెలంగెఁ॥

గీ॥ ఊరివరదనీరునురికి సరయువుజేరి । తీర్థయోగ్యమైన తెరఁగుగాదె । కాలవోదితిముఁగాకతీశ్వరుఁగొల్చి ।, కాపులెల్ల వెలమకమ్మలైరి॥

క॥ ఆదియనాదియుగాకను । భేదంపై కాకతీంద్రమపృథుతరశక్తిఁ । మేదినిపద్మసమాఖ్యని। వేదితమైజట్టుపలనవిభవముగాంచెఁ॥

## పద్మనాయక కులోద్భవము.

సీ॥ పదివిధంబులకుల ప్రఖ్యాతిఁజెల్వొంది వెలమనామంబు చేఁజెలఁగియుండు । కాకతిరుద్రునికరుణచేఁ బొందు వీరవిక్రమకేళి పేరుగనిన । వారిలోఁ జెబ్బ దేద్దురికినిదగుమన్నె వెలమనామముచాలవిశదమగును । నాలుగుపేరులునలరువారికె కాకయితరులకునునొప్పదిదినిజంబు । గ్రంథములలోనఁజాటుప్ర

బంధములను। విశ్వవినుతంబు పూర్వకవీంద్రవినుత। రాయదత్తం
బుగజరాజరక్షితంబు। పద్మపదపద్మయభిమానపక్షముగను॥

గీ॥ తారకలలోన గ్రహరాజు వేఱయైన। భాతిదశవిధ వెలమలఁ
బాయఁద్రోచి। సప్తసప్తతిపద్మజసముదయంబు। పద్మనాయకు
లనఁగనుఁబ్రబలెఁజగతి॥

క॥ తొలికాలముర్విగొడవల। వెలియైయాలములయందు విహ
రించుటచే। నిలకాపుజనులు గొందఱు। వెలమలనన్ జగతి
లోన విశ్రుతులగుటన్॥

క॥ పద్మంబోలెడు పద్మకు। పద్మగతిన్నాయకాఖ్య సరణిదలిర్పన్।
పద్మరమాంతరుణీముఖ। పద్మమునం బోలుచు లక్ష్యభావమనం
గన్॥

అని యిట్లుగా వ్రాయంబడినది. ఇందులోఁ జెప్పంబడిన గాథలలో నొకదానికిని దగు నాధారములు లేవు. పైని చెప్పఁబడిన కొండవీటి దండకవిలెలోఁ జెప్పఁబడిన యొక యపూర్వగాథమాత్రము సహకారిగా నున్నది. ఇంత యననేల యీ గాథయే దీనికి మాతృకయని యూహింపవచ్చును. కావున నీ రెండు గ్రంథముల వదలి యితర గ్రంథములలో నేమిగా వ్రాయంబడినదో చూడవలసియున్నది. అందుకుగాను మనము శ్రీనాథకవిత్వాక్షేమఖండములో వ్రాయంబడిన చతుర్థవంశజుల శాఖాభేదంబులఁ దెలుపుదము. అది యెట్లనిన:—

" ఉ॥ కైటభదైత్యవైరిపదకంజమునం దుదయంబునొందితి న్నే
టికిభూతధాత్రికిని నెంతయునచ్చినతోడబుట్టువై । హాటక
గర్భముఖ్యనిఖిలామరమౌళిమహామణిప్రభా । పాటలపర్ణ
మైనయొకపావనవర్ణముదీర్ణసంపదన్॥

వ॥ ఆ పుణ్యవంశంబున కంసాసురధ్వంసిచరణపల్లవంబు సోకనఁ బుట్టినిల్లుగావునఁ గారణసంక్రమంబునఁ బోలెఁ జామర తోమరఛత్రధనుఃఖడ్గాది చిహ్నోపశోభితంబై, చదలేటి నీటినలన సోదరీయస్నేహలబ్ధంబులచో నిపాతసత్వ, శుచిత్వ, గాంభీర్యమాధుర్యంబులు భరితమనస్స్వభావ వచనంబులు గరియించి సైదోడుం బొదలి విశ్వవిశ్వంభరాక్రీడంబు తనకు విదిర్చిన పరమశాంతి యంతరంగంబున సంతరించి నిఖిల ప్రపంచమునకు నాధారంబై ప్రవర్తిల్లు. అందుఁ బద్మనాయకులన, వెలమలన, కమ్మలన, నగి నల్లనా బంటలన, బహు ప్రకారశాఖోపశాఖాభిన్నంబులైన మార్గంబులఁ ద్రిమార్గ గంగాప్రవాహంబునుంబోలె గోత్రంబు లెన్నెన్నియు జగత్పవిత్రంబులై ప్రవహించుచుండు. కల్పంబు లతిక్రమించి, మన్వంతరంబులు జరిగి, యుగంబులు సరిగడిచి వత్సరంబులు చని, కాలచక్రంబు లతిక్రమించుచుండ, చతుర్థకుల మౌళిమండనంబై కీర్తివిహారఘంటాపథంబైన పంటమహాన్వవాయమునందు." అనియున్నది.

దీనింబట్టి చూడ నిదివరలో వ్రాయంబడిన లోపములు పద్మనాయకకులమువి కానటులును ఈ శాఖ సచ్ఛూద్రులని

ప్రసిద్ధమునందిన నాల్గు శాఖలవారిలో మొదటిదియైనట్లును, ఇది వెలమలని చెప్పంబడు శాఖవారికంటె భేదమైనదనియుం జెప్పనొప్పియున్నది. పైం జెప్పంబడిన వెలమలలోని దశవిధ శాఖలుగాని దానికొఱకు కొండవీడు దండ కవిలె మొదలగు గ్రంథములలో వ్రాయంబడిన యసందర్భవృత్తాంతములుగాని పద్మనాయకు లవి కావని నిశ్చయించుట కనువైయున్నది. పద్మనాయక చారిత్రకారునకా భేదంబు తెలియకపోవుటచేతం బైపద్యములు వ్రాసి యనంతరము శ్రీనాథకవిమార్గముననే కొన్ని పద్యములు వ్రాసె. వాని న్వివరించెదను. అవి వివరింపంబడిన పిమ్మటం బద్మనాయకచారిత్రములోని గాథల కెట్టిప్రామాణ్యము నొసంగదగునో పాఠకులకే బోధించును.

---

పద్మనాయక చారిత్రములోని పద్యము.

---

గీ॥ దైత్యవిధ్వంసిపాదపద్మజులటంచు । వేదములుబల్కుంగావున విదితముగను । శూద్రకులజులునోటనుసూచితముగ । బద్మజ ఖ్యాతినియమించిపలికిరపుడు॥

అని యిట్లుండు పద్యముంబట్టి నై వృత్తాంతంబు కొంచెము బలపడినను, పద్మనాయకస్వామముమాత్రము ప్రతాపరుద్రునివలన నీయంబడినట్లుగా సూచింపంబడుచున్నది. అది యు నసందర్భపు నూహయేయని శ్రీనాథకవివాక్యములచేతనే స్పష్టము కాగలదు. అందులోం బద్మనాయక వెలమ మొదలగు నామములు శూద్రులలోం గల్గినపిదపం గల్పంబు లతిక్ర

మించెనను మొదలగు సంగతులవలననే స్పష్టంబగు. ఇపుడు డెబ్బదియేగ్గురు నాయకుల నియమించిన ప్రతాపరుద్రుని కాలము శా॥ స॥ 970 మొదలు 1050 ల వరకు నున్నదని యూహింతుము. అంతకుఁ బూర్వపు రాజులకాలమునఁ గూడ నీ పద్మనాయకవంశనామము గాన్పించిన మనకుఁ గల సందియంబు బాయునని యూహించి యీ శాఖవారిపేటఁ గృతినీయంబడిన గ్రంథములు వెతుకఁగా నవ్వరాన్నవారి వంశముం దెల్పు నిందుమతీచారిత్ర (పరిణయ) మను నొకగ్రంథంబున నది రచియింపఁబడు కాలమునకే పద్మనాయక నామంబీ శాఖవారికిఁ గల్గినట్లు వివరింపంబడియె అని యెట్లన్నను:—

క॥ ఆవిష్ణుపదాంబుజమున । నావిర్భవమైచతుర్థమగుజాతిగరిష్ఠ ।
శ్రీవెలయఁగ విమలసమా । ఖ్యావృతమై పద్మనాయకాన్వయ
మలరెన్॥

గీ॥ అపురయప్పద్మనాయకాఖ్యాన్వయప్ర । దీప్తులగుజనులెంత
యుఁదేజమొంది । పద్మినీరంజనప్రౌఢిఁ బ్రబలిరవని । నప్మహా
వంశమెన్నంగనలవియగునే॥ అని,

అయితే యీ గ్రంథకవి శ్రీనాథునికంటెగాని, కాకతి రుద్రునికంటెగాని ప్రాచీనుఁడాయని శంకించెదము. అట్లు కాకున్నను, అయినను దాని నాలోచింపక తద్వంశమునకు మూలపురుషుండగు బసవన్న యనునతఁడు కాకతీయప్రతాప రుద్రునకు నైదారువందల సంవత్సరములు పూర్వుండగు కరికాలచోళునివలన విశేషబహుమానముల నందినవాఁడు. అప్ప

టికింగూడఁ బద్మనాయకులను పేరిటనే యీ వంశపు సచ్ఛూ-
ద్రులు వ్యవహరింపఁబడుచున్నట్లు విస్పష్టమగుచున్నది. కావున
ఏ పద్మజసమాఖ్య యనేక కాలమునుండి నడచుచున్నదిగా
నిర్ణయింపఁబడవలయును. ఈ శాఖకు వెలమనామము నియోగి
బ్రాహ్మణులకు వ్యవహారనామముగా వచ్చిన కరణములను
నట్లుగా వ్యవహారకారణమున గతానుగతిక పరిలబ్ధము.

---

“పద్మనాయకశబ్దమున కర్థమేమి.”

---

అను దీనింగూర్చి పద్మనాయకచారిత్రములోఁ గొన్ని పద్యంబులు వ్రాయఁబడినవి. ఎట్లనిన :—

సీ॥ వెలలేనిగుణరత్నవిభవంబు చేఁగూర్చి విలసిల్లుచుండుట వెల
మలైరి।పద్మాభిధేయులైరంగవధీశులైపద్మనాయకులనఁబబలు
లైరి।హరిపాదపద్మమందవతరించుటఁ జేసిపద్మజనామసంభరితు
లైరి। ప్రాణపరిత్యాగపర్యంతమనపాయశీలులై యభిమాన
శాలులైరి। ధరణిలోపేరెకాకయుత్తమచతుర్థ। లతిసమర్థ
లుపుషితార్థులంచు నెంచ। లక్షణగ్రాహ్యమునబుధాఢ్యులు
లెల్ల। బలికిరీరిలిసత్ప్రతిభావిభూతి॥

సీ॥ తమకోడలౌ పద్మదయమనావేస్కించుమాటవప్పకనూటిమగడ
నీక।చటకిరేణుకపూజసద్భక్తిగావించివరమందినదివేగసంగు
దాఁటి। పద్మాహ్వాయత్వంబుపరగగైకొనిమాంటనొక్కటిగాఁ
జేసిముఖ్యముగను।ధన్యులైనాయకుల్ దగ డెబ్బదేడ్గురై చతు
రబ్ధిదానముల్ సంవిగాంచి। గోత్రంబులన్నియుఁగొమరొప్ప

గాంభూనిక్షాత్రవంతంబునజైత్రులగుచు। సమరసంయుక్తి మ్లేచ్ఛరాజ్యంబుగడిచి। బిగువుదప్పకమానంబుబీరువోక। వెలమకులమునశ్రేష్ఠమైవెలసితౌర। ఘనులరుందిచూడనిధానముగను। పన్నెవెలమలుధరలోసమాన్యులగుచు॥ అని,

ఇట్లు చెప్పంబడిన పై పద్యములలో నొక్కటియును సహజార్థమును బోధించునది కాదు. విష్ణుపద్మమున జనియించుటచేతనే పద్మజసంజ్ఞ చెల్లునేని యది బ్రాహ్మణులందరికినిఁ జెల్లవలయును అట్లుగాఁ జెల్లుట లేదుగదా. రెండుపద్యములలోని 'పద్మాహ్వయత్వంబు పరగఁ గైకొని' అను పద్యమున కర్థమే లేదు. కావున నీ రెంటిని సంగీకరించక యింక సంశయమై గ్రంథాంతరంబున నర్థాంతరంబునుఁ జూచెదము. అంత నర్థాంతర మెట్లనఁగా:—

పద్మనాయకుఁడు అనువాఁడు సూర్యుఁడు. అతని కులమునఁ బుట్టినవారు పద్మనాయకవంశజులని చెప్పవచ్చును. పద్మనాయకుఁడు నాయకుఁడుగాఁగల కులమును పద్మనాయకకులమని చెప్పనొప్పు. ఈ రెండును మనపురాణాదిగ్రంథములలో నెటనైన నున్నట్లు కాన్పించినఁ బ్రమాణములుగా సంగీకరింపవచ్చును. అందు భవిష్యోత్తరగాథలం జెప్పు పురాణగాథలలోఁ బద్ముఁడను నొకరాజుండినట్లును నతఁడు సూర్యశ్రీపుత్రుండగుటంజేసి దేశమునందుగల క్షత్రియులనందరినిఁ దనతో సంబంధబాంధవ్యములు చేయుమనియును, అట్లు చేయక యున్నచోఁ దనతో యుద్ధమునకు రండనియును నవమానం

బులు పంచి యనంతరము దిగ్విజయమునకు వెడలి తనయభి ప్రాయములో నేకీభవింపని యనేకులగు క్షత్రియులను బందీకృతులంజేసి వారిని శూద్రోదకము త్రాగునట్లును శూద్ర ప్రాయులగునట్లును జేసెను. అపుడు బందీకృతులుగనుండు వారిలోఁ గొందఱు క్షత్రియులు తాము నతనితో సంబంధ బాంధవ్యము ఉంగీకరించెదమని యంగీకరింప వారిని చెఱసాల నుండి విడిపించి గౌరవించినట్లు కానుపించును. ఆ విధమునఁ బైటవచ్చిన శూద్రరూపధరక్షత్రియులు తాము సూర్యవంశజులమన్నియును పద్మునకు విధేయులమనియుఁ దెలుపుటకుఁ గాను తాము పద్మనాయకవంశజులమని వెల్లడించినట్లు కానుపించు. ఇట్లు పద్మనాయకులు పూర్వ మొకకాలమున క్షత్రియులుగా నున్నందులకుఁ గల నిదర్శనములు జూపుటకు ముందుగా నీ పై వృత్తాంతముం దెలుపు గ్రంథములలో నొకటి యగు మార్కండేయపురాణోత్తరఖండములోని పై కథాభాగంబు యథామాతృకగా నీక్రింద వివరించెదను. అది యెట్లనిన:—

"మార్కండేయపురాణోత్తరఖండము."

అధ్యాయము మహాపద్మచరిత్రము.

శ్లో॥ మహానందిర్మహారాజో రాజ్యంక్కుర్వన్మదోత్కటః।
సరాజోరాజకన్యాంచ ఏకాంశూద్రకులోద్భవాం॥
కన్యాంగృహీష్యతిముదా పత్నీత్వేనామతచ్ఛ్రిణు।
మహానందిసుతోరాజా శూద్రాగర్భోద్భవోబలీ॥
మహాపద్మపతిఃకశ్చి న్నందఃక్షత్రవినాశకృత్।

సర్వదేశస్థితంక్షత్రం పాలయిష్యతిమూఢధీః।
జ్యోతిఃపుర్యాంమహానందీ నందంస్థాప్యమహామనాః॥
సర్వరాజ్యాభిషేకంతు కరిష్యతినసంశయః।
మహానందీమహారాజో మృతిమేష్యతికాముకః॥
సర్వరాజ్యాధిపత్యంతు ప్రాప్యనందోమహాబలః।
సర్వదేశస్థితంక్షత్రం స్వవశంతుంకరిష్యతి॥
నందోమహాబలోపీరో మహాపద్మపతిర్విభుః।
సర్వరాజ్యస్యకర్తాణి మదాంధస్తుకరిష్యతి॥
మహాపద్మంతునగరం తస్యనామద్వయంభవేత్।
ఉపప్లావ్యంజ్యోతిపుర మిత్యాహుర్వేదవాదినః॥
మహాపద్మాఖ్యనగరే స్థిత్వానందోమహాబలః।
శాశిష్యతిససందేహ స్సర్వదేశస్థితాన్నృపాన్॥
తేతుతస్యనమస్కారం నకరిష్యంతిభూమిపాః।
శూద్రాగర్భోద్భవత్వాచ్చ వేదోక్తవిధిహీనతః॥
క్షత్రవంశోద్భవాభావా న్నకరిష్యంతితస్యతు।
నమస్కారంహిరాజేంద్ర సర్వదేశస్థితాన్నృపాః॥
తస్మాత్కోపాత్పద్మపతిః నందోబలపరాక్రమః।
సర్వదేశస్థితంక్షత్రం జేతుంనైనగమిష్యతి॥
అక్షౌహిణీబలౌఘేన వృతోనందోమహాబలః।
స్థితంజయపురేవీరం విరాటకులసంభవం॥

గజపతిజయః.

జేతుంగజపతింయోగ్యం ప్రథమంతుగమిష్యతి।
రాజ్ఞోగజపతేర్హాతం సనందః ప్రేషయిష్యతి॥

గత్వాదూతోగజపతిం దృష్ట్వావాక్యంకరిష్యతి।
నందరాజస్యదూతోహం తేనైవప్రేషితోస్మ్యహం।
నందవాక్యానిరాజేంద్ర శ్రుణుధీరమనాఃప్రభో॥
మమకార్యేనమస్కార స్త్వయాత్వాతుకులజైరపి।
నకరోషితథారాజ న్నద్యైవత్వాంసబాంధవం॥
సజ్ఞాతింరాజ్యహీనంచ కరిష్యామినసంశయః।
కరందత్వాతిశీఘ్రేణ పూర్వస్మాచ్చవిశేషతః॥
సంఘేనతిష్ఠరాజేంద్ర మిత్రబాంధవసంయుతః।
శ్రుత్వాగజపతిస్సమ్య గ్దూతవాక్యంసభూపతిః॥
మంత్రిభిస్సహసంమంత్ర్య స్వదేశస్థాంశ్చభూపతీన్।
సమానీయచతైస్సాకం సమంత్రీచసభూపతిః॥
ఏషనందోహిబలవాన్ యుద్ధేజేతుంనశక్యతే।
తస్యచక్రుర్నమస్కారం తేభూపానందభూపతేః॥
తంహిత్వానందభూపాలః సర్వసైన్యసమావృతః।
ఆర్యావర్తాదికాన్దేశాన్ గమిష్యతివిరాజితాన్॥

## ఆర్యావర్తదేశగమనం.

ఏవంతాంస్తాంశ్చభూపాలా న్నమిష్యతినసంశయః।
మమకార్యేనమస్కారం ఇతివాచంసుదారుణాం॥
సూర్యవంశోద్భవాభూపా శ్శ్రుత్వాకోపసమన్వితాః।
యుద్ధాయైవహితేసర్వే కరిష్యంతిహినిశ్చయం॥
తేషాంనామానివక్ష్యామి శ్రుణుభూపసమాహితః।
సాఖశ్చదాపలశ్చైవ నాగపుర్యధిపావరా॥

మంచకఃకటకాధీశః ప్రతాపతశ్చభూపతిః।
గయాదేశాధిపోవీరో దండకారశ్చభూపతిః॥
దండకారశ్చకేదార దేశరాజశ్చవీర్యవాన్।
చిత్రకూటాధిపోవీరో మందనాథశ్చభూపతిః॥
అంధతీదేశనాథశ్చ కాకలోహింభూపతిః।
బ్రహ్మావర్తాధిపోవీరో రంతిలారశ్చవీర్యవాన్॥
ఏతేచాన్యేచబహవ స్సంభూయక్షత్రియోత్తమాః।
నందభూపేనభూపాలాః యుద్ధంకృత్వాదినత్రయం॥
జితాస్తేనమహారాజేన కారాగృహమధిష్ఠితాః।
ఏవంనందోమహారాజో జిత్వాదేశాధిపాంస్తదా॥
కారాగృహప్రతిష్ఠాశ్చ కారయిష్యతిశాసనాత్।
కారాగృహేవర్తమానాస్స్వాచారపరివర్జితాః।
క్షత్రవేషవిహీనాశ్చ శస్త్రాస్త్రపరివర్జితాః।
స్నానసంధ్యావిహీనాశ్చ హోమముక్తివివర్జితాః॥
వేదోక్తాచారహీనాశ్చ శూద్రాచారైకతత్పరాః।
శూద్రానీతోదకంసమ్య గ్గృహ్యమాణాశ్చభూమిపాః॥
మత్స్యమాంసాదనాశ్చైవ శూద్రాఇవశిఖావృతాః।
కారయిష్యంతిరాజానః శాసనాన్నందభూపతేః॥
ఏకచ్ఛత్రాంసపృథివీ మనుల్లంఘితశాసనః।
సంవత్సరశతంనందః పాలయిష్యతిమేదినీం॥
కారాగృహేవర్తమానాః పంచాశద్వత్సరాత్పరం।
సింఖప్రముఖరాజానో హైన్యవృత్త్యైకజీవినః॥

నందస్యచనమస్కారం కృత్వాముక్తాశ్చతేనవై।
నియోజితాశ్చతేనైవ నందేనైవదురాత్మనా॥
కృషికర్మపరాశ్చైవ భవిష్యంతినసంశయః
కించిత్కాలంహితత్రైవ స్థిత్వాసాంఖముఖాన్నృపాః॥
వింధ్యస్యదక్షిణేభాగే సముద్రప్రాంతమండితాన్।
కళింగాంధ్రవిదర్భాంగ దేశానాగత్యభూమిపాః॥
తదాదిభూమిపాలాశ్చ సూర్యసోమసముద్భవాః।
పూర్వోక్తేనప్రకారేణ భవిష్యంతినసంశయః॥
దాక్షిణాత్యాశ్చోత్తరికాః ప్రాచ్యాఃపూర్వదిశిస్థితాః।
సోమాన్వయసముద్భూతాః తస్యనందస్యభూమిపాః॥

వశిష్టకౌండిన్యధనంజయానాం
గోత్రోద్భవాకాస్యపగోత్రజాతాః।
శూద్రాఇవాత్యంతగృహీతవేషాః
భూపాభవిష్యంతికలౌయుగేహి॥

కలౌయుగేస్నానవిహీనకాశ్చ
సంధ్యాదివేదోక్తసుకర్మశూన్యాః।
సర్గాదిదోషేణవివర్జితాశ్చ
భూపాభవిష్యంతిహిచిత్రకేతో॥" అని,

దీనినంతయుం జదివినపిమ్మట పాఠకులు శూద్రవేష ధారులగు క్షత్రియులు కొందరున్నట్లుగా గ్రహింపఁగలరు. అట్టివారు ఆంధ్రాదిదేశములలోనే స్థిరపడినట్లుండుటం బట్టి వారిపద్మనాయకులను నామమున నుండిన శాఖవారుగా నను

మానింపఁబడఁగలరు. అట్లు కాదనువా రట్టివారు మఱియెక రున్నారని చెప్పఁగలరేమొ యోచించి చెప్పఁగోరెదము. పై మనయూహలు యథార్థమైయైనచో శ్రీనాథునిచేఁ జెప్పంబడిన వెలమలు పటలు మొదలగు తక్కినశాఖలవారును యేల కాఁగూడదని యూహింతము. అట్లూహించునెడల నీ శాఖలలో క్షత్రియధర్మములును, ఆచారములు సివరిలో మిక్కలిగాఁ గానుపించునో వారే క్షత్రియపూర్వులని యూహింపవలసియుండును. పై శాఖలవారిలో నందరిలోపలం బరిశీలింపనీ పద్మనాయకులను శాఖవారిలోఁ దప్ప కడమశాఖలవారిలో నీ క్రింది యాచారము లెవ్వారిలోపలం గానరానట్లు స్పష్టము కాగలదు. అవి యెవ్వియనగా:—

1. పైతృకకార్యములు చేయునపుడు కాశీజన్నిదమని చెప్పంబడు పట్టుతోఁ గట్టంబడిన యుత్తరీయము ధరియించుట.

2. వివాహకాలములో నగ్న్యారాధనమునకు మారుగా నైదుదినములలో నఖండమగు దీపారాధన నుంచి తదారాధన యైదుదినములుదనుక చేయుట.

3 జాతమృతా శౌచములలోఁ బండ్రెండుదినములే పట్టుట.

4. క్షత్రియులతో సహపఙ్క్తి గలిగియుండి భుజియించుట.

ఇంకను మఱికొన్ని క్షత్రియాచారములును క్షాత్ర ధర్మములును గలిగియుండుటఁ బట్టిచూడ క్షత్రియు లేకారణాంతరముననో వేదోక్తకర్మలు మానుటచేత శూద్రత్వము నంది యిట్లున్నారని నిస్సంశయముగా నూహింపనై యున్నది. ఆ విషయమైన సంవాదము ప్రస్తుతములో మాని పైని చెప్పిన క్షత్రియులతో భోజనంబుల సహపఙ్క్తి గలదనుదానిని గ్రంథమూలముగాఁ జూపించుటకుఁ గల యొకవృత్తాంతము నిచ్చో వివరించెదను. అది యెట్లనిన:—

కొండవీటిదండకవిలెలో "ఒక కాలమున ఢిల్లీపాదుషా యోరుగల్లు కోటపై దండెత్తి దానిని లగ్గలకుఁ బట్టగా నపుడు కమ్మసేనానులు యుద్ధసన్నద్ధులై విశేషముగా యుద్ధముసేసి యోడిపోయిరి. అపుడు ప్రతాపరుద్రుఁడు వెలమవారిని బిలువ నంపించి కోటనిల్పుడ"ని చెప్పఁగా వారిలో ముఖ్యులు ఆ రాజుతో నిట్లనిరి. "స్వామీ మేము దేవరకుఁగా ప్రాణములు సమర్పింప సిద్ధముగా నున్నాము. మేము జీవించియుండఁగాఁ బరరాష్ట్రీలు కోటలోఁ గాలిడరు. మేము విజయమునంది వచ్చితిమేని తమతో సహపఙ్క్తియును సమానప్రపత్తియు నీయ వేడెదము." అనుడు రుద్రుండు దానికి సమ్మతించె నపుడు వారు కోటబురుజుల నాక్రమించి ప్రాణముల కాసింపక దానిని సంరక్షింపఁ బరరాష్ట్రీలు చేయునదిలేక విచ్చిపోయిరి. అపుడు ప్రతాపరుద్రుఁడు వెలమవారియెడ మిక్కిలి కృతజ్ఞుఁడై వారలకు సహపఙ్క్తి యొసఁగి యందలి సేనానులకు వారివారి గౌర

వానుసారముగ జాగీరులును, మొఖాసాలు మొదలగువాని నొసంగి గౌరవించెను. అందలి సేనానులును తమతమ సైనికులకుఁ దమ జాగీర్లలో మొఖాసాలలో నీనాములు, భూములు మొదలగువాని నిచ్చి వారంపఱు మఱియొక జీవనమునకుం బోవక యుండునట్లుగాఁ గట్టుచేసికొనిరి. నాఁడు మొదలు నేటి వఱకును వెలమవారు కట్టికట్టు దాటకనే యుండి తమతమ మర్యాదలఁ గాపాడుకొనుచున్నారు.

ఈ వృత్తాంతము యథార్థమైన దైనట్లుగా నిప్పటికిని యోరుగల్లుప్రాంత్యములనుండు క్షత్రియులు వెలమలతో సహపఙ్క్తి చేయు నాచారమును బట్టి యూహింపనై యున్నది. అయితే క్షత్రియులు నాలవజాతివారితో సహపఙ్క్తి యిచ్చి భుజించుటకుఁ గారణమేమైయుండవచ్చునని యూహింపనై యున్నది. ఇందుకుఁ గారణ మొక్కటియై యుండవలయును. ప్రతాపరుద్రునినాటికిఁ బైన వివరింపఁబడిన సాహనికాలములోని క్షత్రియులలోఁ గొందఱు శూద్రప్రాయులై యుండుకథ మిక్కిలి వ్యాపకములోనుండి యప్పటికి నేయేగోత్రముల క్షత్రియులు శూద్రప్రాయులై యుండిరో యా వృత్తాంతము మనకంటె నానుపూర్వికగాఁ దెలిసియుండనోపు. అందుపైని వెలివేయఁబడిన క్షత్రియులుగా నుండినవారిని వెలితీర్చి తిరిగి కొంత యుపకారము చేయుకోర్కెతో వారికిఁ దన సహపఙ్క్తి నిచ్చి ప్రతాపరుద్రుఁడు గౌరవించిన గౌరవించి యుండవచ్చును. లేకున్న నుత్తమక్షత్రియుడుగా నుండిన ప్రతాపరుద్రుఁడు జాతిచేతను

శూద్రులుగా నుండెడువారిని పఙ్క్తిని బెట్టుకొని భుజియించుట యేలగల్గును.

అయితే విష్ణుపాదజులు శూద్రులని చెప్పియున్నచో నీ పక్షనాయకులగు వెలమ లేల శూద్రులుగారని యుపన్యసింప నగునని శంకించెదము. అట్టి ప్రశ్నమునకు సమాధానము చెప్పుటకుఁ బూర్వము శూద్రత్వ మెన్నివిధములుగ నున్న దను దానింగూర్చి యాలోచింపవలసియున్నది.

---

## సచ్ఛూద్ర శబ్దార్థ నిరూపణము.

---

ద్విజాతులగు బ్రహ్మక్షత్రియవైశ్యులు ముప్పురును జన్మ కాలమున శూద్రులేయనియును, వారికిఁ గర్మచేతను ద్విజత్వము కల్గుననియు "జన్మనాజాయతేశూద్రః । కర్మణాజాయతేద్విజః" అను శాస్త్రముంబట్టి చెప్పవలసియున్నది. వీర లేవరకుఁ గర్మ లను చేసిన నావరకును ద్విజులును దాని యభావమున శూద్రులు నగుదు రనుదానికి దృష్టాంతముగా ద్విజులు కొన్ని తప్పుకార్యములు సేయునప్పుడు పతితసావిత్రులై పోవుదురనియు నట్టిపట్లఁ దిరుగ నుపనైనసంస్కారము చేసికోవలయుననియు శాస్త్రమున్నది. ఏ కారణముచేనైన నది లేనివాడు శూద్రుండై యట నుండి తమవంశముననగా సంతానమును శూద్రులుగా నొనరించెదరు. అయితే యిట్లుగా శూద్రత్వముబొందిన ద్విజా తులు జన్మచేత శూద్రులుగా నుండెడువారికంటె నధికులై ద్విజా లకంటెఁ దక్కువగాను వ్యవహరింపఁబడుదురు. కావుననే

యిట్టివారింగూర్చి వ్రాయుచో వీరందరును సచ్ఛూద్రులని గ్రంథాములయందు ననుసంధించిరి. మన యాంధ్రదేశములో నిట్టివారు మఱికొందరుగూడ నుండవలెగదా! వారెవ్వ రెచ్చో నున్నవారని శంకించవలసియున్నది. అట్టివా రున్నారనుట యుక్తిసాధ్యమేకాని చారిత్రములు లేకుంటచేత నిర్ధారించేసి చెప్ప వీలులేకయున్నది అయిన నొకటి రెండు స్పష్టతముల నీ విషయంబునం జూపుదము.

మనశాస్త్రములో సచ్ఛూద్రులని మొదట రెండువర్ణములవారికిమాత్రమే చెప్పంబడినది. వారెవరనగా "సచ్ఛూద్రోగోపనాపితౌ" అని. అనగా గొల్లలును మంగలులును సచ్ఛూద్రులని. వీరియెడల శూద్రులకు నిర్ణీతములైన శూద్రత్వాది ధర్మములు కొంచెముగానో గొప్పగానో నేటివఱకును గానుపించుచున్నవి. అయితే నీ రెండువర్ణములవారును సాధారణముగా శూద్రులని మనదేశములో వ్యవహరింపఁబడు వెలగాలు, బలిజీలు, కమ్మవారు, రెడ్డివారు అను శాఖలవారికంటెఁ దక్కువగా వ్యవహరింపఁబడుచును వారికి సగ్రవర్ణములవారివలెఁ బరిచర్యాదులు చేయుటయే స్వవర్ణధర్మముగా గ్రహించుచున్నారు. అయితే శూద్రులలో శూద్రు లిట్లు ప్రవర్తించుట యసంగతముకాదాయని యూహింపవలసియున్నదికాని వేఁదియో తగినంత యాధిక్యములేనిది వర్ణాశ్రమ ధర్మప్రచారమే ప్రధానముగనుండు మన హిందువులలో నిట్టి గౌరవము కలుగదు. అటుఁగావున నిపుడు మనమట్టి గౌరవకారణము లేవియై

యుండుననిమాత్ర మాలోచింపవలసియున్నది. దానికిఁ బైన మనము చూపించినదే కారణమై యుండవచ్చును. ద్విజాతుల లోనివారలు కాలాంతరముల నొక్కొకతఱి యిక్కట్టు వచ్చి నప్పుడు స్వవర్ణాశ్రమ ధర్మములు చెడిగాని లేక మఱి కొన్ని యితర కారణములచేతఁగాని శూద్రత్వముఁ బొందుచువచ్చిరి. ఆ హేతువున వారు శూద్రులని వ్యవహరించఁబడినను, నీచత నంది యొకవిధమగు గౌరవమును నిల్పికొని కాలక్షేపము చేయుచున్నారు. ఇట్టివారేవర్ణమునుండి వచ్చియుందు రను దానినిమట్టుకు నిర్ధారణచేయుటకై చరిత్రాధారములేక వలను పడదు. కాని మనదేశమున వ్యాప్తమైయుండు బ్రాహ్మణాది వర్ణములకుఁ గల జీవికలం బట్టి అది కొంత నిర్దేశించఁ దగి యున్నది. అనగాఁ దమకుఁ బూర్వోక్తవర్ణమునకే వ్యాపారము జీవనాధారముగా నేర్పడియున్నదో యా వ్యాపారముననే యా వర్ణమువారు శూద్రత్వము నందినను అవలంబించియుండుట నైసర్గికము. దానింబట్టి బ్రాహ్మణులలోనుండి శూద్రత్వము నందినవారు విద్యావ్యాపారములచేత జీవించుచుందురనియు, క్షత్రియులలో శూద్రత్వము నందినవారు యుద్ధాదులకుఁ దగు వృత్తులు సంపాదించుకొని జీవించుచుందురనియును, వైశ్యులలో శూద్రత్వము నందినవారు కృషివాణిజ్యాదులవలన జీవించు చుందురనియు నిఁక సచ్ఛూద్రు లనంబడు గోపనాపితులు అగ్ర వర్ణసేవారతులుగా నుందురని యూహింపవలసియున్నది. దీనికి దృష్టాంతముగ బ్రాహ్మణులలోనుండి శిష్టికరణములు మొద

లగువార లుత్తర దేశ సంప్రదాయానుసారముగ లేఖకులై విద్యాజీవనముచేతనే యున్నారనియును దక్షిణదేశ బ్రాహ్మణ సంప్రదాయముల మఱికొందఱు శూద్రులు కలియుగములో బ్రాహ్మణుల కాపద్ధర్మమగు కృషినే ముఖ్యముచేసికొని కృషికులై గ్రామములలోపలఁ బెత్తనములు వహించియున్నారనియుఁ జెప్ప నొప్పియుండు. తెలగాలని చెప్పఁబడువారీశాఖలో వారని చెప్పుట కనువైయున్నది. వీరినే మహానాటివారని వచించెదరు. ఆంధ్రదేశమున నీ మహానాటివారికిని మంత్రులను నియోగిబ్రాహ్మణులకును విశేష మైత్రియును పర్ణధర్మాదికములు నడిపించుటకుఁ దగినపెత్తనములు నీయంబడినవి. ఇఁక రెండవవర్ణమువారగు క్షత్రియులలోనుండి శూద్రత్వమునందిన పద్మనాయకులు మొదలగువారలు యుద్ధాదులుచేసి జీవించుటయే స్వవర్ణధర్మముగాఁ బ్రవర్తించుచున్నారు. వీరికిని క్షత్రియులకును యుద్ధాదికార్యములలోఁ గల ధర్మములన్నియు సమానములే. తక్కిన మూడవశాఖలోని వైశ్యుల కృషివాణిజ్యముల నవలంబించి జీవించు శూద్రశాఖలు వైశ్యత్వమువదలి శూద్రత్వము నందినవారుగాఁ జెప్పనొప్పును. ఇదియునుఁగాక యనులోమవిలోమ జాతులవలనఁ గల్గిన ద్విజబంధువులవలన మఱికొన్ని శూద్రశాఖ లేర్పడినట్లు కాన్పించును. అవి యాయా వర్ణములవారి కేర్పడిన జీవనములఁబట్టి యేర్పరింపఁబడవలసినవే కాని వానిని ప్రత్యేకము నిర్ణయించి చెప్పుటకు నితర సాధనములు లేవు. ఇదియునుఁగాక యీ కాలములో బ్రాహ్మణాది

వర్ణములవారు కాలానుగుణ్యములైన ధర్మము లవలంబించుటం జేసి వారిలోనుండి శూద్రత్వము నందినవారి ధర్మములు సరిగా నిర్ధారణలేక యుండవచ్చును. అట్టివారిని స్పష్టపఱచుట మఱియును గష్టసాధ్యమై యుండును. కావున నింతకంటె వివరించి వ్రాయను.

పద్మనాయకులగు వెలమలకుఁ గల క్షత్రియధర్మములును వానితో సంబంధించిన కొన్ని పద్యము లిదివరకే మఱియొక సందర్భమున వివరించియున్నాఁడను. ఇపుడు మఱియొక సందర్భమునుండి కొన్ని పద్యములు పద్మనాయక చరిత్రములోనివే వివరించెదను.

క॥ సుజనులగుబంధుజనులను । గజిబిజిలేకుండ సమతఁగాచిన
వాఁడే । భుజవీర్యుఁడైన వెలమని । నిజముగ గజపతియుఁ
బల్కె నిపుణతమీఱన్॥

సీ॥ మానంబుతగుగాఢమహిమోన్నతిఁ జెలంగు మానంబు సాహి
త్యమాన్యగుణము । మానంబు నృపతికి మున్ననమోదవించు
మానంబు దాతకుఁ దానకింబు । మానంబు విప్రశౌంటీమానధ
నంబును మానంబు సాధ్వికి మంజువ్రతము । మానంబు సత్కు
లమహిమను సంపాదించు మానంబు దేవసామాన్యపథము । నట్టి
మానంబు వెలమలకాస్పదంబు । నమితపతిహితసన్మానమందు
ఘనులు । గజపతిద్రోహిగండాంకకలితయశులు । వీరులైనట్టి
నెఱుమన్నె వెలమవారు॥

## పద్మనాయక వీరపత్నీ వర్ణనము.

---

సీ॥ పతియొసఁదిలకించి భయశోకములుమానితనువసిఁగోసఁగినతరు
ణిపగిది । పురుషునిప్రాణిక్కఘటింపఁబూని ప్రత్యయమునననలం
బుఁజొచ్చినవనితరీతి । నాశ్రితరక్షకై యసువులొసంగినస్ఫుర
యశోభాసి ఘూసుదతిపోల్కి । మునిశాపవశమునమృతుఁడైన
పురుషునితోడ నెచనినపూఁబోడికరణి । చంద్రమతిసీతభృగు
పతిసాధ్వీమణ్యాది । తెగువచేమించువీరపత్నీవ్రజంబు । గలిగి
శోభిల్లుచుండుకీర్తికులమునందుఁ । పద్మనాయకవనితైక పటిమఁ
బొడలి॥

## పద్మనాయక వంశమునుగూర్చి మఱికొన్ని వర్ణనలు.

సీ॥ పద్మనాయకవంశపావనుండగు నేనిగోత్రసంతానాదిపాత్రమె
లయిఁగి । కాలినయుంచునుగిళవెళంబ ఏక కాకతీయమటంచుఁగ
నటులేక । నొవ్యానమండలాద్యుపస్థంబునకును నొప్పైనాయ
కులంచునొగడుగొనక । సంగ్రామభూమినిజయలక్ష్మిఁజేకొన్న
గ్రహమండలముదూరిగరిమగొన్న । పిరుసులనెల్ల వినుతించి
యర్చించి । తత్ప్రధానత్రితంధనరదనిపి । వాలెనేనివాడు
వంశవర్ధనుఁడయ్యె । నిహాముపమ్ముసౌఖ్యమహిమగాంచు॥

సీ॥ పరిపంథిభద్రేభపంచాననుండైనయున్నసాహెబుఁగానిమనుప
లేడు । హాలాహలాహారు గోలాయుధసమానమానధుర్యుఁ
డుగానిపూనలేడు । తుండాగ్రపిపుయుంపుతోప్పండసాహప్ర
ఘణిసమానుఁడుగానిపట్టలేడు । హాటకాసురప్రాణహారిసన్య

కేసరిదంభధుర్యుఁడుగానిదనుప లేదు। ఈచరిత్రంబుకొలదు లే
యితరులకును। ననుగమింపనసాధ్యంబులవనిలోన। వితరణ
గుణాదిసాహసవిదుఁడుగాని। యితరులుగణింపనోపరీవితత
మహిమ॥

సీ॥ మానసంపన్నుఁడై మహిలోన వెలసిన గాంధేయవృత్తియుఁ గ
లుగవలయు। ధైర్యంబుగలిగియుధరలోన వెలసిన స్థైర్యమూ
వహిలంగఁ వనంవలయు। శౌర్యసమగ్రతసాహసంబందెనా
పాటవాటోపతఁబరగవలయు। వీరాగ్రగణ్యుఁడై వినుతులు
గాంచినదానధారాస్ఫూర్తిఁ బసరవలయు। జలధికైలాస
రఘురామజామదగ్ని। రీతులనుబొందతనకువిఖ్యాతియనుచుఁ।
బలికెగజపతిపస్మజప్రకరమునకు। నీతికోవిదఘనకీర్తినిసిలుపుట
కును॥

సీ॥ భామలపూచెండ్లబలుతుపాకులగుండ్లనొకటిగదాపస్మజోత్త
ములకు। గామినీసుఖరతికదనశస్త్రాహతియొకటిగదాపస్మజో
త్తములకు। సంగనాహాసంబుసంగరోల్లాసంబునొకటిగదాపస్మ
జోత్తములకు। గలికిగుబ్బలపోట్లుకడిదిబొంకువేట్లునొకటిగ
దాపస్మజోత్తములకు। సట్టిపస్మజసాహసంబభినుతింపఁ। గాంచి
జెందెడుబెదరిక్లిష్టుఁడైన। వంగనృపుఁడైనఁగాళింగవనుఁడు
నైన। బౌండ్యుఁడైననునావోళిపతియునైన॥

క॥ ఉన్నతపతిహితసత్యుం। బెన్నడుదప్పండుభాగ్యహీనుండైనన్।
మున్నాచంద్రమతీపతి। చెన్నునఁబగుచున్నవెలమచిరతర
యశుఁడై॥

సీ॥ ఒక్కటిపదియయ్యు నొసరనూఱైనను మాటనుదిరుగని మాన
ధనులు । మిన్ను నుపరియలై మీఁదికినొఱిఁగిన ధైర్యంబువిడు
వని శౌర్యఘనులు । భాస్కరచంద్రులుపద్ధతుల్ దొలఁగిన మేర
దప్పనియట్టి మేటిమగలు । పగతీపదనుకీనుదగసుప్తియాహార
వాంఛలనుడిగడివంగుశాస్యు। లతులితౌదార్యవిశ్రుతులలఘు
మతులు। న్యాయవర్తనకాకతిరాయభర్త। జన్యసౌజన్యులై లోక
మాన్యులగుచుఁ । బద్మకులజులుహరిపాదపద్మభవులు॥

సీ॥ రెడ్డిసంతతికినూఱొడ్డిభేదంబైన నలుముధ్ధరించిరీ వెలమవారు
పక్షనాయకమానభంగంబుగాకుండ బలియురై నెగడిరీవెలమ
వారు । శ్రీదేవికాకతిగణపతిఁగొలిచియునిలనేలుప్రభువులీ వె
లమవారు । కాపులమాటకై కడఁగి వెలమలయందు నిలిచిన
సూరులీ వెలమవారు । సమరగాంగేయపటిమచేజనువారు।
మిగులమానంబునకుఁ బ్రాణమిచ్చువారు । వినయఘనులైన
నెఱిమన్నె వెలమవారు । స్వజనఖ్యాతిచేభువిఁబరగువారు॥

సీ॥ పదుగునేగురునూఱ్లుబవరానఁగూలినఁ గొమ్మిచ్చియునలపైఁగ్రు
మ్మువారు । గుఱ్ఱపుపిఱ్ఱముపైఁగూర్చియుఁ బెమ్మాకగుదిగాను
నరదముల్ద్రిప్పినారు । మనసేనవిఱిగినమునిలించిబెరువెంచికోస
మీసునఁబుట్టఁజేసినారు । దానపాత్రంబులుధరలోనఁబ్రక
టించినిఖిలదేశంబులునెలపినారు । భటులకన్నుజుట్టమేప
ట్లగలఁడ । టంచుసర్ద్రసంగతినవనిమీఁద। నిలుపవలయును
ననుమాటనిశ్చయముగ । గిట్టపగఁజేసెబ్రహ్మంమఘనుఁడు
భువిని॥

క॥ వీరులగుపద్మనాయక । చారిత్రముపూర్వరచితశాసనరీతిన్ ।
ధీరులగురవిసరస్వతి । వారనుసరించి యధికవాచాగరిమన్॥

ఇది పద్మనాయకవృత్తాంతసంగ్రహము. ఇట్టివృత్తాంతములను శాసనరూపముగఁ జేయించిన కాకతీయప్రభుఁడను నాతఁడెవరని కొంచెము విచారింపవలసియున్నది. అందుకుగాను పద్మనాయకచారిత్రములో వ్రాసినవృత్తాంతమే మాత్ర మిటఁ బొందుపరిచి ప్రభువంశపుచారిత్రములో నతని రాజ్యవిశేషాదికమంతయు వ్రాసెదను.

---

## పద్మనాయకచారిత్రములో ప్రతాపరుద్రుల చారిత్రము.

---

శ్లో॥ శ్రీమద్గుర్జరజపీఠస్థ స్సమ్రాట్ శ్రీరాజ్యభాసితః।
సోయం ప్రతాపరుద్రాఖ్యః కాకతీయనగాధిపః॥
యోగరీశ్వరమానవర్ధనపర శ్రీమత్ప్రతాపాంకితో।
రుద్రోరుద్రపరాక్రమోగజపతిః ఖ్యాతో రాజన్యకే॥
రాజేంద్రాదికకిరీటకోటిఘటిత శ్రీమానత్నరత్నప్రభా।
జ్వాలాజ్వాలవిభాళిదీపకళికా నీరాజితాంఘ్రిద్వయః॥

శా॥ శ్రీశైలస్థితమల్లికార్జునపదశ్రీవర్ణసంసేవితుం । డాశాదంతిగిరీంద్రకూర్మఫణిరాడత్యంతభూభారవాహుం । డీశానోగ్రవరప్రభావజనితుండింపొందునోర్గంటిలో । శాశిద్వారగబాధపీఠదరుఁడై చెల్వొందెగుణాంబునన్॥

సీ॥ తనకీర్తి ధళధళల్ దశదిశలను నిండచంద్రశేఖరునంశజననమం
ది। తనలక్షణ ప్రాశస్త్యవిశారదులకు బ్రౌఢిప్రతాపకప్రభలు
బూని। తనధైర్యపటిమంబు వినుతింపకథకులివికసితహారిలీల
వీకనేలి। తనశౌర్యమహిమంబుగొనియోడశూరులుపాదుపా
నిగళైకబద్ధులజేసి। భయదదోర్దండకరవాలభైరవుండు।మూరు
రాయరగజకేసరిముఖ్యబిరుదు। మండలాధ్యక్షకోటీశమకుటర
త్న। సుకృతిశాపుండుకాకతీరుద్రవిభుడు॥

వ॥ కాకతిరుద్రమనివారు స్వప్నోపద్రవంబునకై మల్లికార్జున
దేవుని నారాధించగ స్వప్నమందు ప్రత్యక్షుండై తెలిపిన
వృత్తాంతము. ఇట్లు కాకతికులదీపకుండైన ప్రతాపరు
ద్రుండు రాజ్యంబు బరిపాలించుచు భూతభవిష్యద్వర్త
మాన త్రికాలవేది గావున నిందువాసరంబున మల్లేశ్వరు
నకు నుమాయుక్తంబుగా షోడశోపచారంబులం బూజా
విధానంబులు సల్పి నిర్వ్యాప్తిరణశాలియై నిద్రించుసమ
యంబున భక్తజనావనదీక్షాపరుండైన మల్లేశ్వరుండు సాక్షా
త్కరించి నీవు తలంచిన యర్థంబు వృద్ధికరంబగు. భావి
కార్యంబునం గాకతిపీఠంబు నుద్ధరింపంబడునని యంత
ర్హితుండయ్యె. నా కార్యంబులు మనోనిశ్చితంబులని
మేల్కాంచి.

సీ॥ దొరలుమున్నూరును దోడ్తోడ నేతేరదగుమంత్రివరులును
దండనదువ । నుత్తరదేశస్థులెక్కొత్తరాజులునడిచినెనుబది
వేలునిండిక్రొలువ। గొత్తళంబులవారుహత్తుకనడువగొలక

నాయకులునుపిక్కటిల్ల । పరభేదనోపాయభళిరకాకతిరాయ
యనివందిజనములునభినుతింప । బోరలువచ్చెదుకంచుకుల్
దెరలుసేయ । మౌక్తికచ్ఛత్రమొప్పంగమందగమన । మునను
సభవద్దకేతెంచిముఖ్యనియతి । నిండుకొలువుండెరుద్రభూ
మండనుండు॥

వ॥ ఇట్లు కొలువుండి మంతనంబున నిజమంత్రి నాలోకించి గౌళాధిపతి నియోగంబున మ్లేచ్ఛులగర్వోద్రేకంబును, తన్నివారత్వసంధానంబును, స్వప్నాద్యంతవర్తమానంబునుఁ జెప్పిన నతం డట్లు చేయుమనినఁ బ్రహృష్టహృదయుండై.

సీ॥ దశకంఠుగర్వంబు తలఁగించు కొరకునై రఘురాముఁ డెంతయు
లాఘవమున । ప్లవగగోలాంగూలభల్లూకరాక్షసగణముల
నొకదారిగముచునట్లు । మ్లేచ్ఛులమస్తిష్కమేదోపఖండముల్
గుండెలుప్రేవులుద్దండముగను । భూతజాలమునకుభుక్తిబెట్టఁ
దలంచిదండియామగలనుద్దండలీల । నుగ్రమాయంత్రశస్త్ర
లనునిచినట్లు । మేటికోటలువారునిక్కమేలుజయము । గనియె
మనియెనుగజపతిగౌరవమున । రూఢిప్రౌఢిమరెండవరుద్రుఁ
డనఁగ॥

క॥ నెరమన్నెలువరమన్నెలు । కురుమన్నెలుగొలువఁబద్దకుల
జులకెల్లన్ । ధరమన్నెవెలమనామము । గురుఁడాదిమరాయ
రుద్రకుంజరుఁడొసఁగెన్॥

సీ॥ గాంభీర్యధైర్యముల్ గానలపాల్జేసి మేటిమానుషమునకట్టెటఁగ
లిపి । పద్మకులన్యాయపాటినిదప్పించిశౌర్యసాహసములుశాత

మెదపి। నిజరంధ్రములమూల నెలవులుగానక పరరంధ్రముల
చిక్కుబరపు లేక । క్రొంచెపుసిరియయ్యుమించుగర్వంబునఁ
జుట్టాలహితులనుజుల్కఁజూచి। జాతిమాత్రోపజీవులై చంచ
లమున। వెలమలనుచునుమర్యాదవిధమ్ముమాని। స్వేచ్ఛ దిరి
గెడివానినిసేకరింపఁ। బాటిదప్పినవాఁడెపోకాచకొందమ॥

ఉ॥ కాకతిరుద్రపౌత్రుఁడగు ఖండితవైరిప్రతాపరుద్రుఁడుఁ। నేకత
శాసనప్రతిభ నిత్యయశోమహిమాభిరాముఁడై। లోకము
నందునెల్లలకుఁ హాషియుఁదజ్జనన ప్రశస్తముఁ। బ్రాకటయుక్తి
నేర్పరిచెభానుశశిప్రతిభాతిఁబొల్పగుఁ॥

ఉ॥ ఇచ్చితిరాజ్యముల్ ధనములిచ్చితి మేరునగోపమంబుగా। మె
చ్చియునాసనద్వయము మేలిమినిచ్చితిఁ జెల్వి రెడ్డికిఁ। వచ్చ
ము లేనుగోత్రముల వారిగనిచ్చితిఖ్యాతిగీర్తియుఁ। హెచ్చు
నుగాననీయుఁడని యేర్పడ వేడినవారలందఱుఁ॥

సీ॥ పద్మనాయకశౌర్యబలయశోధుర్యాయయనివిప్రశేఖరులచటఁ
బలుక। ధాటిగానుక పేంద్రతండంబులెల్లనుగీర్వాణసామితి
నిర్వహింపఁ। గరినంబెవిలసిల్లుగజపతియనుమతిభట్రాంక
బిరుదాంకప్రౌఢిమెఱయ। దక్కినవారెల్లఁదగియునామర్యా
దచేరికమీఱియవ్వారిగొనఁగ। నిస్సాణదుందుభినినదంబు
చెలగంగసకలభావ్యంబులుసరవిమ్రోయ। చెటిలమైశక్తి
త్రితయంబుచెలఁగివెలుఁగ। మూరురాయరుసంప్రతిముదము
నొంద। సకలవినినొగసరిణతిసంభ్రమించి। పద్మనాయక
నికరంబుప్రబలెజగతి॥

గీ॥ ప్రబలియున్నట్టియాతఁడతిభావమెఱిఁగి । రుద్రమూర్తియును తాస్నహాయాభిమెఱియ । గరుణవాటిల్లవిద్వాంసకవులఁబ్రీతి నాదరించెనుశ్రగహారాదివిధుల॥

రుద్రుని ముఖ్యపట్టణమగు నేకశిలానగర వర్ణన.

వ॥ "కృష్ణా గోదావరీ మధ్యస్థలంబున దండకారణ్యక్షేత్ర స్థానంబునఁ గాకతిపీఠంబునకు మొదలైన నోరుగంటిపట్టణ ప్రభావంబు వర్ణింప నెవ్వరితరంబుగాదు. కావున నింద్రలోకంబు చందంబునఁ గోరినకోర్కె లొసంగుచుఁ గామధేనుకల్పవృక్ష చింతామణి సమానులైయున్న గృహస్థులును, చతుర్ముఖ సమానులైన విద్వాంసులును, రామమాంధాతృభగీరథ రఘువీర యయాతి సమానులైన క్షత్రియులును, రంభోర్వశీ సమానులైన వారకామినులును, నైరావతోచ్చైశ్శ్రవ సమానంబులైన చతురంగబలములును, అసహాయ శూరవిక్రమమూర్తు లనఁదగిన వీరభటులును, అనవరత వివిధవాద్యతూర్యఘంటారవ రమణీయంబులైన మహాదేవస్థానంబులు లెక్కింపఁగా ... ... ... 4,900

వేదఘోషసముద్రంబులైన విప్రగృహములు

అందు పురోహిత సదనంబులు 700 ... 9,900

కమనీయతరంబులైన గణికనికేతనంబులు ... 6,900

దత్తోహప్రముఖంబులైన పంచాణమువారి

గృహంబులు ... ... ... ... 60,900

| | |
|---|---|
| కాంచనరచితగంధకస్తూరికాముక్తికవిద్రుమ నవరత్నాది సకలద్రవ్య పరిపూర్ణంబులైన వేశ్యాలయంబులు ... ... ... | 16,800 |
| బిరుదాంకివాగ్ధాటీగణితచమత్కారులైన రాజ భటులు ... ... ... ... ... | 500 |
| రత్నప్రభాభాసితంబులైన బలిజనిలయంబులు | 60,95,000 |
| ప్రధానులైన గణికులకు మనోహరంబులైనవి యొనగూర్చ నొప్పుమిగిలిన యిండ్లు ... | 5,000 |
| విరహజనమనోహరంబులైన వేశ్యాగృహంబులు ... ... ... ... ... | 1,26,000 |
| మరియు ననేకసువర్ణబృందసుందర భేతాళ హనుమంత, చాణూర, ముష్టిక, శ్రీకృష్ణ బలరామ ప్రతిమావిభాసిత ద్వారాంగణ ప్రదేశ భాసమానంబులైన మల్లస్థానరంగంబులు ... ... ... ... ... | 360 |
| అగణ్యజన వస్తువాహన సమృద్ధితంబులైన యొక్కొక ఆమడ విస్తారంబు గల్గిన పెద్దయంగళ్లు ... ... ... ... | 84 |
| వాడలు ... ... ... ... ... | 65 |
| పాలెములు ... ... ... ... ... | 518 |
| సిద్ధంబునొంది యరవైవేల యేనూరు పసిడి కుండల నలంకారంబులై యహోరాత్రంబులు మ్రోయుచుండు భేరులు ... | 585 |

| | |
|---|---|
| నిస్సాణంబులు ... ... ... ... | 585 |
| గల్గి యంబుధి ఘోషంబు ననుకరించి యింద్ర లోకంబు తనయందుననే గలిగియుండు నూరుగంటి పట్టణంబునకు ధనకనక వస్తు వాహన సమృద్ధిదంబైన రాజగ్రామం బులు ... ... ... ... ... | 1,25,000 |
| నిరుపాధికంబులైన యగ్రహారంబులు... ... | 12,000 |
| గలిగి నాగరీయభాషా విశేషసంభవులైన సామంతులు... ... ... ... ... | 100 |
| తనభుజబలంబున నేలుచుండు కాకతీశ్వరుఁ గొలిచి నానాదేశంబుల కధిపతు లగుచున్న నాయకులు ... ... ... | 77 |
| పరభేదనోపాయకులైన నగరిపదాళ్లు ... ... | 308 |
| సంగ్రామచతురులైన నగరిపరివారము ... | 95,000 |
| దిక్కులు ప్రఖ్యాతియైన నగరిమొక్కటీలు ... | 25,000 |
| సమరనిశ్శంకులైన సమయనాయకులు ... | 5,000 |
| పరబలంబుల కోలాహలంబు సేయఁ జాలు శూలాలబంట్లు ... ... ... ... | 2,900 |
| నగరుమహేశులు ... ... ... ... | 12,000 |
| నగరికోలాతము ... ... ... ... | 4,95,000 |
| రాజునకు రత్నకీలితంబులైన కాంచనపల్లె రంబు లిడు కామినీజనంబులు ... | 300 |

క్రొత్తగాఁ గొల్చిన యుత్తరదేశరాజనికరం

బులు ... ... ... ... ... 80,000

తురంగంబులు ... ... ... ... 1,50,000

వీరపాండ్యరాజుం గెలిచి జయంబునఁ దెచ్చిన

యేనుంగులు ... ... ... ... 1,199

గాకపురమాతంగంబులు ... ... ... 12,000

ఇట్లపారవిభవసంపద నానందకరంబై మేడల

మడుగులు, మందిరంబుల సందరంబై,

కిన్నరేశ్వరపురంబుం గెలిసేయుచు, నఖండై

శ్వర్యంబున రెండవ దేవేంద్రుండై,

మూరురాయగజదళాంకుండై ప్రతాప

రుద్రుండు (35) ముప్పదియైదు సంవత్సర

ములు రాజ్యముసేయుచోఁ గూర్చిన ధనం

బులు ... ... ... ... 65,00,00,000

కలుగోట దేవస్థానంబులు ... ... ... 79,00,000

ఇవి యాదిగాగ బహువిచిత్రంబులఁ జెలువుంను.

---

## ప్రతాపరుద్రుని యాహ్నికము.

---

అరుణోదయసమయంబునఁ బరిమళమిళితంబైన తైలం బున నభ్యంగసంబై, మంగళగాయకసంగీతనాదంబులు, భూరి భట్టాంకబిరుదులు, కైవారంబులును, భూసురాశీర్వాదంబులు

హృదయానందంబును బొందింపఁ బన్నీటి దకంబుల జలకం బవధరించి యనర్ఘ్యవస్త్రసంకలితగాత్రుండై చతురుండైన మల్లికార్జునదేవుని కరపల్లవంబు లవలంబించి, వసంతుచందం బున మందయానుండై మౌక్తికఛత్రంబు మెరయఁ గొలువుకూ టంబునకువచ్చి రాజసింహుండు సింహాసనాసీనుండై నిండోల గంబుండి చర్చాసమాయుక్తచిత్తుండై యుండును" అని.

---

## రుద్రదేవుని కాలనిర్ణయము.

---

దీనింగూర్చి పద్మనాయకచారిత్రములో రెండువిధము లుగా వ్రాయఁబడియున్నది. ఎట్లన్నను:—

క॥ ఆయతశకవర్షంబులు । వేయుంబదియగుచుభువినివెసగ్రహ
సంఖ్యం । బాయకచెల్లునుబిదపఁ । హాయనఖరఫాల్గుణాది
యందుజనించెన్॥ అనివ్రాసి,

గీ॥ ఆదిబడబాహ్ని భట్టునునమితశక్తి । కేళికేమనదీనిసంస్కృత
మొనర్చె॥ అనివ్రాసె,

ఇందలి పై పద్యములోఁ జెప్పంబడిన శా॥ స॥ 1010-వ సంవత్సరమునకు సరియైన ఖరసంవత్సరమని యుండుటంబట్టి యీ చెప్పిన కాలపరిమాణము తప్పైనట్లుగాఁ జెప్పవలెను. అప్పటి ఖరసం॥ శా॥ 1033 అగును. మఱియొకస్థలములో మాత్రము "వెలయ ముప్పదిమూఁడువేయుశతాబ్దముల్ వర ఖరవత్సరిఫాల్గుణంపు" అని వ్రాసియుండుటచేత నిదియే సరి యైన కాలనిర్ణయమని నిర్ణయింపవచ్చును. అయితే రుద్ర

నామముగల రాజులు కాకతీయవంశస్థులలో ముగ్వురున్నారు. వారిలో నీ పై శాసనముచేసిన యతని కాలము కొంచె మెచ్చు తగ్గుగా నిర్ణయించుటకు మఱియొక శాసనోధారము కూడ నుండిన ననుకూలముగ నుండునని యెంచి మఱియొక శాసన ముంగూడ నీ రుద్రదేవునిదే యింపఁ బొందుపరచెదను. అది యోరుగంటి రుద్రేశ్వరులకు నీయంబడిన గ్రామ దానశాసనము. ఇట్టి శాసనమా రుద్రేశ్వరాలయములో నొక స్తంభము పయిం జెక్కఁబడియున్నది. ఆ శాసనమే రుద్రమహారాజు రాజ్య విశేషములు వివరించును గనుక యతనింగూర్చి విశేషము వ్రాయుం బనిలేదు. ఆ శాసనమెట్లన్నను:—

---

* కాకతిరుద్రనృపశాసనము.

---

"స్వస్తి శ్రీవిజయాభ్యుదయశ్చభవతు స్వస్తి సమధిగతపంచమహాశబ్ద మహామండలేశ్వర, అనుమకొండపురవరేశ్వర, పరమమహేశ్వర, పతిహితచరిత, వినయవిభూషణ, శ్రీమన్మహామండలేశ్వర కాకతీయ రుద్రదేవరాజుల విజయరాజ్యముత్తరోత్తరాభివృద్ధి ప్రవర్తమాన మాచంద్రార్కముగా ననుమకొండ పట్టణమందు సుఖసత్కథావినోదంబున రాజ్యంబు సేయుచునుండ శకవర్షంబులు 1024 అగునేటి చిత్రభానుసంవత్సర మాఘు శు॥ 13 బృహస్పతివారమునాడు తనపేర రుద్రేశ్వరమును శ్రీవాసుదేవ శ్రీసూర్యదేవరను బ్రతిష్ఠచేయించె.

---

* ఇది యథామాతృకముగ వ్రాయఁబడినది.

శ్లో॥ యస్యోత్తుంగతరంగతాడితవియత్స్రోతస్వినీయంజలం । పాదాం
గుష్ఠనఖాగ్రదఘ్నమభవద్భూమండలోద్ధారణే । దంష్ట్రాకో
టికటీశకోటిగతం త్రైలోక్యమబ్బింసవ । దృప్తోండాయిత
గోముకూపనికరం వాదేవరాహంహరిః॥

2. శ్రీహేరంబబిళంబకుంతలమిలస్మల్లీదళత్కుట్మల । శోభాశో
భితకుండలుబ్ధమధుపప్రాణోత్సవస్యాస్పదః । స్ఫీతప్రీతమనా
భవత్వమిహ మేదిగ్దంతిదంతద్యుతిః । ప్రోద్దామోద్ధతవైరివిక్ర
మలసద్దంతాంతికాంతి ౨ (శ్లో ౨)॥

3. నూతేనదుగ్ధలహరీభిరుదంచతీవ । దుగ్ధోదధేరమృతవీచివిని
ర్మితేవ । శ్రీఖండపిండపరిపాండురవృత్తిలీవ । వక్త్రేవసత్వవి
రతంతుసరస్వతీనః॥

4. భారద్వాజకులశ్రియఃపరిబృఢశ్శ్రౌతక్రియాకర్మఠః । శ్రీరా
మేశ్వరదీక్షితోజనయితాయస్యక్షితావగ్రణీః । సోచింత్యం
ద్రవగోర్ధయామృతయతేశిష్యాయతేశ్రద్ధయా । శ్రీమద్రుద్ర
నరేశ్వరస్యసుమతేవర్ణావళీవర్ణ్యతే॥

5. శ్రీమత్త్రిభువనమల్లోంజాకాకత్యవంశసంభూతః
ప్రబలరిపువర్గనారీవైధవ్యవిధాయకాచార్యః॥

6. శ్రీకాకత్యనరేంద్రబృందతిలకోవైరీంద్రహృత్తాపకః । సత్పా
త్రేవసుదాయకఃప్రతిదినంకాంతామనోరంజకః । దుష్టాకాం
తాచయకోపకఃపురహరశ్రీపాదపద్మార్చకః । న్యగ్భూతీకృత
నాయకస్త్రిభువనేశ్రీమల్లదేవోబభౌ॥

7. తత్పుత్రశ్శివపాదపద్మయుగళధ్యానామృతానందభూః । స్లంతాకోరిపుసుందరీజనమహాసౌభాగ్యసంపచ్ఛ్రియః । ప్రోలిరాజ ఇతిప్రసిద్ధిమగమద్వైరీంద్రదర్పాపహః । నిశ్శంకప్రథనప్రబంధనమహాహంకారలంకేశ్వరః ॥

8. హస్త్యారోహణకర్మకర్మఠగతించోళాఖ్యచూడామణిం । శశ్వద్యుద్ధనిబద్ధగహ్వరమతింయుద్ధేబబంధక్షణాత్ । శ్రీమత్తైలపదేవమంబుదనిభస్తంబేరమస్తంక్షణాత్ । ప్రఖ్యాతోరిపుకంఠఖండనవిధౌభక్తానురాగాజ్జహౌ ॥

9. యోకుంఠోరుపతేరకుంఠపరశుస్తీక్ష్ణాగ్రధారోల్లస । ద్ధారాపాతనిపాతనైకచతురంగోవిందరాజాన్వయం । బద్ధోన్ముచ్యుతమైడయక్షితిధృతేరాజ్యందదౌలీలయా । ఖుంఠాకోవిషయస్యతస్యసమరేసద్వీరదీక్షాగురుః ॥

10. కృద్ధేనోద్ధరమంత్రకూటనగరీనాథోధయోనిస్త్రిపో । గుండఃఖండితఏవముండితశిరఃక్రోడాంకవక్షస్థలః । ఏడోడింభకవత్పలాయనపరోజ్ఞాతోగతస్స్వాంపురీం । ఆహూతోపినరేశ్వరస్యపురతఃప్రోలేనయుద్ధాయయత్ ॥

11. అన్యచ్చానుమకొండనామనగరీంసంవేశ్యయోయంస్థితో । నానామండలికాన్వితోభువిజగద్దేవస్యదేవప్రభః । స్తబ్ధస్తంభితఏవకార్యకరణేశక్తఃక్షణాన్నిర్గతః । శ్రీమత్ప్రోలనృపస్యతస్యజయినఃకింబ్రూమహేగౌరవం ॥

12 దేవీముప్పమనామధేయసహితాయస్యాగుణస్తారకాః । కీర్తిశ్శారదచంద్రికేవవిలసత్కాంతేస్తునైవోపమా । కౌసల్యేవచ

జానకేవచసతీకుంతీవపద్మావతీ । పౌలోమీవచచండికేవచ
తథాతస్యాభవద్భామినీ॥

13. తస్యాస్తస్యసుతో౽జనీహపరమానందైకనందాంకురః । కామః
కిం నలకూబరశ్శివసుతస్స్కందో౽జయంతో౽థవా । జిష్ణుర్వాప్ర
ధరో౽థవాహారిరయందస్రాకుమారౌనవా । భర్తుశ్శ్రీగిరిసింహి
తాయజగతాంశ్రీవీరరుద్రోనృపః॥

14. ప్రోద్యత్తుంగతురంగపుంగవచయాయోహాక్రియాకర్తృతాం । ద్యో
మాచానుపరాక్రమక్రమభరంభుక్త్వావసన్ప్రీలయా । కర్ణం
పార్థఇవామరైశ్వరశరైఃవిద్రావ్యవిద్రావ్యయా । తేభేస్వా
విశేషయుక్తనగరగ్రామంసరుద్రోనృపః॥

15. ఈడేమేడవిడంబడంబరభరత్క్షోదక్షమంత్వాంభృతాం । దుర్వా
రోద్ధరవీరమంత్రసమయాందానైకదీక్షాగురుం । శ్రీమన్నైకగి
దేవనాగసమయప్రోద్భూతదర్పాపహం । ప్రాప్తశ్రీపాలవాస
దేశవిభవంశ్రీరుద్రదేవంసదా॥

16. భీమేనభీమనకులేనకులేనహీనో । గస్తోమమారగృహమూ
షకవత్సరేణ । మార్జారడింభకవశేనమహాంధకారే । నోకర్ణ
నామభుజగోభువిశూరతమోసి॥

17. శ్రీమద్రుద్రపరాక్రమోద్భవభవవ్యామోహనాశోల్లసచ్ఛ
స్త్రీత్రస్తసమస్తగోత్రవిలసచ్చోడోదయత్క్ష్మాపతేః । ఉన్మత్తా
ఇవవిస్మృతాఇవమహాభూతాభిభూతాఇవ । ప్రోద్భ్రాంతా
ఇవసంకులాఇవతదాప్రాణాఃప్రయాతాదినం॥

18. యాతేపి తైలపనృపే దివమస్య భీత్యా । సర్వాతిసారకబళీకృత
గాత్రయష్టౌ । శ్రీరుద్రదేవనృపతేః పృథువిక్రమస్య । భీమో
పిరాజ్యపదవీం క్షణికాం సలేభే॥

19. ఏకో జంబుకడింభకో లఘుతరైస్సంవేష్టితో జంబుకైః । రాజా
హంకృతధిక్కృతక్షితితలస్సింహేన సంస్పర్ధతే । భేత్తాళాకుల
గర్జితైస్తు ఖరయన్ సర్వాదిశో విహ్వలో । యాతః క్వాపి సపవ
ఘూనన భగైః కంఠీరవస్యాతురః॥

20. తద్వద్భీమనృపాధమో నరపశుర్హాతుస్స పత్నీసుతో । హంతా
భ్రాతృవరస్య భోజనవిధౌ భీమేన సంస్పర్ధతే । ఆకాశప్రసనప్ర
యాసనిరత శ్రీరుద్రదేవేనయ । త్స్వర్ధావర్ధితగర్వపర్వతమ
హాశృంగాగ్రమారోహతే॥

21. శ్రుత్వా భీమనృపస్య రాజ్యవిభవం భాగ్యైశ్చ దుశ్చేష్టితం । శ్రీమ
ద్రుద్రనరేశ్వరో ధవిజయప్రారంభసంభారభాక్ । జాతో
జాతరిపుస్సమగ్రపృతనా మేనాపుణా యోజిత । స్సద్యస్సజ్జబ
లాన్వితః ప్రముదితశ్శీఘ్రం శ్రియైనిర్గతః॥

22. యస్యోద్వేలజయప్రయాణసమయే గంభీరభేరీభవ । ధ్వాం
కారోద్భవసంభ్రమవ్యతికరవ్యాజృంభణోద్వేగతః । భ్రశ్యం
త్యభ్రచయాశ్చలంత్యవనయో భ్రామ్యంత్యమీభూధరాః ।
కూర్మో భ్రామ్యతి ముహ్యతి ద్విరసనః కుంఠంతి దిక్కుంజరాః॥

23. కోశాన్గేహాన్వ్యముంచన్ పథికరితురగాన్బాంధవానర్ధమార్గే ।
దుర్గేష్వంతఃపురాణి ప్రతిభయచకితా రుద్రదేవస్య భీత్యా । య

స్ఫోటోద్వేగేభ్రమంతస్సమరసమయయస్సారగంభీరభేరీ । భాం
కారాకీర్ణకర్ణజ్వరభరతరళాః ప్రేక్షితాశాక్షితీశాః॥

24. గత్వాజవాత్త్రిచతురాణిపదానిరాజా । సస్యస్యఖండనమివ
ప్రథమాహుతింవా । భ్రూభంగవీక్షణవివర్ధితకోపవహ్నేః । స
ద్వర్ధమాననగరీం ప్రథమంజుహావ॥

25. యస్యాక్షివీక్షణభయాచ్చకితస్యభీమా । దుర్యోధనస్యనృప
తేరివవిహ్వలాంగః । స్వభ్రాతృమాతృవనితాస్సహితస్సము
ద్రే । లక్ష్మీంవిహాయవనమేవయయావిలజ్జః॥

26. తత్పృష్ఠతోనుచజగామసదాహరాజా । చోడోదయస్యన
గరీమగరీయసీంతాం । లంకామివామరపురీసదృశీంమృగాక్షీ ।
శ్రేణీవిలాసలలితామివచాంజనేయః॥

27. ఉలాకచవనంతత్ర మగ్గమర్గళవిభ్రమం ।
తదాగమకరోత్తత్ర పురమధ్యేమ్భుతంమహత్॥

28. కందూరోగయచోడవంశవిలసత్క్షీరాబ్ధిగర్భోద్భవ । త్వద్ర
కాశ్రయరుద్రదేవనృపతేః కింవర్ణ్యతేవిక్రమం । క్షుద్రద్రోహాత్ర
కులోన్నతిక్షయకృతస్సర్వావనీశ్రీభృతో । రామస్యేవకుఠా
రఖండితరిపువ్రాతస్యపృథ్వీపతేః॥

29. రంగత్తుంగతురంగపుంగవఖురక్షుణ్ణంజగన్మండలం । జ్యో
త్స్నోల్లాసితవాతపత్రనికరవ్యాప్తంనభోమండలం । పూర్ణేం
దూత్కరచారుచామరచయైర్దిఙ్మండలంసంభృతం । దృష్ట్వా
సైన్యవినిర్గమంనరపతేః ప్రాద్రుద్రువుశ్శత్రవః॥

30. కాంచీమండలవింధ్యమధ్యనిలయాశ్శీమానయఃపార్థివాః। యస్యశ్రోత్రపథంగతాఅహరహశ్శ్రీరుద్రదేవస్యతే । దృష్ట్వావానిమిషాబభూవురమరీవర్గస్యమర్త్యాశ్చిరం। ప్రత్యావృత్యతమేవరుద్రనృపతింప్రాప్తాశ్శరణ్యార్థినః॥

31. రుద్రంస్తౌమినరేశ్వరంబహుశతానేకశ్రియోభాజనం । కృత్వాయస్యకదాపిచేతసిముదాశంకానసంక్రామతే । ఏకశ్శ్రీపురుషోత్తమంకలకలైఃకృత్వాశ్రియోభాజనం । పీపీనాంకురుతేఘునాపివసుధాముజ్జాగరాంసాగరః॥

32. న్యగ్భూతీకృతరాజహంసనికరఃపద్మోద్భవైకాశ్రయః । శ్రీరుద్రశ్చతురాననోబుధవరానందైకహేతుర్భృశం। నానాశాస్త్రవిచారణైకచతురోబ్రాహ్మీవిలాసాశ్రయః । కల్పాష్ఠిగతిఃక్షితావిహశతానందస్స్వయంపార్థివః॥

33. సత్యాసక్తమనానిరస్తనరకక్లేశశ్చలత్స్వాశ్రయః। పృథ్వీహృద్యదనంతభోగనిలయశ్శశ్వద్ద్విజేంద్రప్రియః। దృష్టారిష్టవిమర్శనస్సుమనసామభ్యర్థితార్థప్రదో। గోత్రప్రోద్ధరణస్సుదర్శనకరోరుద్రస్స్వయంకేశవః॥

34. అసమసమరసంగోత్తుంగమాతంగకుంభ । స్థలవిదళితముక్తాహారభారాభిరామః। భవభవభయదగ్నాభామినీభవ్యనేత్రో। త్పలదళభవభూషశ్శోభతేరుద్రదేవః॥

35. అస్మిన్ప్రకాసతిమహీంభువిరుద్రదేవే। రాజాభిధాశశిసినైవనరోత్తమేషు। ఈశత్వమిందుతిలకేనధనాకులేషు । తేజస్వితాదినకరేనచశాత్రవేషు॥

36. కేశగ్రహాస్సురతసంగరసంభ్రమేషు । దండగ్రహాయతి
షు నైవజనోత్కరేషు । శాస్త్రేష్వివ వకథనంవ్యవహారకేన ।
నక్వాపిదుష్టమథనంమథనంత్వరణ్యా ॥

37. దానం సైన్యపరాభవావధిరిపుచ్ఛేదావధిర్విక్రమ । శ్చాతుర్యం
చతురాంగనావధిగుణగ్రామస్త్వసంఖ్యావధిః । తేజోభాస్క-
రతాపనావధియశోరాశిస్తుకుద్రస్యయి । త్రైలోక్యాక్రమ
ణావధిర్నిరవధిర్ధర్మేమతిశ్శోభతే॥

38. ప్రాప్తశోపి మహాత్తోపి మహతామేకాశ్రయోప్యాశ్రయో ।
జనస్థానమపిప్రసన్నహృదపిత్వంరత్నధామోపిసన్ । పీతఃసం
భసముద్భవేనజలధేస్తారఃసముద్రోయతో । నైపేంద్రదనరే
శ్వరోయమమునాస్వస్థాంవృథామాకృథాః ॥

39. ఔదార్యంసురశాఖినశ్శిఖరిణస్స్వర్ణాకృతేర్గౌరవం । ధైర్యం
దాశరథేర్బలంపురభిదోగాంభీర్యమంభోనిధేః । సౌందర్యం
మకరధ్వజాత్సురగురోర్విద్యాంతితింకౌతుకా । దాదాయాప్యస
ముద్భవేనరచితశ్శ్రీరుద్రదేవప్రభువ ॥

40. స్థాయత్తైరవతీంపురః బుజపతిస్స్పష్టాంబుజత్యంబరం । లో
లంనీలసరోజతిస్స్ఫుటయశోదుగ్ధాంబుధేసంప్రతి । జ్యోతీంషి
స్ఫుటబుద్బుదంతిహరితఃకూలంతికాలాస్త్రియ । శ్చంచద్వీచి
చయంతియస్యజయతిశ్రీరుద్రదేవప్రభుః ॥

41. పాదన్యాసశిలాశ్శిరాంసిసమరేకృత్తానిఖడ్గేనయ । చ్ఛత్రా
ణాంపతితాసిమాంసపిలసత్పంకేథశంకేహ్యాహం । రక్తస్రోతసి

రుద్రదేవజయినోనృత్యత్కబంధేతదా । హ్యయాంత్యాపి
జయశ్రియశ్చసవిధంకీర్తేఃప్రయాంత్యాదిశః॥

42. తస్యాస్తేనుమకొండనామనగరీశ్రీరాజధానీవయా । యత్రో
ద్యత్పదఖండఖండపరశువ్యాజృంభణోజ్జృంభితా । కందర్పస్య
పురీవసారతిమతీశృంగారభావాన్వితా । మాహేంద్రీవచజిష్ణు
విష్ణుసహితారంభావిలాసోచితా॥

43. యత్ర స్త్రియోమకరకేతనరాజధాన్య । ఆనీలనీరజపలాశదృ
శఃకృశాంగ్యః । త్రైలోక్యసుందరదృశాంతిలకాయమానా।
ఆపీనతుంగకుచకుంభభరాలసాంగ్యః॥

44. యత్రద్విజేంద్రభవనేషునివార్యమాణాః । కీరాఃసరంతిపట
ప్రావటుభిస్సమేతాః । సర్వాంగసంగతసమస్తవిచారచారు ।
చారిత్రచర్చితపదక్రమయుక్తవేదాన్॥

45. వేశ్యాగృహేషుసురతోత్సవజాతిమాత్ర । శబ్దానుకారిశుకశా
బకకీరుశబ్దాః । సర్వాదిశోముఖరయంతిదివానిశానాం । కంద
ర్పదర్పతరఘూర్ణవపూర్ణచంద్రాః॥

46. నాతిక్రామతివైష్ణవంపదమితిద్యాంగౌరితిష్ఠామిమాం । పాదై
స్త్రిక్ష్యతినోతురంగమచయశ్శ్రీరుద్రదేవస్యయః । సర్వాశాః
పరిపూరయన్విజయతేనృత్యేనసంక్షేపయన్ । శత్రూన్యుద్ధ
మహీతలేప్రతిదినంవిద్రావయన్మారయన్॥

47. అతిరమణశరీరాన్యేచనీచస్వరాఢ్యా । స్సకలతురగశాస్త్రి
ద్భాసిసల్లక్షణాఢ్యాః । జవభరభరితాంగాస్సత్వసంపన్నగో
త్రా । అతిచిరతరజీవాఃపంచధాస్తురంగాః॥

48. రాజ్యంప్రాచ్యాంలవణజలధేస్తీరపర్యన్తమస్య । శ్రీశైలాంతంప్రచరతిసదాదక్షిణస్యాంసమగ్రం । ప్రతీచ్యాంశాకటకనికటస్థాయినీరాజ్యలక్ష్మీః । కౌబేర్యాశాతటవిలసితామాల్యవంతంప్రపేదే॥

49. అర్చనార్థమిహదత్తవాన్సహో । న్నద్రిచేటపలనామఖేటకం శ్రీమహేశకవిశౌరిణాస్థిరం।రుద్రదేవనృపవర్తతన్వతా॥ అని,

ఈ రుద్రుని రాజ్యమునకు హద్దులు.

తూర్పు సముద్రము.

దక్షిణం శ్రీశైలం.

పడమట కటకం.

ఉత్తరం మాల్యవంతము.

మాల్యవంతం.




Note.—ఈ శాసనార్థముల నిర్ణయించుటకుగాను నావలన నొకయుపన్యాసము రచియింపఁబడి యాంగ్లేయభాషలో ముద్రించి యిదివరకే ప్రకటింపఁబడినది. ఆ కారణమున నీ గ్రంథములో నీశాసనములో వివరింపఁబడిన రాజులయొక్కయు, రాజకార్యములయొక్కయు వివరము చేసి యీరాజు కాలము నిర్ణయింప గమనించలేదు.

శ్రీరావువారను వంశనామముఁగల కుటుంబమునకుఁ జతుర్థవంశజులలోని ప్రథమశాఖయగు పద్మనాయక కులమను నాఖ్య యున్నశ్లోకవరలోనే వ్రాసియున్నాను. దానింగూర్చి పద్మనాయక చారిత్రములో నీ క్రిందివర్ణన కానుపించుచున్నది. ఎట్లనగా :—

శా॥ వేమాఱుం బ్రణుతింపయోగ్యమగుచుఁ వేదాంతవిద్యావధూ। సీమంతోజ్వలభూషణాగ్రపదవీసిందూరరేఖాయిత। శ్రీమద్గంధపరాగబంధురహరిశ్రీపాదపద్మోద్భవం। బైమించుఁ భువిఁ బద్మనాయకకులం బానందవిఖ్యాతమై॥

ఇట్టి పద్మనాయకకులములోఁ బ్రసిద్ధమగు రేచర్లగోత్రములో ఆదిజగన్నాథరావు అనునతఁడు మూలపురుషుఁడు. ఈ పురుషునింగూర్చిన విశేషములు, పద్మనాయక చారిత్రములో వర్ణింపఁబడలేదు. కాని సామాన్యమగు నొకవర్ణన కానుపించును. ఎట్లన్నను :—

క॥ "మేదినిశౌర్యమ్ము గేంమం। డాదిజగన్నాథరాయుఁడనఁగజనించెఁ। శ్రీదనరఁదత్కులంబున। నాదిత్యసదృక్ప్రతాపుఁడై భుజశక్తిఁ॥

సీ॥ నిఖిలభూములయందు నెగడెనేన్నృపసూళివరదానకల్పకతగుచయంబు। దిగ్భాగముల చెంతఁ దెలివొందెనేరాజునరసకీర్తిసుధాంశుకిరణరాజి। శత్రురాట్పురవీధిఁ జక్కాడెనేమేటితురగఖురాహతధూళిసమితి। నిరతంబుమార్గణనికరంబు కేధీరుకారుణ్యమిలహేమతారవితతి। యనినుతింపంగఁబద్మినాయ

కులలోన । భుజబలోద్దండమధితారిభూపరూప । రమ్యు డాది జగన్నాథరావువినుత । ధైర్యనిర్జితవిబుధభూధరము ధరను." అని,

ఇట్టి జగన్నాథరావు మొదలు పెరుగ ననుస్యూతముగా సంబంధము తెలియలేదు. కాని యీతని వంశ్యులలో పోల నృపతినుండి కొంతవరకు ననుస్యూతముగు వంశావళియును, కొంతవర కావంశ్యుల చారిత్రములును వివరింపఁబడినవి. అవె ట్లున్నదన:—

క॥ ఆపరమపావనాన్వయ । దీపకుఁడై పోలిరెడ్డిధృతిజనియించెన్ । ఆపుణ్యగుణవరేణ్యుం । డేపునఁజెవిరెడ్డిగనియెనిలవినుతింపన్॥ అని,

— · ——

## చెవ్విరెడ్డివృత్తాంతము.

ఈతనివృత్తాంతము కొంత విపులమైనదిగాను, దొరకిన వరకు యథామాత్రకగా వివరించవలసియున్నది. పేరుకు మాత్ర మాది జగన్నాథరా పీ వంశమునకు నాదిపురుషుఁడుగాఁ జెప్పం బడినను వంశావళీగ్రంథముల వారందఱును నీ పురుషునినుండి యే వంశావళి నారంభించిరి దానికిఁ గారణ మీతనినాఁడు వీరి వంశస్థులకు విశేషధన సంప్రాప్తియగుటయుఁ దద్ద్వారముగా రాజసన్మానము కల్గుటయు, కులమువారంతటి కీతనిమూలముగ స్థిరవృత్తి స్వాస్థ్యములు లభించుట మొదలగు ననేక విశేష

కార్యములు జరుగుటయై యున్నది. కాని యింకను విపులముగా గాథలు దొరికియుండినఁ జారిత్రమున కెంతయు నుపయోగముగా నుండును. ఒక్క పద్మనాయక చారిత్రములోపలను దానింబట్టి వ్రాయఁబడిన వెంకటగిరివారి వంశావళిగ్రంథములో మాత్రమే యీ గాథలు కానుపించును. అయిన నట్టివాని నేకముగాను చేసియుంచుట మంచిదియని వాని నీక్రింద వివరించెదను. ఎట్లన:—

ఉ॥ ధారుణిఁ జెవ్విరెడ్డి ఘనసూనృతలనాథులు సన్నుతింపఁగా । వీరవరే
ణ్యుఁడై సమరవిక్రమనిర్జితవిక్రమార్కుఁడై । పేరువహించె
బంధుజనబృందము లెల్లను సన్నుతింపఁగాఁ । గూరిమి నోరు
గంటి నొకకొన్ని దినంబులు వన్నె మీరఁగన్॥ అని,

ఈ పద్యముంబట్టి యీ చెవ్విరెడ్డి వీరుఁడనియును, విక్రమశాలియనియును నోరుగల్లు గ్రామమునఁ (ఏకశిలానగరమున) గొన్ని దినములు వసియించియుండెనని తెలుచున్నది.

ఉ॥ అంతనకంచనాగ్రనిమహాబలుఁడప్పుడు పేరిసీమలో । పంతగ
నింపుసొంపెసఁగ వేముగనాయునగంటిలోపలన్ । పంతము
మీఱ సోదరులపాటిని * నాడకుఁ బిన్నపెద్దయై । కొంతవహిం
చె నచ్చటను గోరికఁ దా వ్యవసాయ సంతతిన్॥ అని,

ఇట్లుండ పై చెవ్విరెడ్డి యోరుగల్లుపురి వదలి పేరిసీములో నియామనగల్లను గ్రామమునకు వచ్చి యచ్చటఁ జోదరులపాడని చెప్పంబడు నొకభూమిలో వ్యవసాయము నుంచించె.

* పా. సోదరులపాటిని.

అట్టి వ్యవసాయమునకుఁ బాలికాపుగా రేచఁడను నొక పంచ
ముని నిర్ణయించి యుంచెను. నిత్యమును వానికి నియోగించ
వలసిన పనులుఁ నిర్ణయించి చెప్పుచుండెను. గావున నొకనాఁ
డాపంచమునితో నాగభైరవుఁడను నొక చేనుతిరుగుడికిడ నునను
యొక్క పొలముం దున్నుట కాజ్ఞయొసంగె. అట్లు వాఁడాపని
చేయుచుండఁగా నొక శాసనము దొరికినట్లుగా నీ క్రిందిపద్య
మునఁ గాన్పించు. ఎట్లన:—

చ॥ బలయుతుఁడైన రేచఁడనుపంచమునిం జెవిరెడ్డిపిల్చి తాఁ। బొ
లుపుగనాగభైరవునిపొంతలనుండెడుచేనుమున్నఁగా। వల
యునటంచుఁబల్కవినివాఁడెటదున్నుచునుండునంతలో। ప
లనుహలంబుదాకికనుపట్టనుశాసనముద్భుతంబుగన్॥ అని,

అట్లుగాఁ దనకుఁ ద్వారికిన శాసనవృత్తాంతము నారే
చఁడు తనదొర కెఱిఁగించిన లెస్సయని యెంచి యతిసంతోష
ముతో వచ్చి చెప్పెననియును, ఆ శాసనముం జూచుతలంపునఁ
జెవ్విరెడ్డిపోయి దానిం జదివెనని యీ క్రిందిపద్యమున నున్నది.
కాని యీ పద్యసందర్భము పద్మనాయకచారిత్రములో నొక
తీరుగను వెంకటగిరి వంశావళీగ్రంథములో నొకతీరుగ నున్నది.
ఆ రెండువిధములగు పాఠభేదముల నీ క్రిందఁ దెలిపి వాని సందర్భ
ములం జూపెదను. ఎట్లన్నను:—

పద్మనాయకచారిత్రము.

చ॥ కనుఁగొనివచ్చి రేచఁడతికౌతుకమొప్పఁగ రెడ్డిసన్నిధిన్। విను
తవిధేయుఁడై యపుడు వేడుకమీరఁగవిన్నవించఁగా। ఘనుఁ

డరుదెంచిచూచికుతుకంబునసొంతముగాఁబఠించితా । నని
మెను రెండులక్షలపదార్థమునుం డెనటంచువానితోఁ॥

గీ॥ అనుచు రేచనితోఁబల్కె యాధనంబుఁ । దానదిగ్రహింపఁగో
రుచోఁదడయక పుడు । వసుసతోడుతసశరీరవాణిబల్కె । సత్వ
థంబుననుండియాశ్చర్యముగను॥

చ॥ అరుమగనాగభైరవునకద్భుతలీలరహస్యమొప్పఁగా । నరబలి
యిచ్చిపిమ్మటధనంబుఘనంబుగఁగొమ్మటన్నచో । శిరమురవం
చితాతడవుచింతిలుచున్ననురేచఁడప్పుడా । దొరకిటుమ్రొక్కి
యిట్లనియెదుష్కరవాక్యభరప్రదాతయై॥ అని,

దీనిం బట్టిచూడ రేచఁడువచ్చి శాసనవృత్తాంతంబు
చెప్పినవెంటనే చెవ్విరెడ్డి యా శాసనమున్న చేనులోనికి వచ్చి
దానిం జదివి యచ్చో రెండులక్షల పదార్థము నిక్షేపింపఁబడి
నట్లు తెలిసికొని దానిఁ దాను గ్రహింప యత్నింపఁగా సశరీర
వాణి యాకసంబుననుండి నాగభైరవునకు నరబలియిచ్చి యా
ధనము నందవలసినదని చెప్పుటచేత శిరస్సువంచి చింతిల్లుచుం
డెననియు, నట్టి తన ప్రభునిఁజూచి రేచఁడు కొన్ని వాక్యములు
పల్కిన ట్లున్నది.

ఇఁక వెంకటగిరి వంశావళిలోని సందర్భ మెట్లున్నదో
యరయుదము.

చ॥ కనుఁగొనివచ్చి రేచఁడతికౌతుకమొప్పఁగ రెడ్డిసన్నిధిఁ । విన
యవిధేయుఁడై యపుడు వేడుకతోడుతవిన్నవింపఁగా । ఘనుఁ

డరుదెంచిచూచికుతుకంబుగసొంతముగాఁబఠించినె । మ్మన
మునఁజింతయున్ముదముమానకనచ్చెరువంకురింపఁగన్॥

గీ॥ కడురయంబునరేచనిఁగాంచియచట । కంటెనవలక్షవిత్తంబు
గలదునరుని । బలియొసఁగిదీనిఁగైకొనవలయుననుచు । వ్రాసి
యున్నదినిక్కమీశాసనమున॥

క॥ అనిపలికిధనమునకునె । వ్వనిబలిగానిత్తునను చువడలకచిత్తం।
బునఁజింతింపుచునుండఁగఁ।గని రేచఁడు రెడ్డితోడఁ గ్రక్కునఁ
బలికెన్॥ అని,

ఈ పద్యముల సందర్భములోఁ దొమ్మిదిలక్షములవిత్త మున్నట్లును, నరబలియిచ్చి యాధన మెత్తుకొనవచ్చునని శాసనములోనే యున్నట్లును, అట్టిధనమున కెవ్వాని బలియిత్తునో యని చెవ్విరెడ్డి యాలోచించుచుండఁగా రేచఁడు దానికి సమాధానము చెప్పినట్లున్నది. పై రెండుగాథలలో నెద్ది నమ్మఁదగినదో పాఠకులే యూహింపవచ్చును. రేచఁడు చెప్పిన వాక్యము లా రెండుగ్రంథములఁ గొంచెము భేదముగా నొక్కలాగుననే యున్నది. అందు పద్మనాయకచారిత్రములో నెట్లున్నదనఁగా :—

చ॥ తనుబలిగావధించిశుభద్రంబుగనీవుధనంబుగొమ్మన । న్ననయ
మురుఘల్లనన్బలికినట్టిదురూక్తికిఁజింతనొందినా । తనయునికన్న
నేనునిరతంబుగఁబెంచితిమిక్కుటంబుగాఁ । జనుతెఱుగంగ
నిన్నువృధజాటితినొననిపల్కి వెండియున్॥ అని,

వెంకటగిరి వంశావళిలో,

చ॥ ననుబలియిచ్చి చెచ్చెరధనంబును గైకొనుమంచుఁబల్కినా । యనమదిర్ఘుల్లనన్ బలుకునట్టిదురుక్తికిఁజింతనొందినా । తన యులకన్న నేనునిరతంబును బెంచితిమిక్కటంబుగాఁ । జను లెఱుగంగనిన్ను వృథసాకితిపొమ్మనిపల్కె వెండియున్॥ అని,

ఇట్లుగాఁ బల్కి ధనముకొరకు నినుఁ జంపనొల్లననియు నిర్ధనినైయె పుణ్యాత్మునిరీతిఁ గాలక్షేపము చేసెదనని చెప్పి శెట్టి పలికెను. అట్టిమాటలకు సమ్మతింపక రేచఁడు తిరుగ నీ క్రిందివిధంబున నుత్తరమిచ్చిన ట్లున్నది. ఎట్లన్నను:—

క॥ ఇఁకనిన్ను ధనముకొరకై । నికటస్థితిఁదునుమనొల్ల నిర్ధనినగుచున్ ।సుకృతాత్మస్థితిఁజరి పెద । ప్రకటాయుర్భోగమనఁగఁ బంచముఁడనియెన్॥

గీ॥ ఒనరవరమునాకునొసఁగియాపిమ్మట । దునుమఘంబునీకు దొరయదనుచు । విన్నవించితాను వేడెవఁట్రయ । మపుడు ముజ్జగంబులడుగుభంగి॥

పై పద్యములంబట్టి రేచఁడు తనప్రభుని మూడువరములు తన కిచ్చి తన్నుం గునిమినచో నాపాదిత్యంబు తన ప్రభునకుఁ గలుగదని నిశ్చయించి చెప్పె. ఆ వరము లెట్లున్న వనఁగా:—

ఉ॥ ఆమనగంటిగోత్రజుఁడవైనమహాత్మకయిప్పుడాదిగా । నీమము సేయుధారుణివనీపకసంఘములుల్లసన్మతిన్ । గోమలసూక్తి రేచ రలగోత్రజుఁడంచునుతింపఁబూనునా । కామితమర్థిఁగైకొను ప్రకాశితకున్నిజగోత్రమెంతయున్॥

క॥ వినుమింకనీవరాన్వయ । జనితులనాపేరఁబిల్వసలుపుమువా
రున్ । జననాథేశ్వరులగుచును । ఘనవిక్రమశక్తివెలయఁగ
లవసుధరిత్రిన్॥

చ॥ గురుతుగనింక రేచరలగోత్రజులుర్వివివాహమాడుచో । నర
యఁగనాదువంశభవుఁడైతగుపంచమునాదరంబుతోఁ । దిర
ముగఁబెండ్లి సేయుఁడని తెల్పిక్రమంబుననామ్మహాత్ముతో । వర
మనితప్పరాదొసఁగవచ్చునుఁదప్పినహానియేరికిన్॥ అని,

పైదానింబట్టి రేచనివలనఁ గోరంబడినవరములు మూడు. అందులో మొదటిది యామనగంటిగోత్రముఁ గల చెవ్విరెడ్డి వంశమువారికి రేచడిపేరిట రేచర్లగోత్రమువారని చెప్పంబడుట; రెండవది యతనివంశస్థులలోఁ గొందఱికి రేచనిపేరు పెట్టుట; మూడవది పై రేచర్లగోత్రమువారు వివాహమాడుచో ముందుగ రేచని వంశస్థుఁడగు నొక పంచమునికి వివాహము చేయించి యనంతరము తాము వివాహములం జేసికొనుట. అనఁ జెవ్విరెడ్డి యిట్టివరముల నిచ్చి రేచని సంహరింపఁ జేతులురావని యెంచి యాలోచింపుచుండెనను మొదలగు కొన్ని వృత్తాంతములు పద్మనాయకచారిత్రములోఁ జూపట్టును. అవి వెంకటగిరి వంశావళీ గ్రంథములోఁ గానుపించవు. ఆ వృత్తాంతము లెట్లున్నవనఁగా:—

ఉ॥ ప్రాణముతోడదానమికిపట్టుమటంచును రేచఁడన్నని । ర్వా
ణవరేణ్యుఁడప్పుడదియొల్లకనిస్పృహనున్ననాజగ । త్ప్రా
ణుఁడునాగభైరవుఁడుతానుప్రసన్నతఁజెందిముందట । న్శోణి
తలోచనద్వయముశోభిలనిట్లనుతక్షణంబునన్॥ అని,

ఈ పద్యముంబట్టి రేచఁడు తనకు వరముల నిచ్చి తన ప్రాణములఁ గైకొమ్మని ధైర్యముగాఁ బల్కినను, చెవ్విరెడ్డి యూ రేచనియందుఁ గల వాత్సల్యంబున వాని బలియివ్వఁ జాలక యుండెననియు, నపుడు బలికోరుచున్న నాగభైరవుఁడు సాకారుఁడై యెదుట నిలిచి రక్తలోచనములదీప్తులు శోభిల్లఁగా రేచఁడు యాచించిన వరత్రయము నిచ్చియున్నప్పుడు నీకు సందియపడు నవసరము లేదు. నీవు కోరినయర్థము గైకొనుమని తెల్పి యంతర్ధానం బయ్యెనని. ఆ పద్య మెట్లున్నదన:—

ఉ॥ కారణకార్యము ల్దెలుపఁగానసుకట్టినయొప్పుతున్న నీ । కోరిన
యర్థమింగొనుముకొంకక రేచఁడుయాచకర్థిసే । గోరిన
యట్లవానికొనఁగూర్చువరత్రయమాత్మలోనని। కారియనింక
చింతవలదంచునతండువచించి యేగుటన్॥

అని యిట్లుగా నాగభైరవుఁడు పలుక నా మాట లాలించి చెవ్విరెడ్డి సంభ్రమించి వరత్రయ మిచ్చె నదెట్లన:—

ఉ॥ దిగ్గునఁ దేరిచూచినలుదిక్కులుపల్కినవారు లేమిచే । నగ్గల
మైననెమ్మొగమునందరుదందుచుసంభ్రమంబుతో । నిగ్గులు
దేరుమోమునననేకవిధంబులుకోర్కెలూరగా । దబ్బునఁ
బిల్చి రేచనికిదానువరత్రయమిచ్చెనంతలోన్॥

అని యిట్లుగా మూడువరములనే యిచ్చెనని యుండఁగా వెంకటగిరి వంశావళిలో నింకొకవరముఁగూడ నిచ్చి నట్లుగఁ గానుపించును. అదెట్లనఁగా:—

క॥ ఈపాటిజనులు మెచ్చఁగ । నాపేరిటనూరుగట్టుమఖిలములం
దుఁ । చేపట్టుమునీయింటను । యేపట్లను నైనశుభములిత్తును
రెడ్డీ॥ అని,

దీనిఁబట్టి రేచనిపేరుపెట్టి యూరు గట్టించుటకూఁ
మఱియొక వరముగాఁ దేలుచున్నది. దీని కితరగ్రంథదృష్టాం
తము లేదు.

పై రీతిని రేచఁడు వరముల నంది నాగభైరవునియెదుట
నిలువంబడి తన్ను వధియింపుఁడని కోరఁగా నంతట చెవ్విరెడ్డి
యతనిం దనఖడ్గముచే దునిమెను. ఆ వెంటనే యా రెడ్డికి
ధనమంతయుఁ గాన్పించెను. ఎట్లన్నను:—

ఉ॥ ముచ్చటనాగభైరవునిముందఱకందళితాంతరంగుఁడై । చె
చ్చెరనిల్చి రేచఁడు ప్రసిద్ధిగఁదన్ను వధింపుమన్నచో । హెచ్చి
కరాళఘోరసితహేతిశిరంబును ద్రెళ్లనేసినన్ । అచ్చటతద్ధ
నంబుబయల్పడెకనుపట్టెను వేడ్కమీఱఁగన్॥ అని,

ఇట్లుగాఁ గాన్పించిన ధనముంజూచియు దానిం గదు
పక రాత్రి చీఁకటి విశేషించువరకును వేచియుండి పిమ్మట నా
ధన నిక్షేపమును గ్రహించుకొని యింటికిఁ బోయి కొంతకాల
మా యూరిలోనే యుండి యనంతరము పిల్లలమఱ్ఱి యను
గ్రామమునకుఁ బోయి చేరెను. అని యున్నది. ఎట్లన:—

గీ॥ నిబిడఘోరాంధకారంబు నెరయునను । నచటవసియించి
నిక్షేపమటగ్రహించి । పుడమితత్పురిలోఁగొంతఁవడవు మె
లఁగి । మఱియునంతటఁబిల్లలమఱ్ఱిఁజేరి॥ అని,

ఇవ్వోచ్చే వెంకటగిరి వంశావళీగ్రంథములో రేచర్లయను గ్రామమును చెవ్విరెడ్డి పూర్వము రేచనికిఁ దానిచ్చిన వరాను సారముగాఁ గట్టించెనని చెప్పంబడి యీ పురీవర్ణన మొదలగునవి కొన్ని చేయంబడినవి. ఈ విషయమైన యొక్క వృత్తాంతమైనఁ బద్మనాయకచారిత్రములో లేదు కావున నా పురీవిషయమైన గాథ చెవ్విరెడ్డిదిగాక తద్వంశస్థులలో మఱి యెవ్వరిదైన నయియుండవచ్చును. అని యెంచి దాని నొదిలెదను.

---

## చెవ్విరెడ్డి యోరుగంటికిఁ బోవుట.

---

అట్లుగాఁ జెవ్విరెడ్డి పిల్లలమఱ్ఱి యను గ్రామములో నుండి తన పుత్రులకందఱకును శాస్త్రవిద్యల నేర్పించి సేనలం గూర్చుకొని తురగాధిరోహణంబుచేసి యోరుగంటికిఁ బోవుచున్నట్లున్నది. ఎట్లన:—

ఉ॥ ఆదటఁగొన్నినాళ్లకుఁ బ్రియాత్మజులందగుశాస్త్రవిద్యలన్।
సాదరసాష్టవప్రకటసారతరజ్ఞులఁగానొనర్చియు। త్సాదనశౌ
ర్యలీలసముపార్జితుఁడై యలయోరుగంటికి। న్మోదమెలర్పవా
రువముముఖ్యతనెక్కిచమూసమేతుఁడై॥ అని,

ఇట్లుగా నోరుగంటికిఁ బోయి చెవ్విరెడ్డి కాకతిరుద్రుం గొలిచి తిరుగఁ దన యూరునకుం బోవుచుండఁగా నొక కాఱువాన గురిసెననియు నద్దానిం దప్పించుకొనన నొక మఱ్ఱిచెట్టు క్రింద నిలిచెననియు నున్నది. ఎట్లన్నను:—

ఉ॥ కాకతిరుద్రుఁగొల్చియుయకాయకిరాఁగనుజేరిముందట। న్గా
గ్గొనిగాలఁబెట్టుగనుదార్కొనితొల్కరివానమబ్బుతో । దీ
గ్గొనఁజుట్టుముట్టుకొని తెంపుగఁ దానుమహోజ్జ్వలస్థితి ।
న్బొకటునిల్చి చూచి వటభూజముఁ జేరఁగఁ జేరువందగన్॥
అని,

## చెవ్విరెడ్డి పిడుగుం గొట్టుట.

ఇట్లుగాఁ జెవ్విరెడ్డి వర్షబాధఁ దప్పించుకొనుటకుగాను మఱ్ఱిచెట్టుక్రిందఁ జేరియుండునపుడు దానిపై నొక పిడుగు బడుటఁగాంచి తనచేతికోల విసరుటయు నది తప్పిపోయె. ఆ కారణమున పిడుగు తత్సమీపంబుననున్న యతని యశ్వము నచ్చోఁ గూడియున్న జనముల ధరణిపైఁ గూల్చె. అద్దారుణ కార్యంబునకు జంకక నట్టహాసంబు చేయుచు నిశ్చలుఁడై చెవ్విరెడ్డి యుండ నా రెడ్డింజూచి భూతనాథుఁడగు భేతాళుండు దయార్ద్రహృదయుండై యతని రక్షించెదంగాక యని నిజదర్శనం బొసంగిన ట్లున్నయది. ఎట్లన్నను:—

గీ॥ ధరణిఁదొరఁగెడునశనిపాతంబుగాంచి। పిడుగునెడముగఁదన
చేతినిడుదకోల। దప్పెఁదప్పినఘాతకై ధరణిఁగూలె। నశ్వ
మునుగూడుజనులతోనద్భుతముగ॥

క॥ అపుడట్టహాసమెసఁగెడి। నిపుణుండా రెడ్డిధైర్యనిశ్చలుఁడగు
చున్। సతతమునీతనిఁబ్రోతును। నతిశయముగననుచుభూత
నాథుఁడుప్రేమన్॥ అని,

ఇట్లుగా భూతనాథుండగు భేతాళుండు చెవ్విరెడ్డిని గరుణించినట్లున్న కథాసందర్భము పద్మనాయక చరిత్రములో నిదియైయున్నది. అయితే వెంకటగిరి వంశావళిగ్రంథములో దీనికిం గారణ మింకొకవిధముగా నున్నది ఆ కథాసందర్భ మంతయు నీక్రింద వివరించుచున్నాఁడను. ఇదివఱలో రేచని పేరుపెట్టి రేచర్లయను గ్రామమును చెవ్విరెడ్డి కట్టిన ట్లా గ్రంథములో వివరింపఁబడియున్నది. ఈ చెవ్విరెడ్డి యా గ్రామములోనే కాపురమున్నట్లును తత్సమీపమునను న్న భూములం జూచుట కొకనాడు చెవ్విరెడ్డి పోయియుండఁగా నతనికి వర్ష ప్రతిబంధకము గల్గినట్లును, అపు డతఁ డొక చెట్టుక్రింద నిలిచి యుండఁగా భేతాళుం డాతనికి దర్శనమిచ్చిన ట్లున్నది. ఇట్లీ రెండు గాధలును భేదించియుండుటకుం గారణము బోధించదు. ముఖ్యములైన కొన్ని యంశములు భేదించినను రెండింటివలనం గల్గిన ఫలిత మొక్కటే కీర్తి నుండుట చేత నవ్వే వర్ణింపఁబడిన పద్యాదిక మొక్కవిధముననే యున్నది. భేదించియున్న పద్యములు ముందుగా వివరించెదను. ఎట్లన:—

గీ॥ అలరు నెపుడాపురంబున ఖలవిరోధి । బాహుయుగగర్వవిదళ నోపాయభువన । భయదభూరిప్రతాపసంపన్నుఁడగుచు । ధరణిచెవిరెడ్డివిక్రమోద్దండుఁడగుచు॥

వ॥ అతఁ డొకనాడు తత్పురికినవ్వలనవ్వసుధేశుణార్థన । త్కుతు కముతోడఁ బోవబహు ఘోరకరాళరవాకులంబుగా । కుత

లముగ్రుంగ వానసమస్తోన్నఁగనుంగొని ధీరచిత్తుఁడై । య
తులబలుండు చేరెను రయంబునఁ దద్వటమూలమున్నతిన్॥

క॥ చేరినపిమ్మట గజ్జలు । దారుణవైఖరి నిరమ్మదమ్ములు పిడుగుల్ ।
వారకశిలలును మెఱుపులు । ఘోరముగాఁ బర్వ వానగురిసెన్
బెలుచన్॥

---

## భేతాళుఁడు ప్రత్యక్షమగుట.

---

క॥ దానికి నించుక గొంకక । మ్రానిమొదలనున్న రేడ్డిమసలక
గనియె । ష్మానిపయినుండి కుతుకం । బౌనఁగ భేతాళుఁ డాత్మ
నచ్చెరువొదవన్॥

వ॥ అమ్మహామహీరుహావతరణంబు చేసి.

సీ॥ ఘనభయంకరమహోగ్రవిహారనిజదేహవితతదీధితితటిల్ల
తలతోడ । దీర్ఘగాఢాసభ్రమదీప్తజటాభారకాలాభ్రసముద
యోత్కరముతోడ । బ్రహ్మాండకుహరదిక్పుటలాంతసంచార
ఘనతరాటోపగర్జనలతోడ । సకలశిలోచ్చయోచ్చలనకృద్గం
భీరపవనఘుట్టనాదసప్రతిభతోడ । నిలుచు ఘోరావతారంబు
నృపుఁడుగాంచి । కాలవరుణేంద్రుఁడాకారగరిమఁ బూని ।
కినుకమద్ధైర్యమెడలింపఁగిని సెననుచు । గదయుపారించి భీకరా
కారుఁడగుచు॥

చ॥ బెడిదపుకిన్కతోడఁ జడిపించఁగవచ్చితొ లేక నీవు పూర్ణ । బుడమి
కుతూహలోన్నతిని బ్రోవఁగవచ్చితొ నిశ్చయంబుగా । బడి

బడిచెల్వుమన్న విని భావమున న్నెనరొప్ప కన్నులన్ । జడిగొన బాష్పపూరములు సౌహృదయస్థితిఁ జూచియంతటన్॥

అనుపద్యమువరకును గల సందర్భము షట్పునాయకచారిత్రములో లేదు. ఇటనుండి కథాసందర్భ మేకవిధముగానే యున్నది. కావున దానిని యథామాత్రకగా వివరించెదను. ఎట్లన్నను:—

సీ॥ ఘోరకరాళసాంకులదంష్ట్రికామల కాంతిచంద్రికలుముంగల
వెలుంగ । భయదనిర్భరతీక్ష్ణనయనద్వయమయూఖవిపులా
రుణార్చిలు వెలికిఁబొంగ । చండపావకభుజాదండమండితఖడ్గఖర
ధారసంగరక్రమముఁ గోర । పదపద్మయుగళసంభరితరంజిత
రత్నమంజీరరవము వేసునటింప । నద్భుతాకృతితోడన
యలఘుబలుని । యెదుటనిలిచినఁ జూచిమీరెవ్వరనిన ।
నాదిమూర్తిని భేతాళుఁడండ్రు నన్ను । నను ముదగఁ బల్కి మె
చ్చితినడుగువరము॥ అని,

ఇట్లుగా భేతాళుఁడు ప్రత్యక్షుండై వరమిచ్చెదననుడు చెవ్విరెడ్డి యీ క్రిందివిధంబున వరముల వేఁడుకొనియె. ఎట్లన్నను:—

---

భేతాళుఁడు వరము లిచ్చుట.

---

క॥ అనవిని చూచిముదంబున । వినతుండై మ్రొక్కి నిలిచి వీరా
గ్రణితా । ఘనగంభీరత గోత్తల । ననియెన్ భేతాళుమ్రోల
నలఘుప్రౌఢిన్॥

క॥ మావంశసుధాత్రీస్థలి । భావింపఁగ నెన్ని నాళ్లు ప్రబలుటగల
దో । శ్రీవెలయ నన్ని నాళ్లును । గావలెనైశ్వర్యశౌర్యఘన
ధైర్యంబుల్॥

క॥ ఇదిగాక యింక నొక్కటి । ముదమున వేడెదను వరము మూర్ధ
న్యులమై । కదనమునకు నేఁగ మీరల్ । వదలక మాముందు
నడువవలెనని పలుకన్॥ అని,

ఇట్లున్న పద్యములంబట్టి చెవ్విరెడ్డి కోరిన వరములు రెండుగాఁ దేలుచున్నవి. అందు మొదటిది తనవంశమున్నన్నినాళ్లును ఆ వంశస్థులకు శౌర్యధైర్యైశ్వర్యము లుండవలెననుట. రెండవది తాము కయ్యములకు బయలుదేరునపుడు తమకుముందుగా భేతాళుఁడు నడువవలెననుట. అని యిట్లుగాఁ జెవ్విరెడ్డి వరముల నడిగిన భేతాళుండు కటాక్షించి యిట్లనియె.

క॥ చేకొని తా భేతాళుఁడు । ప్రాకటముగఁ బల్కెనపుడు భాసుర
లీలన్ । నీకమెయి నాదు రాకకుఁ । చేకువనుసుపష్ణతీర్పు
ధృతిఁ గనుమనుచున్॥

అని పై రెండుగ్రంథములలో నొక్కరీతినే యున్నది. అనంతర గాథలోఁ బ్రహ్మనాయకచరిత్రములో నీ చెవ్విరెడ్డి వంశస్థులలో యుద్ధజయ మొకసహస్రవర్షములవరకుఁ గల్గునని భేతాళుఁడు వరమిచ్చినట్లున్నది. ఎట్లన్నను:—

క॥ సాహస్రవర్షపరిమిత । మాహవజయకేళి బొదలక శ్రాంతంబున్ ।
బాహుళ్యమగుచుఁ గులము । న్గాహాలమగు నీతి పిదప దోఁచున్
లఘుతన్॥

అని యిట్లు చెప్పి బేతాళుం డంతర్హితుండయ్యెనని యున్నది. ఆ పద్యములోఁ గొంచెము పాఠభేదమున్న నర్థ మొక్కటిగానే యున్నది. గావున పాఠభేదముతో దాని నివరించెదను. ఎట్లన్నను:—

క॥ మించిన వేడుకఁ బోషిమి । నంచితగౌరవములొసఁగి యాతఁ డర్థిన్మాఁ
జై । చంచద్గుణజనునంతట । సంచితసమ్మానుఁడగుచు జన
విభుఁడరిగెన్॥ * అని.

---

## చెవ్విరెడ్డిని కాకతీయగణపతి పిల్పించి బహుమానించుట.

---

ఇట్లుగాఁ జరిగిన వృత్తాంతమునంతయు వర్షభాగమునఁ దొలఁగించుకొనుటకై యా చుట్టుపట్టు వృక్షముల చాటున నిలిచి యున్న యిద్దరు పురజనులు చూచి యద్భుతమునంది యా వృత్తాంతము తక్కిన పురజనులతోఁ జెప్పిరి. ఆ పిమ్మట దానినే చాటులుపోయి కాకతీయగణపతికిని విన్నవింప నా రాజపుంగవుఁడు చెవ్విరెడ్డికి సన్మానంబు పంచి పిలిపించి గుఱ్ఱము కోకలు మొదలగు ననేక బహుమానములు నిచ్చెనని కలదు. అదెట్లున్నదనఁగా:—

ఉ॥ అప్పుడు నిగ్గుడ్డవిడి యంతనుముష్టిఁ బడెంచివాన్నకై । విప్పుగు
తప్పి గోహముల పిగిభయంబున దాగియుండువాఁ । రప్పురిఁ జేరి

---

* క॥ అప్పుడు భ్రమదాధిపుఁడను । మంచితగతిఁ దర మొసంగి మంత్రిప్రౌఢ్యా ।
చంచద్గతిఁ జననంతట । సంచిత సమ్మానుఁడగుచు నధిపతి యరిగెన్ ॥
అని పద్మనాయకచారిత్రములోని పాఠాంతరము.

నాగరికులందరిముందఱ తద్విశేషముఁ । జెప్పినవిన్నవారలు ప్రసిద్ధిగఁ గాకతిరాయసన్నిధిన్॥

చ॥ అప్పుడు లకాకతీయమనుజాధిపగణ్పతిరాయసన్నిధిన్ । నిపుణతమీరఁ దత్క్రమము నిల్చియుఁ జాఱులు మ్రొక్కి మక్కువన్ । విపులమృదూక్తులం దెలుపవిస్మయమందుచుఁ బిల్వఁబంచియా । తపనసదృక్ప్రతాపఘనుఁ డామదిలోఁ బలుమారు మెచ్చుచున్॥ అని,

కాకతీయగణపతివలన నీ చెవ్విరెడ్డి గైకొనిన గుఱ్ఱము కోకలు మొదలగునవి యీ క్రిందిపద్యములో వివరింపఁబడి యున్నవి. ఎట్లన:—

చ॥ తురగముతాళి మేల్కలికిదోడ్డతురాయిఖబాయిముత్యపు న్సరములులతుసీమచుఱిచౌకళికత్తియుఁ గాలిపెండెమున్ । సరిపెసలందలంబుఘనచామరముల్ హరిజాటమిచ్చియా । ధరణిధరామరేంద్రుఁడు ముదంబు మొగంబుననిగ్గులీనఁగన్॥

ఉ॥ దేశములిచ్చి వేఁడుక నుతింపసభాసదులెల్ల మెచ్చఁగా । వాసిగఁ జేసెసంగికులపద్ధనుఁ డీఘనుఁ డంచుఁ బల్కరు । న్గాశకరూశలాటకురుకన్నడకొంకణసింధుమాగధా । ధీశులలోనఁ బెంపుగనుధీంతనీవని యెంచిపంచినన్॥ అని,

ఆనాఁడు మొదలు చెవ్విరెడ్డిని కవులందఱును భేతాళుఁడని వాడుకొనుచువచ్చిరి. ఇతఁడును శత్రుల కెన్నఁడు నోడక విశేషతేజశ్శాలియైయుండె. అదెట్లన్నను:—

క॥ నాడాదిగ సుకవీంద్రులు । వేడుక భేతాళుఁడనుచు వేమఱుదిన
లన్ । బోడిమి నుతింపఁ బ్రతిపతుల । కోడక నవ్విభుఁడు ధాత్రి నొగి
చెలువొందెన్॥

---

చెవ్విరెడ్డికి పిల్లలమఱ్ఱి భేతాళనాయకము గల్గుట.

---

ఇట్టి పిల్లలమఱ్ఱి భేతాళుఁడను పేరు పిల్లలమఱ్ఱినుండి వచ్చినవాఁ డగుటం జేసియు భేతాళుని వరముల సంఘటం జేసియుఁ గల్గిన ట్లిదివఱకే సూచించియుంటిమి. కాని వంశావళీ గ్రంథములోఁ బిల్లలమఱ్ఱిపైఁ బిడుగుపడఁగా నితఁడు పౌరుషము చూపి దాని నడ్డుకొని పరాక్రమించుటచేతఁ గల్గిన ట్లున్నది. ఇచ్చోఁ బిల్లలమఱ్ఱియను గ్రామనామమే చెప్పవలసి యుండును. భేతాళుఁడను పేరీ చెవ్విరెడ్డి మఱ్ఱిపైఁ బిడుగు పడఁగా దానిని కొట్టి భేతాళ సాక్షాత్కారము నందిన గాథను సూచించును. ఇట్లుగా బిల్లలమఱ్ఱి భేతాళుఁడను పేరు కాకతి రాయనివలనఁ జెవ్విరెడ్డికిఁ గలిగెనని చెప్పెడు పద్యములోనే యావరలో నతఁడు చేసిన పౌరుషములుఁ గూడ సంగ్రహించి వ్రాసె. అదెట్లున్నదన:—

సీ॥ నాఁగ భైరవున కానందంబు దళుకొత్త నరబలిగావించి సిరివహిం
చెఁ । బరగఁ బంచమునకు వరమిచ్చి రేచర్ల గోత్రుఁడై కీర్తి చేకొ
నియెలంగె । పిల్లలమఱ్ఱిపైఁ బిడుగు బడ్డ గడంగి గడఁ బూనియు
ద్ధతిగ దిసి వ్రేసె । భేతాళుఁడపుడు దెంచి కరస్థితిసిల్పె వెరవక మా
టాడి వరములందె । కాకతీశ్వరుఁ డెలమి బ్రకాశముగను । ధ

రణిపిల్లలమఱ్ఱిభేతాళుఁడనుచుఁ। బిలువధాత్రీశులెఱుఁగంగఁ
బేరుగాంచె। సతనివిమలప్రభావ మెంతనినుతింతు॥

చ॥ జననశతాబ్దిప్రకటపౌత్కృతపాకవిశేషతాప్తిస। న్మనుజుఁడు
నింద్రనైభవసమగ్రతనొందినమాన్య సజ్జనా। వనఘనశీలుఁ
డుర్వ్వరనవారితదైవకృపానులబ్ధసు। వినుతయశంబుగాంచె
ఘనవిక్రమశక్తివిముక్తదైన్యుఁడై॥ అని.

---

చెవ్విరెడ్డివలనఁ బద్మనాయకులకుఁ గల్గిన గౌరవాదికము.

---

పై విధమునఁ బ్రతాపరుద్రుండుండి పద్మనాయకులకంద
ఱకుం బిలువనంపించి వారికి సేనాధిపత్యము మొదలగు పదవు
లొసంగి గోత్రబిరుదాదికములు శాసనరూపంబుగాఁ జేయించె.
ఈ వృత్తాంతమంతయు నీ క్రిందిగ్రంథములోపలనే వివరించి
యున్నాఁడను. ఇట్టి మహాత్కార్యమునకుఁ గారణ మీ రేచర్ల
గోత్రజుఁడగు చెవ్విరెడ్డియగుటం జేసియే. వెంకటగిరి వంశావళీ
గ్రంథములో నీ క్రిందివిధముగా వివరింపఁబడియున్నది. అదె
ట్లన్నను:—

గీ॥ అలరి పెంపొందుపద్మనాయకులలోన। వానివంశంబులోకం
బులోనమెఱయ। ఘనతకెక్కిన రేచర్లఘనుఁడువెలసె। ధర
ణిఁబిల్లలమఱ్ఱిభేతాళుఁడనఁగ॥

గీ॥ ధరణిఁడెబ్బదియాఱుగోత్రములవారి। ఘనులఁదనబంధుజన
ములఁగాకతీయ। గణపతీంద్రమహారాజుకరుణచేత। వృద్ధి
నొందించిమర్యాదలేర్పరించె॥ అని,

పద్మనాయకచారిత్రములోఁ గూడ "మూలంబుపోల భూముఖ్యుని చెవిరెడ్డి" అను మొదలగుపద్యము లున్నట్లుగా నివరకే యుదాహరించియున్నాను. ఇట్లుగాఁ దనవంశము వారికేగాక కులమువారి కందరికిని గొప్పతనమును సంపాదించిన చెవ్విరెడ్డి చారిత్రము శ్లాఘాపాత్రమగుగదా. అతని మూలమున శిలాశాసనములోఁ దామ్రశాసనములలోఁ జెప్పంబడిన గోత్రనామంబులు మొదలగునవి గ్రంథస్థము చేసినాఁడను. అట్టివారి గోత్రములపేరులన్నియు నీసమాలికగా వెంకటగిరి వంశావళిలో వ్రాయంబడినవి. అందులోను గల నామములు కొన్ని పద్మనాయకచారిత్రములో వివరింపఁబడినవానిలో భేదించియుండును. అట్టివానిఁ దెలియుటకుఁగా నా నీసమాలిక నిట వివరించెదను. ఎట్లన్నను:—

---

## పద్మనాయకగోత్ర సీసమాలిక.

---

అవనిలో డెబ్బదియాఱుగోత్రంబులనామంబు లెఱిఁగింతు నయ
ముతోడ। రేచర్లగోత్రంబు రేపాలగోత్రంబు విప్పర్లగోత్రం
బు వెలయ దేవ। నూర్లగోత్రము గాలినూళ్లగోత్రంబు శ్రీసూరి
గోత్రంబు వాలూరుగోత్ర। మరయంగ దగ విరియాలగోత్రము
మఱియు నాడూరుసద్గోత్రమున్నతముగ। పేరట్లగోత్రంబు నాం
ట్లగోత్రంబు రమణ వేదుర్లగోత్రంబు నలఘు। చెర్లగోత్రంబు
నాదూళ్లగోత్రంబు నుధరనాపవెల్లిగోత్రం బకట్ల । గోత్రం
బయోధ్యసగోత్రంబు మఱిస్వర్ణగిరినామగోత్రంబు నిరుపమా

న । పెంపాళ్ల గోత్రంబు పేశాలగోత్రంబు పోలూళ్ల గోత్రంబు పొసఁగ పాన । గోటిగోత్రము పస్పులేటిగోత్రము పున్నె పల్లెగోత్రంబును పాండురాజ । గోత్రంబు పాలూరిగోత్రంబు మఱి పైడి చుక్కలగోత్రంబు క్షోణి పైడి । పాలగోత్రంబును పాయేటిగోత్రంబు మఱి పల్లపులగోత్ర మరసి చూడ । పువ్వాడగోత్రంబు పులియాలగోత్రంబు రహిఁ పల్కునూరిగోత్రంబు మఱియు । మట్నాళ్ల గోత్రంబు మారట్లగోత్రంబు నుల్లేలగోత్రంబు మల్లె జెండ్ల । గోత్రంబు పెనుగొండగోత్రంబు నఱి ముప్పనూళ్లగోత్రము మడిపల్లెగోత్ర । మరయ నూళేగోత్ర మంచితమడపట్ల గోత్రంబు మధుపాలగోత్రము మరి । చెట్లగోత్రంబు మాచెర్ల గోత్రంబును గుండేటిగోత్రంబు కొమరుమిగుల । కోర్కుంట నామకగోత్రంబు కంజర్ల గోత్రంబు శ్రీమెల్లి గోత్ర మరయఁ । గొన్నులూరాహ్వయగోత్రంబు శిరిమెల్ల గోత్రంబు మఱియు నుకొమరు వెల్లి । గోత్రంబు శెలగాలగోత్రంబు మఱిగూడవాటిగోత్రంబును వగుప చెరుకు । నూళ్ల గోత్రము జెప్పనూళ్ల గోత్రము నెవలదుగు గోత్రము సమంచితము గాఁగ । నరమాలగోత్రంబు నిపుపమక దురునూళ్లాహ్వయ గోత్రంబు సమరగుండె । కరమలగోత్రంబు శిరసునూళ్లాహ్వయగోత్రంబు జయరట్లగోత్రమవని । శనగపూడ్యాహ్వయ జగతాపిగోత్రముల్ తెల్లంబు గానింగివెల్లి గోత్ర । మినకాలగోత్రంబున ను మనగంటిగోత్రము దాసునూళ్ల గోత్రంబు ధాన్య । పులిగోత్ర మిల దెబ్బ మల గోత్ర మేటికూరాఖ్య గోత్రంబు మహాద్భుతముగ । జగతిమా

ధవరేకులజన్ములుగాన । నరయ దేసల్లదున్నెకల్లప్పరాల ।
ఖిలకేఖియటు చుంబేర్కొనఁ జెలఁగుచుండు । ధరణిలో దెబ్బ
దేవ గోత్రంబులిట్లు॥

ఇట్లుగాఁ బద్మనాయకుల గోత్రవిభిదాంకితంబులు శాసనస్థములు చేసి యనంతరము ప్రతాపరుద్రుఁడు పద్మనాయకుల కులక్రమనియమములనుగాఁ గొన్ని నీతివాక్యంబులు పల్కినట్లుగాఁ బద్మనాయకచారిత్రములో నున్నది. ఎట్లన్నను:—

వ॥ అని నియమించి పలికి, వారి కులక్రమ నియమంబులకై
మఱియు నిట్లనియె.

సీ॥ రాయ[illegible]త్తమైన రావు పేరాదిని । బూనినతఁడు ముఖ్యభూభు
జుండు । రెండవదియున య్యెడ సామాన్యులు । నాయ
కాఖ్య పద్మనాయకులకు॥

అనియున్న యీ పద్యముబట్టి యనేకమగు రావు పేరాదియందుఁగల యతఁడు ముఖ్యప్రభుఁడని తెలుచున్నది. ఆ కారణముననే యీ పద్మనాయకులలో రావుశబ్దము (పేరు) మొదటఁగలవారినఁగా రావువారు కులములో నాతి ముఖ్యులనఁగా ముఖ్యపాలకులని చెప్పనొప్పిరి. ఆ రావుశబ్ద మంత మందుగలవారలు అంతయు సామాన్యముగాఁ బద్మనాయకులని సూచింపఁబడుచున్నారు. దీనింబట్టియే రావుశబ్ద పర్యాయమగు రాయనింగారనుమాట పద్మనాయకులయందు సాధముగాఁ జెల్లుచున్నది ఈ రావుశబ్దము ప్రారంభములో నున్నవారుమాత్రము పై వెలమలలోఁ బ్రధానశాఖవారు రేచర్ల

గోత్రమువారు. అయితే యీ రేచర్ల గోత్రమువారు కాలాంతరమున నితరస్థలములలోఁ గాపురముంచుటంబట్టి యాగ్రామనామములే గృహనామములుగలవారుగ వ్యవహరించుచున్నను, రావుకుటుంబమువారనఁగా వారిలోఁ [illegible]జకుటుంబమువారనియే యూహింపవలసియున్నది. ఈ వరకు మనకుఁ జెవ్విరెడ్డి చారిత్రము లభియించినది. దొరికినవరకు గ్రంథస్థముఁ జేసియుంచినాము. కావున నిఁక మనమితని సంతతివారింగూర్చి వ్రాయ గమకించెదము.

---

## చెవ్విరెడ్డి సంతానము.

---

భేతాళనాయఁడను నీ చెవ్విరెడ్డికి ముగ్గురు కుమారులు గలిగిరి. వారిలో మొదటి యతనిపేరు దామానాయఁడు; రెండవ యతనిపేరు ప్రసాదిత్యుఁడు; మూఁడవయతనిపేరు రుద్రమనాయఁడు. దీనిం దెల్పు పద్య మెట్లున్నదనఁగా:—

శా॥ తారుణ్యప్రథమానస్థైర్యుఁడగు భేతాళావనీభర్తకున్ । ధీ
రుల్ పుత్రులు దామభూపతిప్రసాదిత్యుండురుద్రక్షమా । ధా
రుండున్ జనియించిరంతఁద్రిజగద్ధర్మప్రతీపాలనన్ । శ్రీరాజి
ల్లఁగ శౌరిముప్వురయిధాత్రిన్మించినారెన్నఁగన్॥ అని,

అట్టిపై ముప్వురిలోపల నగ్రజుండగు దామానాయని వర్ణన మీ క్రిందివిధంబునం జూపట్టును.

---

## దామానాయని చరిత్రము.

క॥ అరయఁగ నంసగ్రజుఁడై ధీ దామవిభుండు భాగ్యధైర్యదయా
శ్రీ । వరభోగమతులవెలసెను । సురుషగిరిహరిశశీంద్రగురు
లకు నెనయై॥

సీ॥ చటులఖడ్గాఖడ్గిసమరప్రవీణుఁడై ఖడ్గనారాయణఖ్యాతినొందె। గణపరాట్సుఖరాజ్యలక్ష్మీఁ జేకొనియును గాయగోవాళాంకకలితుఁడయ్యె । నాళ్లల వైరిగజాదికాంగంబులు ఛేదించిభుజబలభీముఁడయ్యె । ప్రథితారిరాజన్యభయదవిక్రమమునఁ బ్రతిగండభైరవప్రథ వహించె । మఱియుఁ బెక్కనఘబిరుదునామములఁ దనరి । బాహువిక్రమదానసంపదలఁ బొలిచి । తనరియొప్పారెనంచితోద్దామయశుఁడు । భువనహితకారియగు దామభూవిభుండు॥ అని,

ఇట్లున్న సీసపద్యములం బట్టి యీ దామానాయఁడు 1 ఖడ్గనారాయణ, 2 గాయగోవాళ, 3 భుజబలభీమ, 4 ప్రతిగండభైరవ మొదలగు బిరుదులు సంపాదించెనని తేలినది

ఇతని తమ్ముండగు ప్రసాదిత్యుంగూర్చి యీ క్రిందివిధంబున నున్నది. ఎట్లన:—

## ప్రసాదిత్యుని చరిత్రము.

క॥ అతనికిసోదరుఁడుకృపాం । చితుఁడుప్రసాదిత్యఘనుఁడుశౌర్యం
గాంకకళా । యుతుఁడతులితవిక్రమశో । భితుఁడతిచతురుండు
వెలసెవిలసత్కీర్తిన్॥ అని,

ఈ ప్రసాదిత్యుని చారిత్రము విశేషప్రఖ్యాతిగలదియై యున్నది. ఇతఁడు కాకతీయ ప్రథమ ప్రతాపరుద్రుని కాలములోఁ జీవరనున్నట్లు కానుపించు. కాని తదనంతరము రాజ్యమునకు వచ్చిన ప్రథమ ప్రతాపరుద్రుని తమ్మునికుమారుండగు గణపతిరాజ రాజ్యకాలములోపలను తద్గణపతి పుత్రికయగు రుద్రాంబకాలములోపలను నున్నట్లు కానుపించుచున్నది. ఎట్లన్నను:—

వెంకటగిరి వంశావళిలో,

సీ॥ ఘనతనాప్రసాదిత్యుండు కాకతిగణ । పతిచనినతనిసుతకునుఁ బట్టణంబు । రమణతోఁగట్టికాకతిరాయరాజ్య । స్థాపనాచార్యబిరుదుదాఁ వనరఁగాంచె॥ అని,

ఈ ప్రసాదిత్యునకు 'రాయపితామహాంకబిరుదు' గల్గిన ట్లీ క్రిందిపద్యమువలన సూచించుచున్నాఁడు. ఎట్లన్నను:—

సీ॥ ధరణీశునకుమైనరాయపితామహాంక । బిరుదు డెబ్బదియేడ్గురు వరుసనాయ । కులుగఁజేసియుభైరవువలనవచ్చు । దృఢవరంబుగఁగొనెఁబ్రసాదిత్యవిభుఁడు॥

అనంతరము మఱియొక బిరుద మీ ప్రసాదిత్యున కున్నట్లు చెప్పంబడినది. ఆ బిరుదము వీరశబ్దముతోఁ బ్రారంభించి ప్రసాదితాంకుఁడని చెప్పె. నెట్లన:—

ఉ॥ నారికినాత్మవల్లభునినారియగానొనరింపబ్రహ్మయున్ । నేరఁడు రుద్రమాంబధరణీపతికిన్ బతిగానొనర్చిదు । ర్వారవిరోధిమం

డలబలంబునడంచియతండుమేటియై। పేరప్రసాదితాంకహరి

విక్రముడంచుఁబొగడ్త కెక్కెఁదా॥ అని,

ఈ ప్రసాదిత్యుని పౌరుషాదికము సంగ్రహముగా నొక సీసపద్యములోను విపులముగా నొక సీసమాలికలోను గానుపించును. అట్టిపద్యముల వివరించెదను. అందు మొదటి సీసపద్య మెట్లున్నదనఁగా:—

సీ॥ ధరణిపై నెబ్బదేడ్గురునాయకులలోనబటుప్రతాపస్ఫూర్తిబరఁగినాఁడు । చండభుజాదండమండితారాతులభండనంబులఁజాలఁజెండినాఁడు । యేపునవోరుగల్లునేలురుద్రునిచేతనందెయుఁబెండెంబునందినాఁడు । విక్రమంబునధరాచక్రంబులోఁగలబిరుదులుతనవిగాఁదిరిగినాఁడు । వాఁడురిపురాజపన్నగవైనతేయ । రాజితంబైనకేరళరాజ * ఘనుఁడు । భాసురుండగురేచర్లశాసనుండు। సత్యసంధుండుసత్ప్రసాదిత్యఘనుఁడు॥ అని,

ఇట్లున్న యీపద్యములోఁ జారిత్రమున కనువగు విశేషములు పెక్కులు లేవు. ఓరుగల్లు నేలు రుద్రునివలన నందెయుఁ బెండెము నందినాఁడనియును, రిపురాజపన్నగవైనతేయ, కేళాదిరాయ బిరుదులు గలవాఁడనియును, రేచర్లగ్రామముం బాలించెననియునుమాత్రము తేలుచున్నది.

---

* కేళాదిరాయ.

## ప్రసాదిత్యుఁడు యితరనాయకులచేత మ్రొక్కించుకొనుట.

---

ఇఁకను సీసమాలికలో నోరుగంటి కోటకు శత్రుల వలన నొకప్పుడు బాధకలుగగా దాని నీ ప్రసాదిత్యుండు తొలఁగించి తక్కిన నాయకులచేత మ్రొక్కించుకొనిన గాధ కొంత విపులముగాఁ జెప్పంబడుచున్నది. అందులో నీ ప్రసాదిత్యుఁడు శత్రులను జయించిరాఁగని ప్రతాపరుద్రుం డతని కెదురుగా వచ్చి కౌఁగలించుకొని కాలికి గండపెండెమిచ్చి తనముందటఁ గూర్చుండబెట్టుకొని తిరుగ నింటికిఁ బంపునపుడు లేచి కౌఁగలించుకొని మఱునాఁడు తిరుగ వచ్చినపుడు తొంటియట్లనే లేచి డెబ్బదార్గురు వెలమనాయకులచేతను మ్రొక్కులు వేయించెనని యున్నది. అదెట్లన:—

సీసమాలిక.

సీ॥ ధరనోరుగంటి ప్రతాపరుద్రుని డెబ్బదేడ్గురునాయకు లెలమి
తోడఁ । గొలిచియుండెడు వేళ బలురిపుల్ ముట్టడిదండిగాఁ
గోటకుడాయునపుడు । నిరతంబుతనుగొల్చుదొరలనందఱిఁ
జూచి కోపమునఁ బ్రతాపరుద్రుఁడనియె । నింతేసిదొరలను
సంతరించితిని నేనీపనిజయమందనోపునతని । కిరవొందముద
మున నేలేచికూర్చుండఁ బెట్టికొందునుఁ జాలఁ బెంపుగాను ।
దక్కునాయకులచే మ్రొక్కులు వేయింతు ననియానతిచ్చినయ
ట్టిమాట । వినిఖిన్నులైనయాజనపతులనుఁజూచిఘనభుజా
విక్రమక్రమము మెఱయ । దలఁగకనిల్చిప్రతాపరుద్రునిఁ
జూచిధీరతనాప్రసాదిత్యుఁడనియె । ననుఁబంపుమనిప్రతాపుని

యనుమతిఁగొనికడమవారలుతనుగాచికొల్వఁ । కోటయల్పరి
మీఁదమేటియైతానిల్చిచాల్పుగాజగడంబుసరవిఁజేసె । బల
ములజబరుజంగులచేతవేట్రాళ్లఁబడవేయఁగాఁజేసెఁనడయ
కపుడు । గుంటికోఫులచేతపింటిదెబ్బలచేత మేలుతుపాకిబా
ణాలచేత।మందుతిత్తులచేతమరికిత్తులనుగుత్తములనుసవాడి
కాల్పులముట్టఁజంపి । మాస్టీలఁసునిమియంబారీలసరదార్లఁ
బొడిచియుమరిసర్ప్రాద్దువేళ । ముచ్చిలిగాఁబడిముక్కలు
గోయించితలలుగొట్టించియుబలిమిచెఱిచి । నిలచినసైన్యాన
నిలవకుండఁగఁజేసిసర్ప్రాద్దువేళనుతిరిమితరిమి । భూరిజయుం
డయియొరుగంటికిరాగరుద్రమూర్తిప్రతాపరుద్రవిభుఁడు ।
యెదురుగావచ్చియుహితుఁడవుసీవంచుఘనతఁబ్రసాదిత్యుఁ
గౌఁగలించి । హెచ్చైనకాల్పెండెవిచ్చిదోడ్కొనివచ్చి
ముందరఁగూర్చుండమొదలనిల్పి । పిడిదికంపెనువేళవేడ్క
తోలేచియుఁగౌఁగలించిజయంబుగాఁగఁబసిచి । మఱునాఁడు
డెబ్బదేడ్గురునాయకులుగొల్చుతనసముఖానకతండురాఁగఁ ।
దాలేచియపుడుసంతసమందియాతనిఁబ్రియముతోఁగూర్చుం
డఁబెట్టికొనుచు । డెబ్బదేడ్గురిచేతఁబవిత్రముక్కలునేయుమిం
చఁబ్రతిజ్ఞచెల్లించెవిభుఁడు । వార్తకెక్కినసత్కీర్తివైభవములు ।
దనరెఁబిల్లలమఱ్ఱిభేతాళఘనుని । పుత్రమణిపద్మనాయకపుణ్య
వంశ । దీప్తకరుఁడైనయాప్రసాదిత్యుఁడెలమి॥ అని,

ఈ ప్రసాదిత్యునిఁగూర్చి పద్మనాయకచారిత్రములో విశేషించి చెప్పియుండలేదు. గాని యీ డెబ్బదేడ్గురు పద్మనాయక

వంశస్థులలోపలను ప్రసాదిత్యునియొక్క జయము, ధైర్యము, శౌర్యము, భుజౌద్ధత్యములయొక్క పటిమ నెవ్వఁడు భజియించునో అతఁడే మన్నె వెలమయని పిలువంబడు నను మొదలగు సంగతులతో నొకపద్యము గానుపించును. అందులోనే ప్రతాపరుద్రునియొక్కయు, పద్మనాయకులయొక్కయు వర్ణనయుఁ గొంత గలదు. ఆ పద్య మెట్లున్న దనఁగా:—

సీ॥ కులము ప్రతిష్ఠింపఁగోరిమానుపమందుఁ బద్మనాయక మహా
ప్రాభవంబు। భేతాళవరదివ్యప్రీతహితార్థప్రసిద్ధతేజోజయ
శేషితంబు। రాయసన్నానమైరహిప్రజ్వరిల్లెడుభావుకంబైన
ట్టిరావుపేరు। కాకతీశ్వరదత్తకార్యధురంధర్యరాజ్యశ్రీకర
ధుర్యరాజ్యపదవి। సంగరరంగప్రసాదిత్యజయముఖధైర్య
భుజౌద్ధత్యశౌర్యపటిమ। నెవఁడుభజియించువాఁడెపోనిక్క
మైనపద్మకులభవ్యసంభూతిపద్మజుండు। వంశవర్ధనజగదేక
వంశచరిత। రాజరాజితశౌర్యవిభ్రాజకీర్తి। వీరుఁడైనట్టినాఁ
మన్నెవెలమయతఁడు॥

ఈ ప్రసాదిత్యుని తమ్ముఁడు రుద్రనాయకుఁడు. అతని వృత్తాంత మెట్లున్న దనఁగా:—

---

## రుద్రనాయకుఁడు.

---

చెవ్విరెడ్డి మూఁడవకుమారుఁడు రుద్రనాయకుఁడు. ఇతనికిని 'రాయపితామహాంక' బిరుదమున్న ట్లున్నది. ఇది యునుంగాక 'పాండ్యగజకేసరి' అను బిరుదున్నట్లును 'కాకతి

రాయరాజ్యస్థాపనాచార్య' బిరుదు చెల్లినట్లు నున్నది. ఎట్లన్నను:—ప్రసాదిత్యుని వర్ణనగ్రైనపిమ్మట వెంకటగిరి వంశచారిత్రములో,

క॥ అతనికినను జుండురుద్ర । క్షితిపాలుండు సకలమహీప సేవితచరణుం । డతివినయసత్యసంధుండు । హితలోకావనధురీణుండెలమిజెలంగెన్॥ అని,

రాయపితామహాంక బిరుదమున్నందుకు.

మ॥ ఒగినొక్కం బోడిరాల రాయుదుకు మున్నుగ్రొవ్వులై యిప్పుడున్ । దగనీయందియయందునూడితలక్రిందై వైరిభూపాలకుల్ । జగతీభారమునన్ పసిండిపోడినిచ్చల్ రాయుచున్నారదే । తగదేరాయపితామహాంకజయభద్రాదుగ్రనిన్ జెందిరన్॥ అని,

పాండ్యగజకేసరి, కాకతిరాజ్యప్రతిష్ఠాపనాచార్య బిరుదన్నందులకు.

ఉ॥ వాలనివిక్రమస్ఫురణ వారలుపాండ్యబలంబుదంతులన్ । గెల్చి జయించి పాండ్యగజకేసరి నామముదాల్చి రెంతయున్ । జాలినవారుగా నెగడిసన్నుతి కాకతిరాయరాజ్యల । క్ష్మిలలనా ప్రతిష్ఠ తగం జేసిరి భూజనులెల్ల మెచ్చంగన్॥ అని,

పైని మఱికొందరి పురుషుల యనంతరకాలమున లింగమనీడు ప్రభుత్వమునకొచ్చెను.

## లింగమనాయని వృత్తాంతము.

ఈ లింగమనాయఁడు విశేషపౌరుషశాలియు, సంతతికిఁదా మొదలయినవాఁడనియు గలదు. అనఁగా నితనినుండి మఱియొక శాఖకలిగినట్లు చెప్పవలయును. ఈ లింగమనాయని చారిత్రవిశేషములు వివరించుటలో మొట్టమొదటనే యల్లయ వీరభద్రునితోఁ జేసిన యుద్ధముతోఁ బ్రారంభించెను. మఱియొకపద్యములో నల్లయ వేమారెడ్డియు, నతని తమ్ముఁడగు వీరభద్రరెడ్డియు నీ లింగమనాయనిపేరు వినినపుడెల్ల దిగులొందుచుందురని యున్నది. ఇదియునుఁగాక యీ లింగమనాయకుఁడు ముప్పదిరెండు దుర్గముల నొక్కనాఁడు కొట్టినట్లున్నది. ఇతని బిరుదము లెట్లున్నవనఁగా:—

1. రిపురాజకాలాంతకుఁడు.
2. అష్టదిగ్రాజభయంకరుఁడు.
3. ఔఘళరాజమర్దనశాలి.
4. అవనీశ దుష్టగజాంకుశము.
5. కోటలగొంగ.
6. గజపతి సురథానివిజయుఁడు.
7. నరపతి సేనోగ్రకాననదవాగ్ని.
8. మూరురాయరగండ ముఖ్యాభయకరుఁడు.
9. ప్రతిగండభైరవుఁడు.
10. మేదినీరావు.
11. బల్లరగండఁడు మొదలగునవి.

ఈ లింగమనీఁడు తనయన్నను సంహరించిన యనవేమా రెడ్డిని సంహరించి యతని ప్రతిరూపమును తన తమ్మపడగె యందుఁ జెక్కించెను. ఎట్లన:—

క॥ తనయన్ననవధియించిన । యనవేముని(మనిమిపౌరుషాతి
శయమునఁ । మునుకొనితత్ప్రతిరూపం । బనుపమగతితమ్మ
పడిగెయందమరించెఁ ॥

మఱి కొన్ని గాథలు సీసమాలికంలోని వాని నీ క్రింద వివరించెదను. ఎట్లన్నను:—

సీ॥ "నాఁడెంబుగానన్నినాటిరాజ్యంబెల్లనవ్భుతంబుగఁజూరలాడి
నాఁడు । కృష్ణవేణిజలక్రీడావినోదుఁడై యఖిలదాగుణులసొం
పడఁచినాఁడు।జగనొబ్బగండఁడైజగతిశేవగ్గనుతురకగళము
లతలల్తుంచినాఁడు । చటులోగ్రగతిరయశరభమ్మయప
లేలఁదిరుగసింహాద్రిసాధించినాఁడు । పరదళంబులుపటాపం
చలైపారంగనెన్నగౌరవకొండనెక్కినాఁడు । కేళాదిరయుఁ
డైకెరళిగోరంట్లనుచారభానునివెన్నుచరిచినాఁడు।నల్లకొండ
లనుసన్నాహంబుగానెక్కికపటాహితులనేలగలపినాఁడు ।
గంగసాక్షిగమీరికదిసిరాజమహేంద్రవరముచూరలుగొని
వచ్చినాఁడు । సురథానుకొలువులోబారసెడుబిరుదుకైము
ద్దుఁడక్కనివెన్నుమొత్తినాఁడు । తేజంబుగాఁబ్రౌఢదేవరా
యలచేతనరుదుగాబిరుదందెయందినాఁడు । యినతనూజుని
భంగియనుకుర్తికోటలోలిలశత్రులవిభాళించినాఁడు।ధీరుఁడై
యల్లాడఢీసురథానుచేయమ్మెగాభువనాద్రియెక్కినాఁడు। గొం

టించి బలిమిఁ శిఖేంద్రఖానునిఁ దోలియెలమి రాజ్యంబుఁ దానేలినాఁడు । యలవంక బలువంకలార్చి తాకినబట్టిబలిదఖానుని భంగపరిచినాఁడు । రణకేళియందుకవరప్రాంతమున గొట్టిమన్నె జంగులయేపు మాపినాఁడు । మణుగూరికోటలోపమందు వమన్నీఁడు ప్రతిఘటించినతూలబరిచినాఁడు । శరణుఁజొచ్చిననొచ్చిసరిమఖానునిఁ బట్టి గౌతమీతటమునఁ గాంచినాఁడు । పోరిలోనసగన్న భూపాలు చెరబెట్టి ధృతికొత్తకొండసాధించినాఁడు। అదిరివిక్రమ రాజు కదనోర్వి గర్వింపనడచియింద్రుని వీటికనిపినాఁడు । సింహావిక్రమపురిసింగమప లెకానిగోపాలకృష్ణునిఁ గొట్టినాఁడు । మెండుగ వీకమైకొండపల్లన్నిలు పూనివచ్చిన నూనపుచ్చినాఁడు । యెదిరించు వేలూర యేలూరితిప్పని మొదలింటపటుగతిమోదినాఁడు । కుంట్లూరికోట పైగుంప్రాతు రాజుల మొత్తమె యెదిరిన మొత్తినాఁడు । బాణాలకోట పై ప్రకటించియుగ్రత కాలాగ్ని రుద్రుఁడై కాల్చినాఁడు । తొరగంటి దాబాటితుంకలఁబరిమార్చి పట్టణంబుల వెంటఁ బ్రబలినాఁడు । సంగరస్థలమున సింగళదేవుని శిరముద్రుంచెటుకీర్తిబరఁగినాఁడు । మలకపోలాస్తనుమద మెల్లఁగక్కించియన్న యాదవకొండఁగొన్నవాఁడు । గర్వించితలపడ్డగండరిగండని మెట్టగదియ తలఁగొట్టినాఁడు । కుటిలశాత్రవకోటికోవిలకొండతామగతనంబునఁబిల్కుమార్చినాఁడు । పుచ్చిళ్లకోటకైయుద్రేకమునఁబోయి చెంగేటినీరుగాఁ జేసినాఁడు । యుర్వోలోఁబొగడొంమను పూరి చెంగట చెనకినరిపుకోటి చెండినాఁడు । శాత

శిక్షావృత్తి జగమెల్ల నెఱుఁగ శ్రీశైలపట్టణముఁదానేలినాఁడు। బుక్కరాజును బట్టి పాడిచేసి కోటలోఁ గజపతి మెచ్చంగఁగాఁచి నాఁడు। దొరయుసల్కయవారితోలితొప్పరలాడి భాగవా డొగ్గను బాపినాఁడు। చాటిచెన్నయగారి చదిపిచట్టలుచీరి కొండమల్లయగారి గొట్టినాఁడు। గోసింట్లతిప్పని గొట్టి కోటయు నెక్కి వేకరికులమెల్ల వెదకినాఁడు। చిటివల్లభయ్యను చెట్లను బడఁదోలి పాణము రాజును బరిపినాఁడు। రంగయభీమసింహ జ సాబునఁదోలి సాల్వతిప్పని నేలచదిపినాఁడు। ముచ్చకంపయ కుర్క్యముఁ నుపుగాఁ బడమోరి ఫ్లాలసంగని ఘోంజు బొడిచినాఁ డు। రాజులెప్పుడు మెచ్చ రామరాజ్యంబుగా నెలఁగిం జూచ లం బేలినాఁడు। దండిమైమెముప్పది రెండుదుర్గంబులు నేక ధాటీ గతి నెక్కినాఁడు। వీరభద్రుసిదొడ్డవిభు వేయి నృపతులరట్టఁ దైకాలం దెబెట్టినాఁడు। ఘనమహాసురాయసింగండ సుండేరంబు పెనుపొందఁడా కాలఁ బెట్టినాఁడు। రాజమాత్రుండె ఖడ్గనా రాయణుండు। చాపతరమూర్తి రాజులచక్రవర్తి। గాయగో వాళుఁడు వ్రోత్తుగండడనఁగ। లీలనొప్పారె మాదయలింగ విభుఁడు॥ అని,

ఇట్లున్న పద్యములో మనము చారిత్రోపయోగము లుగాఁ గైకొనఁదగిన యంశము లీక్రిందివై యున్నవి. ఎట్లన్నను :—

1. సబ్బినాటి రాజ్యమును చూరలాడినాడని.
2. సింహాద్రిని తిరుగ సాధించెనని.

3. గంగసాక్షిగ రాజమహేంద్రవరము చూరగొనెనని.

4. ప్రౌఢదేవరాయనివలన బిరుదందినాఁడని.

5. బుక్కరాజును పట్టి పొడిచేసి కోటలో గజపతి మెచ్చఁగఁ గాఁచెనని.

6. వీరభద్రుని, దొడ్డ విభు వేమనృపతులఁగెల్చి కాలి కంచె బెట్టెనని.

ఇట్లున్న యంశములలో నొక్కొకదానికి మనము వ్రాయంగల చారిత్ర మిూక్రింద వివరింపవలసియున్నది. అదె ట్లున్నదన:—

1. సబ్బినాటి రాష్ట్రమనునది గౌతమీనదికి నుత్తరమున నున్నది. దీనికి ముఖ్యపట్టణము రామగిరి పట్టణము. దీని ప్రభుఁ డొకకాలములోఁ గుమారముప్పభూపాలుఁడు. అతని వంశానువర్ణనము తెనుగు వసిష్ఠ రామాయణము పద్మపురాణోత్తరఖండములోపల రామగిరి పట్టణపు సింగకవివలనఁ జేయఁబడినది. పైలింగమనీఁడు సబ్బినాటి రాష్ట్రమును చూరలాడెనని యున్నంతమాత్రమున నతని కాలనిర్ణయము ఈ చారిత్రముంబట్టి చేయ వీలులేదు.

2. సింహాద్రిని తిరుగ సాధించెనని యున్నది.

3. గంగసాక్షిగ రాజమహేంద్రవరము చూరఁగొనె.

4. వీరభద్ర వేమారెడ్ల కథలకు సంబంధము కలదు గావున నామూఁడును నొక్కచోటనే వ్రాసెదను. పై రెండవదానింబట్టి మొదట నొకపరి సింహాద్రిపై నీలింగమనాయఁడు

దండెత్తివచ్చి సాధించెననియు, దాని నితఁడు లాక్రమింపఁగా నితఁడు మరల స్వాధీనము చేసికొనియెనని యున్నది. ఈ సింహాద్రి మొదలు చిలకసముద్రము వఱకు గల దేశము ఆరవ గురించి మనము పైని వివరించిన వీరభద్రరెడ్డి వేమారెడ్డి అను రెడ్లపరిపాలనలో నున్నట్లుగా శ్రీనాథకవిత్వమగు కాశీఖండమను గ్రంథములో నీ క్రిందివిధముగా నున్నది. ఎట్లన్నను

ఉ॥ ప్రాకటవిక్రమస్ఫురణ రాజమహేంద్రము రాజధానిగా। నాకసి
తాతపత్రముగ నేలును వేమనృపాలుఁ డుత్తమ। శ్లోకుఁడు వేము
శౌరియనుజుండు సముల్లసితవైభవాఢ్యుఁడై। నీకటియుం గ
ళింగియునుచిల్కసముద్రముసింహశైలముల్॥ అని,

యిట్లుండుటంబట్టి సింహాచలము మొదలు చిల్క సముద్రమువఱకు నుత్తర దక్షిణములుగాను, కళింగపట్టణము మొదలు చీకటికోటవరకుఁ దూర్పు పడమరలుగానుండు దేశమును పై వేమారెడ్డి తమ్ముఁడగు వీరభద్రరెడ్డి పాలించినట్లున్నది. ఆదేశమును మొదట నీలింగమనాయఁడు ఆక్రమించుకొనఁగా దానిని వీరభద్రరెడ్డి తిరుగ గైకొనియు డెననియు బిమ్మట మరియొకపరి యతనిం జయించి సింహనగము నీలింగము నాయనుఁడు గైకొనియెననియుఁ దెలుచున్నది. ప్రస్తుతములో బొబ్బిలి సంస్థానీకులక్రిందనుండు రాజాం మొదలగు పరగణాలు వీరభద్రరెడ్డి స్వాధీనములోనున్నవని మనము పైని వివరించిన చిల్కసముద్రము సింహాచలము మధ్యనే యున్నటులఁ జేసి సింహగిరి నీలింగము నాయఁడు తిరుగఁ గైకొనెను. అనఁగా వీరభద్రరెడ్డి

కాలము క్రీ. శ. 1434 లోఁ దనఁగా శా॥ 1356 ములోఁ నున్న ట్లుగా స్వ్యాయల్ దొర పుస్తకము రెండవవాల్యములోఁ నున్నది.

---

ఈ వంశములో ప్రసిద్ధి కెక్కిన యన్నమనాయని వృత్తాంతము.

---

ఈ యన్నమనాయని బిరుదులును ప్రతాపము నొక సీసపద్యములోఁ గాన్పించు. ఎట్లన్నను:—

సీ॥ పటుసోమకులరాజపరశురామాంకుఁడై సంబెటసోముని చ
కట్టఁజేసె। ఖడ్గనారాయణగాయగోవాళుఁడై సరెపల్లెరాజు
ల సంహరించె। పట్టుతలాటంకబల్లరగండఁడై యనవేమ
రెడ్డినినాజిఁ మనిమె। జగమందురాయవేశ్యాభుజంగాంకుఁ
డై సురధానిబలములసారిదిగెలిచె। ధరణినాతఁడుభీమప్రతా
పవిజయ। బాహుబలశాలినిత్యసౌభాగ్యశీలి।లలితసుగుణుండు
రేచర్లకులపవిత్రుఁ। డనఁగ వెలసెనుపినసింగయన్నవిభుఁడు॥

అని యితనికే యనపోతమనీడని నామాంతరము. ఇతని కాపురస్థలము 'మెతుకు' అను పట్టణమైనట్లుగా నొక పద్యములోఁ గాన్పించును. ఎట్లన్నను:—

క॥ ఒక మెతుకుననొక నాకలి। ప్రకటితముగఁదీర్పరాదుపదివేవు
రనీ। వొక మెతుకునరక్షింతువు। అకలంకారాపురాయయన
పోతాంకా॥ అని,

ఈయన పోతానాయని విజయములఁ జెప్పుచు నితఁడును రాజమహేంద్రవరములోనున్న రెడ్లను జయించినట్లున్నది! ఈయన పోతమనీడు పశ్చిమరాజ్యముపై దండువెడలి

నట్లుగాఁ గూడ నా పద్యమువలననే కాన్పించును. ఆ పద్యమెట్లున్నదనఁగా:—

సీ॥ పౌరుషంబున నీవు పానుగల్లాదిగాఁ గోటరాజ్యంబెల్లఁ గొల్లలాడి। యేపుమై రాజమహేంద్రంబు మేరగా రెడ్డిరాజ్యంబెల్ల రేగఁగొట్టి। బాహుబలిమిని చెన్నపట్నంబు మేరగా తిగుటురాజ్యంబెల్ల దెబ్బఁదీసి। మొక్కళంబునఁ జొచ్చి ముద్గొజగీటుక జోయరాజ్యంబెల్లఁ బొడిచితైని। నేర్పు నెలపించి రాయల సిల్వహించి। తట్లుసంబెట గెలిచితివాహవమున। విమలచారిత్ర సింగభూవిభుసుపుత్ర। వర్ణితాటోపరాయరావన్న పోతా॥ అని,

ఈయన పోతానేని బిరుదు గద్యయసి యొక్క పెద్ద గద్యము కాన్పించుచున్నది. దానిలో నితని వంశజులవలన సంపాదింపఁబడిన బిరుదులుగూడఁ గలిసియుండుటచేత నితని వని పోల్చఁగలవియైన విశేషచారిత్రోపయోగములుగా నుండక యుండుటచేతను వాని నిచ్చో వివరింప వదలినాఁడను. ఈతని వంశజుఁడగు సింగమనీఁడు బహుప్రసిద్ధుఁడు.

## సర్వజ్ఞసింగమనీని వృత్తాంతము.

ఈప్రభుఁడు విద్యావినోదములఁ గాలము గడుపుచుండెడువాఁడు. సంస్కృతమునఁ బండితుఁడును కవియునై యుండి స్వయముగ ననేక గ్రంథముల రచియించి పండితకవుల విశేషముగ నాదరించి బహుప్రఖ్యాతిఁగాంచె. ఈ ప్రభునివర్ణనముగా ననేకపద్యములు పుట్టినవి. అందు వెంకటగిరి వంశావళిలోని కొన్ని పద్యముల నిట వివరించెదను. ఎట్లన్నను:—

సీ॥ క్షితిలోనసర్వజ్ఞసింగభూపాలుండు బలవైరిసన్నుతపౌరుషుం
డు । లలికావ్యనాటకాలంకారచతురుండుసకలశాస్త్రార్థవి
శారదుండు । వలనొప్పసింగభూపాలీయనామకగ్రంథంబుర
చియించెఁగౌతుకమున । మునుభాగవతమునుదెనుఁగుచేసిన
యట్టిబమ్మెరపోతనబాగుమీఱ । తనకుఁజెప్పినభోగినీదండక
మును । వెలయశ్రీనాథనామకవిప్రవరుఁడు । కోరిచెప్పినపద్య
ముల్గొనిముదార్తిఁ । బెంపుతోవారిమన్నించిపేరుపడసె॥
అని,

శ్రీనాథకవి యీ సింగమనీని సభకుఁ బోవుసమయము లోఁజెప్పిన పద్యముఁగూడ వంశావళీగ్రంథములో నీక్రిందివిధం బుగా వివరింపఁబడినది. ఎట్లన్నను:—

"వ॥ శ్రీనాథుండు సర్వజ్ఞుని సముఖానకుఁబోవుచు శారదాంబను
ప్రార్థనఁజేసిన పద్యము:—

సీ॥ దీనారటంకాలఁదీర్థమాడించితిదక్షిణదిశానుముక్తాఫలములఁ।
బలుకుతోడై తాంధ్రభాషామహాకావ్యనైషధగ్రంథసందర్భ
మునకుఁ । బగులఁగొట్టించితుద్భటవివాదప్రౌఢిఁకంచిడిండిమ
భట్టుకంచుఢక్క । చంద్రభూషణక్రియాశక్తిరాయలవద్దఁ
బాదుకొల్పితిసార్వభౌమబిరుద । మింతగాలంబునలెఁగాను
వింతరీతి । యెట్లుమెప్పించెదోకదాయింకమీఁద । రావుసిం
గయభూపాలుధీవిశాలు । సకలసద్గుణనికురంబశారదాంబ॥
అని.







# బొబ్బిలి సంస్థానాధిపతుల చారిత్రము.

...

ఇది

ప్ర[illegible] [illegible]

ప్రవేణుగోపాల [illegible] [illegible] విద్యా

[illegible]గులును,

బొబ్బిలి సంస్థానపు ప్రస్తుత ప్రభువులు నగు

మహారాజా సాహెబ్ మెహర్బాన్ దోస్తాన్ మహారాజా [illegible]

## సర్. వెంకట శ్వేతాచలపతి రంగారావు

## బహదర్, కే. సి. ఐ. ఇ.,

మహారాజా ఆఫ్ బొబ్బిలివారిచే

రచియింపఁబడ

---


చెన్నపురి:

శ్రీ "వైజయన్తీ" ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

---

1902.

# పీఠిక

ఈ మీఁదిభాగమును వ్రాసిన గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు ఠక్కీపలికథను వ్రాయఁబూని సంస్థానమును సంపాదించినవారు వారా వీరా యని యిద్దరి ముగ్గురి విషయమున సంశయముగ వ్రాయుచు బరిష్కరింపక యుంచిరి. ఇంతలో నాయన పరలోకగతిం జెందిరి. మరియు బౌరాబట్టీయములోని సంగతియు మదరాసు కోటలోని లోకల్ రికార్డ్సునందలి యంశమును హదీఖతుల్ ఆలములోనుంచి యెత్తినభాగమును ఆయన వ్రాసినవియె. అట్టిపైని యొకరి పేరని నియమించుటకంటె నేనే శ్రమము తీసికొని వ్రాయుట యుచితమని యెంచి లభించిన యావత్తు గ్రంథముల శోధించి సంస్థానమును సంపాదించినవారెవరోయని విచారించి తీర్మానించుటకే యొక సంవత్సరపుకాలమునకుపైగా పట్టినది. ఎంతశ్రమముగానుండినను ఈ ముఖ్యవిషయము తృప్తికరముగ నిశ్చితమైనందుకు కడుసంతోషమాయెను. ఇతరులమీఁద నీపనినుంచినచో లోగటి గ్రంథకర్తల గ్రంథములవలెనే ఇదియు సంశయాస్పదముగానే యుండియుండుననుటలో సందేహము లేదు. ఏలనంటే వారు త్వరగా నేదో యొకరీతిని గ్రంథపూర్తిని జేసి. బహుమానము నొందఁ జూతురు. మఱియు నితరవిషయములలో సంస్థానపు మామూలు మర్యాద లెరుఁగనివారైనచో వ్రాయతగినవాటిని వ్రాయక

విడిచి స్తుతిపూర్వకమైన విషయములను విస్తరింపఁజేయుదురు. కావున సర్వేశ్వరుఁడు నన్నునే ప్రోత్సాహపరచినందు కతని కనేకవందనములు నాచరించుచున్నాఁడను.

గ్రంథకర్త.

బొబ్బిలి,
1902.

# విషయసూచిక.

పుట.

బొబ్బిలి జమీదారీ ... ... ... ... ... 1
బొబ్బిలి రాజ్యసంపాదకుల విషయమైన నిర్ణయము ... ... 6
కార్నేకల్ దొరవారి జిల్లా మాన్యుయలులోని బొబ్బిలివంశము ... 14
డాక్టరు మెక్లీనుగారి చెన్నపురిరాజధాని మాన్యుయలులోని బొబ్బిలి జమీందారీ చరిత్ర ... ... ... ... ... 16
రాజా పెదరాయుడు బహదరుగారు ... ... ... 27
(సంస్థాన స్థాపకులు.)
రాజా లింగప్ప రంగారావు బహదరుగారు ... ... ... 28
(బొబ్బిలిపుర నిర్మాతలు.)
రాజా వెంగల రంగారావు బహదరుగారు ... ... ... 31
రాజా రంగపతి రంగ రావు బహదరుగారు ... ... ... 31
రాజా రాయడప్ప రంగారావు బహదరుగారు ... ... 32
రాజా గోపాలకృష్ణ రంగారావు బహదరుగారు ... ... ... 33
(వీరినాడే బొబ్బిలియుద్ధము.)
బొబ్బిలియుద్ధవిషయమై ఆరమువ్రాసిన హిందూస్థానపు చరిత్ర ... 33
(బొబ్బిలికోట వర్ణన.)
బొబ్బిలియుద్ధవిషయము. హదీఖతుల్ ఆలము ... ... ... 47
బొబ్బిలితో విజయనగరము విరోధించుటనుగురించి లోకల్ రికార్డ్సు 49
బారాబట్టీయము. బొబ్బిలియుద్ధవిషయము ... ... ... 67
రాజా వెంకట రంగారావు బహదరుగారు ... ... ... 88
(వీరే తిరుగ బొబ్బిలిరాజ్యమును సంపాదించిరి.)
రాజా రాయడప్ప రంగారావు బహదరుగారు ... ... 93
రాజా శ్వేతాచలపతి రంగారావు బహదరుగారు ... 108

| | |
|---|---|
| | పుట. |
| రాజా శీతారామకృష్ణ రాయడ్ప్ప రంగారావు బహదరుగారు ... | 126 |
| మహారాజా సర్ వేంకట శ్వేతాచలపతి రంగారావు బహద్దరు కే. సి. ఐ. ఇ. మహారాజావారు ... ... ... ... | 131 |
| (వీరే చరిత్రకారులు.) | |
| సర్. గ్రాంటు. డఫ్. గవర్నరువారు బొబ్బిలిపురికి దయచేయుట | 134 |
| శ్రీవారి దక్షిణదేశయాత్ర ... ... ... ... ... | 135 |
| శ్రీవారి యుత్తర యిండియాలోని దూరయాత్ర ... ... ... | 136 |
| రాజా కితాబు సన్నదు నిచ్చునపుడు టర్నరుదొరవారి యుపన్యాసము | 142 |
| శ్రీవారు యూరోపుదేశయాత్రలో హెర్. మేజస్టిగారి సందర్శనముం జేయుట ... ... ... ... ... ... | 148 |
| లార్డు వెన్లాకు గవర్నరుగారు బొబ్బిలికి దయచేయుట ... ... | 158 |
| సర్. ఆర్థర్. హావిలాక్ గవర్నరుగారు దయచేయుట | 160 |
| ప్రజలయడ్రెస్సుకు మహారాజావారిచ్చిన జవాబు. .. ... | 170 |
| విక్టోరియా మిమోరియల్ మీటింగులోని మహారాజావారి యుపన్యాసము. ... ... ... ... ... ... | 174 |




శ్రీ

# బొబ్బిలి సంస్థానాధిపతుల చారిత్రము.

## బొబ్బిలి జమీందారీ.

ఇది యిండియాదేశములోని మిగుల పురాతనములైన జమీందారీలలో నొకటి ఇది మదరాసు రాజధానిలోఁ జేరిన విశాఖపట్టణ మండలములోఁ జేరియున్నది. ఈ జమీందారీ మిక్కిలి యభిరుచికరమైన చారిత్రము గలిగి యున్నది. ఇది యుత్తరాక్షాంశము 18°22′–18°40′ మధ్యను, ప్రాగ్రేఖాంశము 83°10′–83°20′ మధ్యనున్నది. దీనిచుట్టును బ్రిటీషు తాలూకాలగు చీపురుపల్లి, గజపతినగరము, సాలూరు, పార్వతీపురము, పాలకొండ, శ్రీకాకుళమును గలవు. బొబ్బిలి, రాజాము, కవిటి, సీతానగరము అను నాలుగు పరగణాలు (తాణాలు) గా నిది విభజింపఁబడి యున్నది. ఈ పరగణాలొక్కొక యామీనువలన వ్యవహరింపఁబడుచుండును దరిమిలాను క్రయలబ్ధములగు ప్రొప్రైటరీ యెస్టేట్లతో నీజమీందారీ సుమారు 920 చదరపుమైళ్లు విస్తీర్ణమై 202 జిరాయితీగ్రామములును, 70 దియగ్రహారములును, 6 మొఖాసాగ్రామములును గలిగియున్నది.

శిస్తుగా జెల్లింపఁబడు 3,567 గరిశెల గల్లాయొక్క కిమ్మతును గలిసి యీసంస్థానముయొక్క ప్రతిసంవత్సరపు రాబడి సుమారు, అయిదులక్షల రూపాయిలు. దీనిపేష్కషు ర్వూ. 95,315. లాండు సెస్సు ర్వూ 32,467 లు. పట్టాలను బొందిన రైతులసంఖ్య 6,539. పల్లపుశిస్తు ఎకరా యొక్కటికి సగటున నేడున్నర రూపాయియు, మెట్టుశిస్తు రెండురూపాయిలునై యున్నది. సంవత్సరపు రాబడి ర్వూ. 20,362లు గల సరాసరి 261 యీనాములు వెలమదొరల యనుభవములోను, ర్వూ. 5,926 ల రాబడిగల 241 యీనాములు దేశస్థులయొక్కయు, కొండవాండ్లయొక్కయు ననుభవములోను, ర్వూ. 35,868 ల రాబడిగల 1,448 అకరములు రైతులయొక్క యనుభవములోను నున్నవి. పై జెప్పిన యీనాములన్నియు జిరాయితీభూములనుంచియే నవుకరీ షరతుపైని యివ్వఁబడినవి. ఇవి సాధారణముగా వంశక్రమాగతములయి సంస్థానాధిపతి చిత్తవృత్తికి లోబడి యున్నవి. ఈ సంస్థానములోని జనులందరు తెనుఁగుభాష మాటలాడువారై యున్నారు. వీరిసంఖ్య 1881-వ సంవత్సరం జనాభా(లెక్క)ప్రకారము 150,350 మందియు, 1891-వ సంవత్సరం జనాభా (లెక్క) ప్రకారము 163,006 గురునై యున్నారు. ఈసంస్థానములో విశేషముగ జెరువులును, ఏటికాలువలును గలవు. సరాసరి 1,725 చెరువులు గలవు. కాలువలు ఈ సంస్థానపు భూములలో బ్రవహించు జంఝూవతి, వేగవతి, నాగావళియను నదులను సంబంధించి యున్నవి. ధాన్యము, చెఱుకు, ముఖ్యములైన పల్లపు

పంటలు. చోళ్లు, నువ్వులు, ఆముదాలు, ఉలవలు, కందులు, పెసలు, మినుములు, పొగాకు, మొదలగునవి మెట్టు పంటలు నై యున్నవి.

ఈ జమీందారీలో పదునాలుగు నీలిమందు ఫ్యాక్టోరీలు గలవు. వానిలో చాలామట్టుకు అర్‌బత్‌నట్ అండ్ కంపెనీ వారికి కౌలున కీయఁబడినవి.

మహారాజావారికి నివాసస్థానమైన బొబ్బిలి పట్టణము దీనికి రాజధాని. దీని యుత్తరాక్షాంశము 18°34′, ప్రాగ్రేఖాంశము 18°25′. ఇది విశాఖపట్టణమునకు వాయువ్యముగా డెబ్బదిమైళ్లదూరమునకున్నది. 1883-వ సంవత్సరములో బొబ్బిలికి విజయంచేసిన సర్. యమ్ ఇ గ్రాంట్ డఫ్ గవర్నరుగారీపట్టణము మిగుల బరిశుద్ధమైనదనియు, బాగుగ జాగ్రత్త చేయఁబడినదనియు, విద్యాశాలలు, వైద్యశాలలు మొదలగు నాంగ్లేయుల సంపర్కముచే నిండియాకు గలిగిన నాగరిక విషయములన్నియు గలిగియున్నదనియు, అప్పటికి 126 సంవత్సరములక్రిందట నొక భయంకరమైన యుద్ధము జరిగిన ప్రాత కోటకు సమీపములోనె యీపట్టణము గలదనియు, ఆయుద్ధవృత్తాంతము ఇండియాదేశపు చరిత్రలో రికార్డు చేయతగినదియునై యున్నదనియు, వారి చరిత్రలో వ్రాసిరి.

1881-వ సంవత్సరపు జనాభానుబట్టి గొల్లపల్లి, ప్రాత బొబ్బిలి, మల్లమ్మపేట యను నుపగ్రామములఁ గలసి యీపట్టణపు జనుల సంఖ్య 14,943. ఈసంఖ్యలో 14,545 గురు హిందు

వులును, 329 గురు మహమ్మదీయులును, 28 గురు, క్రైస్తవు లునై యున్నారు. 1891-వ సంవత్సరపు జనాభా ప్రకారము జనసంఖ్య 14,408. దీనిలో 14,075 గురు హిందువులును, 333 గురు మహమ్మదీయులును, 60 మంది క్రైస్తవులునై యున్నారు. ఈ పట్టణమున కనడాదేశపు బాప్టిస్టుమిషను నొకటి గలదు. ఈ మిషనువారొక బాలికాపాఠశాలను నుంచియున్నారు. స్వల్ప మైన యారాధక సమాజముగల రోమన్ కాతలిక్ గుడికూడ నొకటి యిచట గలదు.

ఇచట విష్ణ్వాలయమొకటియు, శివాలయమొకటియు నున్నవి. సబు మేజస్ట్రేటు ఆఫీసు, పోలీసు స్టేషను, సబు రిజస్ట్రారు ఆఫీసు, పోస్టు అండు తెల్లిగ్రాఫ్ ఆఫీసులు, లోకల్ ఫండు ఆసుపత్రి, సంస్థానపు ఘోషా ఆసుపత్రి, సంస్థానపు ఆఫీసులు, సంస్థానపు హైస్కూలు, విక్టోరియా టవునుహాలు, మహారాజావారి సత్రము, సంస్థానపు పూర్ హౌసు, మహారాణీ హిందూబాలికాపాఠశాల, మహారాజా పార్కు, మరియు యూరోపియనులకొరకు ట్రావిలర్సు బంగళాయును గలవు. పార్వతీపురము తాలూకా బోర్డుకు లోబడిన లోకల్ ఫండు పంచాయతుగూడ నిచట గలదు. ఈ పట్టణము నాలుగు దిక్కులను పానయోగ్యములగు నాలుగు కోనేరులు గలిగియున్నది.

బట్టలనేతయును, ఇత్తడి, కంచు, పాత్రలచేతయును, యిచ్చట జరుగు ముఖ్యములగు చేతిపనులై యున్నవి.

బొబ్బిలి సంస్థానపు గుటుంబమువారు వెలమ దొరలను ప్రసిద్ధికెక్కిన వర్ణమువారు. ఈ వెలమవారు "హిందువులలో బ్రాహ్మణుల తరువాత గొప్పజాతివారనియు, రాజపుత్రులతో సమానులనియు, దమ యుత్కర్షమును మిక్కిలి మానప్రధానములైన మర్యాదలచే గాపాడుకొనుచుందురనియు, నన్యమతస్థులయొక్కగాని, హిందువులలోని క్రిందిజాతులయొక్కగాని సంపర్కమాత్రమున స్నానముఁజేయుట యావశ్యకముగా దలఁచునంత యాచారము గలవారనియు," ఆరమ్ దొరగారు వ్రాసియున్నారు. ఈజాతివారు సాధారణముగా దృఢశరీరులును, వీర్యశాలురునునై యున్నారు. వారు ప్రసిద్ధమైన యహంకారము గలవారు గనుకనే తమ వర్ణపు ప్రభువులను దప్ప నితరులను సేవించినట్టు తెలియఁబడలేదు. వారిలో ననేకులు విద్యారహితులై, అనాగరికపు భ్రమలతో నిండియున్నారు. వారి మనసు నొచ్చినపుడుగాని, యవమానకరమైన దెద్దియైన విషయము వారికి సంభవించునపుడుగాని, వారు మిక్కిలి సాహసికులును, జీవితము విషయమున లక్ష్యమును లేనివారునై యున్నారు. 1758-వ సంవత్సరమునఁ జరిగిన ప్రసిద్ధికెక్కిన బొబ్బిలి ముట్టడిలో నప్పటి సంస్థానపుఁ బ్రభువు రాజాగోపాల కృష్ణరంగారావుగారును, వారి యనుచరులగు వెలమదొరలును, దేశస్థులునుఁ గనపరచిన పరాక్రమము హిందువుల మనసులను మిగుల నాకర్షించెను. గనుకనే యిప్పటికిని యీ చెన్నపురిరాజధానిలో ననేకభాగములయందుఁ దిరుగు పాట

కాంద్రచేఁ బాడఁబడు పాటలలో నిది వర్ణింపఁబడియున్నది. రంగారాయచరిత్రమను నొక ప్రబంధమున బొబ్బిలి యుద్ధ వర్ణనముఁ గలదు.

క్రమాగతులయిన బొబ్బిలి రాజుల జీవితచరిత్రములలో ముఖ్యవృత్తాంతములు సంక్షేపముగ నీ క్రింద వివరింపఁబడును. అయితే 1758-వ సంవత్సరమున బొబ్బిలికోట కొట్టివేయఁ బడుటవలనను, తదనంతరము గలిగిన యరాజకత్వముచేతను, గొందరి రాజుల పూర్తియగు వృత్తాంతమును దెలియఁజేయు రికార్డు దొరికియుండ లేదు.

---

## బొబ్బిలిరాజ్యసంపాదకుల విషయమైన నిర్ణయము.

---

ఈ సంస్థానమును సంపాదించినవారి విషయమునఁ గొందరు సంస్థానపు ప్రభువులు స్వయముగాఁ జెప్పిన ప్రబంధములందును, వారు కృతిబొందినవానియందును, రంగనాయకులు పాత్రుఁడుగా రొనర్చిన బొబ్బిలి జమీందారీచరిత్రయందును, కార్నేకల్ దొరవారి జిల్లా మాన్యువలందును, మఱియు సంస్థానపు రికార్డునందును, వ్రాయఁబడిన వంశపురుషచరిత్ర వెవ్వేరుగా నుండుటంబట్టి వాని వివిధాంశములనుఁ గనఁబరచుచు, నెవ్వ రీ బొబ్బిలిసంస్థానమును సంపాదించిరో వారినిఁ గూర్చి యీ క్రింద వ్రాయుచున్నాను.

ఈ యన్నిప్రబంధములందును ముందు శ్రీయనపోత ములవారితోఁ బ్రారంభించి, శ్రీలింగప్ప రంగారావుగారనువారు

కోటను, పురమును, నిర్మించిరని చెప్పుచు, వారివద్దనుంచి వంశ పురుషులఁ క్రమముగఁ జేర్చుకొనుచుండిరి.

అట్టి ప్రబంధము లెవ్వియనఁగా:—

(1) "శ్రీకూర్మక్షేత్ర మహాత్మ్యము," ఇది కొటికెల పూడి వెంకటకృష్ణ సోమయాజులుగారిచే రచియింపంబడి, రాజా రాయడప్ప రంగారావుగారికి కృతియీయఁబడెను.

(2) "సంకల్పసూర్యోదయము," ఇది శ్రీరాజా రాయడప్ప రంగారావుగారిచేతనే రచియింపఁబడినది.

(3) "ప్రపదనపారిజాతము," ఇది కొటికెలపూడి కోదండ రామయ్యగారిచే రచియింపంబడి, శ్రీరాజా శ్వేతాచలపతి రంగారావుగారిచే కృతినొందఁబడినది.

(4) "హరిభక్తి సుధోదయము,"

(5) "మిత్రవిందాపరిణయము," ఈ రెండు గ్రంథములును శ్రీరాజా రాయడప్ప రంగారావుగారి ద్వితీయపుత్రులగు శ్రీరాజాజనార్దన రంగారావుగారిచే రచియింపఁబడినవి.

ఇంగ్లీషు బొబ్బిలి జమీందారీచరిత్రలో జి. రంగనాయకులు పాత్రుఁడు, సంస్థానమును సంపాదించినవారు రాజా ధర్మారావుగారనియు, నీయంశము సంస్థానపు రికార్డులోనుండి కనిపెట్టంబడినదనియు వ్రాసెను. అట్లైనచో నిదియె విశేష ప్రామాణికముగా వచ్చును. కాని యీ క్రిందికారణములచే నది నిజమైన ట్లంగీకరించఁబడదు.

(1) 1821-వ సంవత్సరం డిశెంబరు నెల తే 15 దీని యప్పటి జిల్లా కలెక్టరువారగు జె. స్మిత్తు దొరగారు, శ్రీగవర్నమెంటు వారి యోచనలోనున్న కొన్ని యంశములను, (అనఁగాఁ బురాతన జమీందార్లకుఁ బోలీసు యధికారమును విడుచుటయును, కొన్ని షరతులకు లోఁబడి జమీందారీ లన్యాక్రాంతములు గాకుండఁ జేయుటయును,) వ్రాయుచు నప్పటి బొబ్బిలి యధిపతులగు శ్రీరాజా రాయడప్ప రంగారావుగారి యభిప్రాయముం గోరి వ్రాసిన జాబులోనే యీ సంస్థానమును సంపాదించిన వారెవరనియు, ఉత్తరాధికార విషయమున సంస్థానములో నేవిధమైన యాచారములు గలిగియున్న వొాయనియు వ్రాసిరి. దానికి రాజాగారు వెంకటగిరివంశములోని శ్రీసర్వజ్ఞసింగములుగారి పౌత్రుఁడగు ధర్మారావుగారీ రాజ్యమును సంపాదించిరని ప్రత్యుత్తరమంపిరి.

కాని పిమ్మట నైదుసంవత్సరములకు "సంకల్పసూర్యోదయము"ను ప్రబంధమును వారే రచించి యందలి వంశవృక్షమున నీ ధర్మారావుగారిపేరుగూడ వ్రాయరైరి.

(2) వంశచరిత్రను వ్రాయుచో, రాజా లింగప్ప రంగారావుగారు బొబ్బిలి పురమును, కోటను, నిర్మించి యచ్చట నివసించిరనియు బస్తరువరకు దేశముఁ జయించిరనియు వ్రాసిరి. రాజా లింగప్ప రంగారావుగారికి ముందు గొప్ప జయశాలియైన శ్రీయనపోతములుగారును, పండితులగు శ్రీసర్వజ్ఞసింగములుగారును, మా కుటుంబస్థులని వ్రాసిరి.

తక్కిన నాలుగు ప్రబంధములందును, సుప్రసిద్ధులైన యీ యిద్దరి పేరులతోఁ గుటుంబముల నారంభించుచు, లింగప్ప రంగారావుగారనేవారే బొబ్బిలి కోటంగట్టించి యచ్చట నివసించిరని జెప్పంబడియున్నది. గనుక తాము కలెక్టరుగారికి వ్రాసిన యుత్తరముప్రకారము సంస్థానమును సంపాదించినవారు ధర్మారావుగారు గానటుల రాజా రాయడప్ప రంగారావుగారి కీర్తి వల విశదమై యుండవలెను. ఏలనంటే వారు రచించిన ప్రబంధములో సర్వజ్ఞసింగములుగారిపేరు నుదహరించుచు, వారికి పౌత్రులు, నంతకు పూర్వము కలెక్టరుగారికి వ్రాసినటుల సంస్థానమును సంపాదించినవారునైన ధర్మారావుగారి నుదహరించక విడుతురా?

(3) మఱియు వెంకటగిరి వంశచరిత్రలో సర్వజ్ఞసింగములనువారసంతానవంతులైనను, వారికి సన్నిహితజ్ఞాతిసంతతిలోనివారై, వరుసచేఁ బౌత్రులైన ధర్మారావుగారనువారొకరు గలరు. ఈ సర్వజ్ఞసింగములుగారు 10-వ పురుషులైనందున, ధర్మారావుగారు 12-వ పురుషులుగా నేర్పడియెదరు. ప్రస్తుతపు శ్రీవేంకటగిరి రాజాగారు 28-వ పురుషులుగాన నీ ధర్మారావుగారికి వీరు 16-వ పురుషులగుదురు. గనుక నీ ధర్మారావుగారినే బొబ్బిలి మూలపురుషునిగ యోచించినచో వారివద్దనుంచి యిప్పటి బొబ్బిలి రాజాగారివరకును 16 గురు పురుషులుండవలసివచ్చును. అయితే బొబ్బిలికోటనుఁ గట్టినవారని చెప్పఁబడిన లింగప్ప రంగారావుగారినుంచి యిప్పటి రాజాగారివర

కును బదితరములే గలవు. కాఁబట్టి యీ యావత్సంగతి సందర్భములచేత నీ ధర్మారావుగారు బొబ్బిలి రాజ్యమును సంపాదించినవారు గానటుల స్పష్టమగుచున్నయది.

ఇంతియగాక వెంకటగిరి వంశవృక్షములో 9-వ పురుషులగు మఱియొక ధర్మారావుగారు గలరు. వీరిపేరిప్రక్కను వీరు రావువారని వ్రాయఁబడియున్నది. వెంకటగిరి, పిఠాపురము, బొబ్బిలి, హైదరాబాదుయిలాకా జటప్రోలునను సంస్థానముల వారందరు రావువారే యైయున్నారు. అయితే వెంకటగిరి వారు, జటప్రోలువారు, రావువారనుపేరుకు బదులుగా నిటీవల వారు నివసించిన పట్టణముల పేరులతో వాడుకజేయఁబడుచున్నారు. ఈ నలుగురి కుటుంబస్థులున్ను, యీ కుటుంబముల నుండి యుత్పన్నులైన యనే కేతరకుటుంబస్థులున్ను, 'రేచర్ల' గోత్రీకులై యున్నారు. వెంకటగిరి కుటుంబస్థులు రావువారను నింటిపేరుగలవారిలో మొదటివారై యుండుటయేగాక వెలమ దొరలకందరికిని నాదిపీఠస్థులై యున్నారు. వీరును మొదట రావువారనేపేరుతో నుండి 'ఏకశిలానగర' సమీపమున నుండెడి 'యామనగల్లు'ను పట్టణమున నివసించుటచే నామని గంటివారైరి.

మఱియు 13-వ పురుషుఁడు 'వెలుగోడ'ను పట్టణమున నివసించుటచే, వెలుగోటివారైరి. మీఁదఁజెప్పిన 9-వ పురుషులగు ధర్మారావుగారేదో యొక కారణమున నామనిగంటివారనుపేరును, అంతకు పూర్వపుదియగు రావువారను పేరును,

ఘూర్చుకొనియుండవచ్చును; లేక రావువారని పిలువంబడు చుండు పిఠాపురపువారికిగాని, లేక మరి యే యితరకుటుం బమువారికిగాని, మూలపురుషుఁడై యుండవచ్చును. అంతియె కాని బొబ్బిలికుటుంబమునకు మూలపురుషుఁడుగ నీయన తీసి కొనఁబడఁడు. ఏలనంటే ఈ ధర్మారావుగారిని మూలపురుషునిగఁ దీసికొనినను, లేక 12-వ పురుషుఁడగు ధర్మారావుగారినిఁ దీసి కొనినను, బొబ్బిలివంశవృక్షమునకు నలుగురినిగాని, యంత కధికముగగాని, పురుషులను కలపవలసివచ్చును. అంతియ కాక వారికి నామధేయములను, వారు నివసించు పట్టణము లను, గల్పించవలసివచ్చును. ఈ రావువారను నింటిపేరా కుటుంబములవారు నివసించెడి స్థలముల నామధేయములంబట్టి కాక, ప్రసిద్ధపౌరుషనామమై యున్నది. అదెట్లనిన :—

ఏకశిలానగర ప్రభువగు ప్రతాపరుద్రమహారాజుగారి రావను పేరును వెంకటగిరివంశమునకు మూలపురుషుఁడగు చెవ్విరెడ్డి, లేక భేతాళనాయుఁడుగారికిఁ గొంపవాస్తముగ దయ చేసి, దీనిం బ్రతివెలమవారును వారిపేరి చివర నుంచుకొనున ట్లాజ్ఞాపించిరి. 'పద్మనాయకచరిత్ర'లో నిందుకు సంబంధించిన యొకపద్యము గలదు.

గీ॥ "రాయదత్తమైనరావుపేరాదిని। పూనినలఁడుముఖ్యభూభు
జుండు। రెండవదియునయ్యెదండిసామాన్యమా। నాయ
కాఖ్యపద్మనాయకులకు॥"

శ్రీయనపోతములు, శ్రీసర్వజ్ఞసింగములు, అను వా రెవరో కొంచ మిపుడు విచారింతము. వారు వెంకటగిరివంశములోని శ్రీయనపోతములు, శ్రీసర్వజ్ఞసింగములుగాని మరి వేరువారుగారు. వీరిలో మొదటివారు బహు బలపరాక్రమశాలులుగాన ననేకులను, రాజులను జయించి కృష్ణానదివరకును దేశము నాక్రమించికొనిరి. ఒక యుద్ధములో దమమీాద సమకట్టివచ్చిన నూటయొకరిం దొరలం జంపి జయించినటుల జెప్పంబడియున్నది. రెండవవారగు శ్రీసర్వజ్ఞసింగములు గొప్ప పండితులుగా ప్రసిద్ధి కెక్కిరి. వీ రనేకవిద్యల నభ్యసించి యెల్లప్పుడు పండితులచేతం, గవులచేతం, బరివేష్టింపంబడియుండువారు. "సింగభూపాలీయము"ను గ్రంథమును రచించినారు. వీరికి సర్వజ్ఞనామము పౌరుషనామధేయమై యున్నది. వీ రిద్దరును రావువారికి మూలవంశమైన వెంకటగిరి కుటుంబములోనివారై యుండినను, బొబ్బిలి, పిఠాపురపువారలకుఁ బూర్వులై యున్నందునను, సుప్రసిద్ధులై యున్నందునను, కూటస్థులుగ నా చరిత్రలలోఁ గొనియాడఁబడిరి. అయినను వా రిరువురు సంస్థానముల సంపాదించినవారికంటె ముందుగాఁ జెప్పంబడిరి. ఇంతియకాక ప్రతి వెలమవారికుటుంబములోను వీ రుభయులు నిత్యము స్మరించఁబడుచుందురు.

ఇంగ్లీషు 'బొబ్బిలి జమీాందారీ చరిత్ర'ను వ్రాసిన జీ. రంగనాయకులు పాత్రుని యభిప్రాయము కేవలము తప్పై యున్నది. కలెక్టరుగారికి రాజా రాయడప్ప రంగారావుగారు

వ్రాసినయుత్తరము ననుసరించుచు, ధర్మారావుగారి నీ సంస్థాన మునకు మూలపురుషునిగ నెన్నికొని, వెంకటగిరి కుటుంబము లోని 6-వ పురుషులగు శ్రీయనపోతములుగారిని నా వంశము లోనే 12-వ పురుషుఁడగు ధర్మారావుగారికి కుమారుఁడని వింతగ వ్రాసెను. మఱియు శ్రీసర్వజ్ఞసింగములనువారిని ధర్మారావు గారికి ప్రపౌత్రులనియు వ్రాసెను కాని, వారు రాజా రాయ డప్ప రంగారావుగారి జాబుప్రకారముగానేమి, వెంకటగిరి వంశ వృక్షమువలననేమి, యీ ధర్మారావుగారు శ్రీసర్వజ్ఞసింగములు గారికే పౌత్రులై యున్నారు. లింగప్ప రంగారావుగారికంటె ముందు మఱిద్దరి బురుషులఁ జేర్చి వ్రాసెను. ఇటుల వ్రాయు టకు ననేకపురుషులం గనబరచుటయే ప్రధానముగ జూచి నటుల నున్నదిగాని మరేవిధమైన యుపపత్తియును లేదు. అన్ని ప్రబంధములలోను రాజా లింగప్ప రంగారావుగారు బొబ్బిలి కోటంగట్టి నివసించిరని జెప్పంబడియున్నది. గాని ఆయన రాజ్య మును సంపాదించినటుల జెప్పంబడి యుండలేదు. గనుక రాజ్య మును సంపాదించినవారు మరియొకరై యుండి యుండవలెను. కార్మేకల్ దొరవారి జిల్లామాన్యువలందు నటుతరువాత ప్రచుర పరచఁబడిన చరిత్రలందును పెదరాయఁడుగారు రాజ్యమును సంపాదించినవారని జెప్పంబడియున్నది.

కార్మేకల్ దొరవారి జిల్లామాన్యువలు 291-వ పుట 3-వ పేరాలో నిటుల వ్రాయఁబడియున్నది:—

---

## "బొబ్బిలివంశము—ఎస్టేటు."

"జమీందారుగారు వెలమవారు. నెల్లూరుజిల్లాలోని వెంకటగిరి జమీందారుగారి శాఖలోనివారై యున్నారు. క్రీ. వె. 1652-వ సంవత్సరములో పూర్వీకుఁడగు పెదరాయుఁడు షేరు మహమ్మదుఖానను శ్రీగాకుళపు నవాబు ఫౌంజుదారుయొక్క సేనతోఁగూడ నీ జిల్లాకువచ్చెను. ఆ ఖానునియొక్క మరియొక సర్దారు విజయనగరపు కుటుంబముయొక్క పూర్వుఁడైన 'పూసపాటిమాధవవర్మ'యై యుండెను. అప్పటినుండియు నీ రెండు కుటుంబములవారికిని విరోధములు గలవు. గంజముజిల్లాలోని 'పలాస'కు సమీపముననుండు "రంగవాక"యను స్థలముదగ్గర శ్రీగాకుళపు నవాబుయొక్క కుమారునిం గొందరు పితూరీదార్లు పట్టుకొన, వారలతో యుద్ధముంజేసి, యనేకులను జంపి, నవాబుకుమారుని విడిపించి, యీ పెదరాయుఁడు మిగులం బ్రసిద్ధిజెందెను. దానికిం బ్రతిఫలముగ నానవాబీయన కీ జిల్లాలోని "రాజాంపరుగణా" కౌలున కిప్పించి, 'రంగరావ'ను బిరుదు నొసంగె. ఈయనతరువాత రాజ్యమునకు వచ్చినవారలందఱు నా బిరుదమును వహించియున్నారు. ఈ క్రొత్త జమీందారుఁడు తనకుం జనుప్రాపగు షేరు మహమ్మదుఖానునిపేరిటం బెబ్బులి యనుపేరం బేటం గోటం గట్టించె. షేరనఁగా బెబ్బులి; ఈ పేరే పట్టణమునకును, జమీందారికి నుంచబడెను. లోకవాడుకలో నదియు బొబ్బిలిగ మారినది.

ఐదవరిపోర్టుయొక్క 140-వ పుటలో నీ సర్కారులలోని జనముంగూర్చి వ్రాయుచు, బ్రాహ్మణవిషయమై వ్రాసినపై నీ విధముగ వ్రాసెను:—

"ఈ సర్కారులలో ముఖ్య జమీందార్లు రాచవారు, రావువారు, వెలమవారు, అయియున్నారు. వారికి యుద్ధజీవనమున్ను, రాజపుత్రస్థానికుల యాచారమున్ను గలదు. గనుక క్షత్రియులతో సమానముగ నెన్నవచ్చును."

ఆ పుటలోనే క్రింద 'తాజాకలము'న నిటుల వ్రాయఁబడియున్నది:—

"రాచ—రావు అనుశబ్దములు 'రాజ' శబ్దమునకును, తదర్థకమైన 'రాయ' శబ్దమునకును తద్భవములు. అవి గౌరవార్థకమగు 'వారు' అనుశబ్దముతోఁ గలసి క్రమముగ విదేశీయ ప్రభుసంతతివారిని, నవ్యోదయ ప్రభుశాఖవారిని తెలియఁజేయుచున్నయవి. వెలమవారనువారు తెనుఁగువారిలో మలబారుదేశములోని నాయరులకును, కన్నడదేశములోని నాగుఖులకును, సమానులుగానున్నారు. వీరీ దేశస్థులలో తగుమనుష్యులు, ఆయుధోపజీవులునై యున్నవారు. వీరిశాఖ పూర్వపు 'ఏకశిలానగర'పు రాజులకాలములోఁ బ్రసిద్ధికెక్కినది."

డాక్టరు మెక్లీనుగారి చెన్నపురిరాజధాని మాన్యువలు యొక్క 60-వ పుట, 11-వ పేరాలో నిటుల వ్రాయఁబడియున్నది:—

---

# "బొబ్బిలి జమీందారీ చరిత్రసంగ్రహము."

ఈ రాజ్యము విశాఖపట్టణపు జిల్లాయందున్నది. దీనిచుట్టును గవర్నమెంటు తాలూకాలగు గజపతినగరము, చీపురుపల్లి, సాలూరు, పార్వతీపురము, పాలకొండ, బొబ్బిలియును గలవు. ఇది బొబ్బిలి, రాజాము, సీతానగరము, కవిటి, మెట్టుగ్రామములు అను స్థానపరగణాలు గలిగియున్నది. దీని రాబడి ర్పూ 375,000 లు. ఇందుండి తొంబదివేలరూపాయిలు (ర్పూ. 90,000) గవర్నమెంటువారికిం బేష్కషు చెల్లింపంబడుచున్నయవి. ఈ రాజ్యమునుగురించి యతిరుచికరమైన యొక చారిత్రము గలదు. క్రీ. వె. 1652-వ సంవత్సరమున పరస్పరవైరముగల ప్రస్తుతపు బొబ్బిలి యధికారియొక్క పౌర్వికుండైన పెదరాయునితోను, విజయనగరపు కుటుంబముయొక్క పౌర్వికుండైన మాధవవర్మతోను, షేరుమహమ్మదుఖానుండీ జిల్లాకు వచ్చెను. ఆ కాలమునుండీ యుభయకుటుంబములవారికిని వైరము గలదు. పెదరాయుండు త్వరలోనే తనధైర్య శౌర్యములకుం బ్రతిఫలముగ రాజాము జమీందారీని బడసెను. "షేరు," అనంగా బులి యని యర్థము గాన తనప్రాపకునిపేరం బెబ్బులియను కోటం గట్టెను. ఆ బెబ్బులియను పట్టణముయొక్కయు, జమీందారీ [illegible] లోకవాడుకలో బొబ్బిలియైనది. ఈ రాజ్యమునకు విజయనగరపు రాజ్యము సరిహద్దైనందున తరుచైన [illegible] నుభయాధిపతులకు నీర్ష్యలు బలమైనవి.

క్రీ. శ. 1756-వ సంవత్సరమున, పద్ధతులకు లోబడని ప్రవర్త నలుగల 'పాలేగాండ్ల' నణచుటకై బుస్సీదొరగారు గొంత యూరోపుదేశపు సేనతో బయలు వెడలిరి. ఆ దొరగారు విజయనగరముం జేరఁగానే యా రాజుగారి యల్లరలకన్నిటికిం బ్రోత్సాహకుఁడు బొబ్బిలియధికారియే యని చెప్పి, నమ్మించి, తనరాజభక్తిం గనఁబరచుటకుగా బదునొకండువేల (11,000) సేనతో తన వైరిని హతునిఁజేయుటకై ఫ్రెంచివారితో గలసెను. యుద్ధముం జేయుటకు ముందు బుస్సీదొరగారు గతించినదాని మన్నించెదమనియుం బితృపితామహాగతంబైన యీ రాజ్యంబు విడచిన నంత విలువగల రాజ్యంబును మరియొకచోట నిచ్చెదమనియు, బొబ్బిలి యధికారివద్దికి వార్త నంపిరి. గాని వారు దాని నిరాకరించిరి. ఈ బొబ్బిలికోటమీద దండెత్తివచ్చి చేసినయుద్ధము హిందూదేశపుచరిత్రలలో జ్ఞాపకముంచుకొనవలసినవానిలో నొకటియై యున్నది. తెల్లవారుజామున నారంభింపంబడిన రేఖలా దెబ్బలవలన యా కోట మంటిగోడ సందులిచ్చెను. చేజేతం గలసి నాలుగుఘంటలసేపు వీరావేశముతో పోరు జరిగినపిమ్మట బుస్సీదొరగారా గోడ బీటలను విరివిజేయుటకు ఫిరంగులగుండ్లను వేయుట కుత్తరువు నిచ్చెను. అప్పుడు రెండవసారి యుద్ధము జరిగెనుగాని ప్రయోజనము లేకపోయెను. ఏలనన బురుజు లెంతమాత్రమును స్వాధీనము పడుట లేదు. బుస్సీదొరగారైదుఘంటలకాల మిట్లు చూచి తిరుగ ఫిరంగులం గాల్పించిరి. అప్పటికిం గోటలోని

వారు తమస్థితియందు నిరాశులై వారిభార్యలను, కుటుంబస్థులను జంపి పిమ్మట బురుజుల నెక్కిరి. అప్పుడు మరల యుద్ధమారంభమాయెను. బుస్సీదొరగారు సూర్యాస్తమయ వేళకు జయమును పొంది మిగిలిన తనసేనతోఁ గోటలోఁ బ్రవేశించిరి. కోటలోఁ బ్రతివాఁడు జచ్చియో, లేక బలమైన గాయములు దగిలి పడియుండిరి. అప్పటికి ముసలివాఁ డొకయింటిలోనుండి ఒకచిన్న బాలుని దీసికొనివచ్చి బుస్సీదొరగారితో "నితనే చనిపోయిన మహాధికారి కుమారుఁడని" మనవిఁ జేసెను. మరి నలుగురు తమప్రాణములనుఁ గాపాడుకొని రెండురాత్రులు గడచినతరువాత విజయరామరాజుగారి బిడారమునకేగి మంచి నిద్రాసక్తులైయుండఁగా రాజుగారి గుడారముం జొచ్చి 32 ముప్పదిరెండు గాయములు రాజుగారిం బొడిచి చంపిరి. అంతమీఁదట గావలివాండ్రా నలుగురిం జంపిరి. అసమాన యుద్ధమునుండి బ్రతికి పంపబడిన బాలుఁడైన చినరంగారావును, అతని తండ్రి కిచ్చియుండిన భాగముల కధిపతిగ బుస్సీదొరగారు నియమించిరి. కాని యాయనకు యుక్తవయసు రాకపూర్వమే యాయన పినతండ్రి తమ పూర్వపురాజ్యమగు రాజ్యమును తన నిజబలముచేతనే తిరుగ సంపాదించెను. తరువాత విజయనగరపువారికి కప్పకట్టి, రాజాం పరగణాలను కౌలునకిచ్చి వారితో రాజీపడిరి. అయినప్పటికి దిరుగ ప్రాతవైరము ప్రబలినందున బొబ్బిలి యధికారి నిజాంవారి దేశమునకుం దప్పించుకొనిపోయెను. 1794-వ సంవత్సరమున విజయనగరపు రాజ్యము

విభజింపఁబడుటలో బ్రిటీషు యధికారులవలన చినరంగారావు నకుం దన పిత్ర్యమైనదేశము తిరుగ నీయఁబడినది. 1801-వ సంవత్సరమున చినరంగారాయుని దత్తపుత్త్రుఁడగు రాయడప్పకు ర్పా. 90,000 ల పేష్కస్తీ నేరుపరచి శాశ్వతపు కౌలీయఁబడి నది. అదిమొదలీ రాజ్యము నెమ్మదికలిగియున్నది. రాయ డప్ప తరువాత 1830-వ సంవత్సరమున వారి కుమారుఁడు శ్వేతాచలపతి ప్రభుత్వమునకు వచ్చెను. వారు విశేషనేర్పుతోఁ బ్రజలం బరిపాలించిరి. 1862-వ సంవత్సరమున శ్వేతాచలపతి గతించిన పైని గోదావరిజిల్లాలోని పిఠాపురపు జమీందారీ కుటుంబమునుండి దత్తుఁడైన సీతారామకృష్ణులు ప్రభుత్వము నకు వచ్చెను. సీతారామకృష్ణు లసంతానవంతులై 1868-వ సంవత్సరమున గతించినపైని వారి భార్య లక్ష్మీచల్లయ్యమ్మ ప్రభుత్వమునకు వచ్చెను. బంగాళములోని క్షామనివారణా ర్థము 1,000 గరిశెల ధాన్యము ధారాళముగ బీదలకు నిచ్చి నందున నీమెకు 1876-వ సంవత్సరము 'రాణి' యను బిరు దీయఁబడినది. నెల్లూరు జిల్లాలోని వెంకటగిరికుటుంబమునం దుండి ప్రకృతపు జమీందారులైన వేంకట శ్వేతాచలపతి నామె 1871-వ సంవత్సరమునఁ దత్తునిఁ జేసికొనినది. ఈ వేంకట శ్వేతాచలపతి యుక్తవయసు రాగానే 1881-వ సంవ త్సరమున బ్రభుత్వమునకు వచ్చెను.

హంటరుదొరగారు రచించిన ఇండియా ఇంపీరియల్ గజెటియరులో మూడవసంపుటములో 21 యిరువదియొకటవ

పుటలో మీఁదఁ జెప్పినతీరున బొబ్బిలినిఁగూర్చి యొకవృత్తాంత మీయఁబడియున్నది.

పై వాసివలన క్రీ. వె. 1652-వ సంవత్సరములో శ్రీగా కోళపు మొదటి నవాబగు షేరు మహమ్మదుఖానునివెంట పెద రాయుఁడు వచ్చినట్లు స్పష్టమగుచున్నయది. రెండవవారు విజయనగరపు కుటుంబముయొక్క పూర్వికుఁడగు మాధవవర్మ గాయున్నారు. ఈ యుత్తరసర్కారులను జయించుటలో షేరు మహమ్మదుఖానునికి సహాయము జేయుటకు నతని వెంట వచ్చిన మాధవవర్మయు, పెదరాయుఁడును, సాధారణ మనుష్యులై యుండవలెను గదా! మాధవవర్మయనువారు బెజవాడ సమీపమున నుండు కొండపల్లికి దగ్గరగానున్న పూసపాడనుస్థలమున నధివసించియున్నారు. అక్కాలమునం గృష్ణానదీ దక్షిణతీరమున నున్న దేశమంతయు వెంకటగిరిరాజ్యముక్రింద నుండెను. అప్పటి వెంకటగిరిరాజుగారు పెదరాయప్పని వాడుకఁ జేయం బడుచుండెడి నిర్వాణరాయప్పగారై యున్నారు. గనుక తప్పక శ్రీగా షేరు మహమ్మదుఖానునితోడ నీ దేశమునకు వచ్చినవారే పెదరాయుఁడయ్యె యుండవలెను. వెంకటగిరివంశచరిత్రలో వారు 15-వ పురుషులై యున్నారు. ఆయన యనేకములైన యుద్ధములం జేసి విశేషప్రసిద్ధిం జెందినవారు గాకపోయిన మొదల నాయనపేరు నాయన సంతతివారగు వెంకటగిరి, బొబ్బిలి కుటుంబస్థులలో ననేకులకు నుంచఁబడియుండదు. ఆయనకు ముందు వెంకటగిరి కుటుంబస్థులలో నెవరికిని రాయ

ద్ధప్ప యనుపేరే లేదు. ఆయన బొబ్బిలి సంస్థానమును సంపాదించినవారైనందున వారిపేరు (రాయుఁడు, లేక, రాయడప్ప) యని యనేకులకు నీ క్రింద కనఁబరచిన వంశవృక్షప్రకారమీాయఁబడియున్నది. ఈ జమీాందారీలో రెండు పెద్ద చెరువులాయనపేరుతో 'రాయునింగారి చెరువులని' పిలువంబడుచున్నయవి. పైని గనఁబరచిన యావత్సంగతి సందర్భములచేతను వెంకటగిరి కుటుంబములోని 15-వ పురుషుఁడగు సర్వాజ్ఞ రాయప్ప, లేక పెదరాయప్ప యనువారు పెను మహమ్మదుఖానునివెంట నీ సర్కారులకు వచ్చి యీ సర్కారులను స్వాధీనముఁ జేసికొనుటలో విశేష భుజపరాక్రమముఁ గనఁబరచినందున నీ జమీాందారిని ప్రతిఫలముగ మొగిలాయి గవర్నమెంటువారివలన పొందిరని స్పష్టముగను, నిజముగను, కనఁబడుచున్నది. కార్మైకేల్ దొరవారి మాన్యుయలులో సింహరాయుఁడు నవాబుకుమారుని, గొందరి కలహకారులవలన విడిపించి ప్రతిఫలముగ నవాబువలన రాజాముహుండాను పొందిరని యున్నది. బొబ్బిలి యిటీవల గట్టఁబడినది. గనుక నప్పటికి రాజామను పేరుగనే యుండెను. ఇప్పుడు బొబ్బిలి తాలూకాగా నున్న భాగము, సీతానగరపు తాలూకాలోఁ జేరియుండెను. అప్పుడే కుటుంబపారంపర్యముగ 'రంగారావను' బిరుదమిచ్చినట్లు దొరగారు వ్రాసిరి. అయితే రాజా లింగప్ప రంగారావుగారు నవాబుకుమారుని వైరులవలన విడిపించినట్లును, దానికి రంగారావను కితాబునున్ను, సర్వమొఖాసాగా జమీాందారీ

లోని 12 గ్రామములనున్ను, పొందినసంగతి యెల్లవారికిం దెలిసినదై యున్నది. రాజా లింగప్ప రంగారావుగారిచరిత్ర వ్రాయునపు డాయన ప్రతాపమును నిందుగ నచట వ్రాయు మన్నాను. 'రంగవాక'వద్ద జరిగిన యుద్ధమున నీ లింగప్ప రంగారావుగారి పరాక్రమమును, రంగారావను కితాబునొందు టయు, నీ దేశములోని ప్రతివారికిం దెలిసినదియై యున్నది.

ఇంక వెంకటగిరిచరిత్రయం దీ పెదరాయప్ప విషయ మేమి చెప్పంబడియున్నదో చూతము. దానియం 28 దిరువది యెనిమిదవ పుటలో నిట్లు వ్రాయంబడియున్నది :—

15-వ పురుషుండు.

"చినసింగమనాయనివారి కుమారులు నిర్వాణరాయప్ప, లేక పెదరాయప్పనాయనివారై యున్నారు. వీరు వెలుగోడు పట్టు రాజులను జంపి కోటను స్వాధీనముం జేసికొని శ్వేత చ్ఛత్రముం బట్టించుకొనిరి. దానిచేం బ్రతాపరుద్రమహారాజు సంతతిలోనివారగు ప్రతాపరుద్రుని పేరుగలవారు "వెలిగో డుగు విభుండు" అని పౌరుషనామమిచ్చిరి.

ఈ నిర్వాణరాయప్పగారు ధర్మముచేతను, దైవభక్తి చేతం బ్రసిద్ధిం బొందినవారై యున్నారు. వీరు కేవల విష్ణు మతస్థులు. ఒకానొక దుర్భిక్షకాలమున బ్రాహ్మణులు జప హోమాదులం జేసి వర్షముం గురియునటులం జేసినందున నకేక గృహదానములను వారికిం జేసిరి. వీరు స్వర్గస్థులై

నప్పుడు మల్లన్నకవి "వైకుంఠారోహణము" అనెడి యొక గ్రంథమును రచించె."

16-వ పురుషుఁడు.

"నిర్వాణరాయప్పనాయనివారికి నలుగురు కుమారులు గలరు. వారిల్లో నిద్దరివిషయ మేమియుం దెలియదు. పెద్ద కుమారుని సంతతిలో నైనుతరములవరకుం దెలియనగుఁ గాని వారి చరిత్ర" మేమియుఁ దెలియదు.

"మూఁడవ కుమారుఁడైన కుమారతిమ్మానాయనివారు వంశకర్తలైరి. వీరు వెలుగోడు రాజధానిగం జేసికొని రాజ్యమును బాలించిరి. శత్రులనందరిని జయించిరి. వీరును బ్రాహ్మణులకు భూములను, గృహములను, ధారాళముగ దానముఁ జేసిరి."

మీఁద వ్రాయఁబడినదానిచే వెంకటగిరి వంశచరిత్రలో 'బెదరాయుఁడుగారు' బొబ్బిలి సంపాదించిన విషయముఁ జెప్పంబడియుండలేదు. కాని వారికి నలుగురు కుమారు లుండిరని యందు రెండవ, నాల్గవ కుమారులనుగురించి యేమియుం దెలియదని గ్రంథకర్త వ్రాసెను. పెద్దకుమారుని విషయమున నేమియు వ్రాయక యైదుతరములవరకు వారల పేరులం దెలియుననిమాత్రము వ్రాసెను. ఈ పెద్దకుమారుఁ డేమికతమునం దనతండ్రికి తర్వాతఁ బ్రభుత్వముం జేయలేదో తెలియదు. దీనింబట్టి వెంకటగిరి రికార్డు రాజ్యమును పాలించినవారికి సంబంధించిన యంశముమట్టున నుంచఁబడినట్లు స్పష్టమగు

[illegible]యున్న వెంకటగిరి ఇంగ్లీషుచరిత్ర ప్రచురింపంబోవునపుడు [illegible] ప్రకారము వెంకటగిరి రాజాగారు దానచ్చుటచ్చుటం గాన కొట్టివేసినట్లును, ఏవిధమైన సంగతి తెలియని కొందరి పురుషులంగూడ విడిచినట్లును, నాకిటీవలం దెలియవచ్చినది. [illegible] జేసినో కారణము తెలియదు. దీనికి దృష్టాంత మేమనిన వెంకటగిరి, కాళహస్తి, సంస్థానము లొకసారియే [illegible] నవనను. కాళహస్తి వంశవృక్షప్రకార మిప్పటి రాజాగారు 34-వ పురుషులై యున్నారు. మా జ్యేష్ఠసోదరు [illegible] వెంకటగిరి ప్రస్తుతపు రాజాగారు 28-వ పురుషులై యున్నారు.

[illegible] రాయుని రెండవ, నాల్గవ కుమారుల విషయమై [illegible] చరిత్రయందు [illegible] చెప్పంబడియుండలేదు. అందు [illegible] "రంగప్ప" యనియున్నది. తెనుగు [illegible] ర యనునక్షరమును, ల యనునక్షరమును బాగా [illegible] వ్రాయనిచో ననేకు లొకదాని నొకటిగా భ్రమసి [illegible] ఇట్టి బూర్వకాలమున నప్పటి వ్రాతకాధారము [illegible] వ్రాసినపుడా రెండక్షరములను భేదించుట [illegible] క్రమగలిగి యుండునో చెప్పనక్కఱలేదు. గనుక [illegible] 'లింగప్ప' యనుపేరు పొరబాటున 'రంగప్ప' యని చదువంబడిగాని, వ్రాయంబడిగాని యుండవలెను. కాన నిజము [illegible] రాయుండు తన కనిష్ఠకుమారుండగు లింగప్పతోం [illegible] మహమ్మదుఖానుని వెంటవచ్చి క్రొత్తగా సంపా

ఠింపఁబడిన జమీందారీ నేలుట కాకుమారుఁ నచటవిడిచి తాను వెంకటగిరికి తిరిగి వెళ్లియుండవలెను. లేదా పెదరాయుఁడు తనవెంటవచ్చిన కుమారుఁడగు రంగప్పకు వెంకటగిరి వంశములో సుప్రసిద్ధుఁడగు 9-వ పురుషుఁడైన లింగప్ప యనువారి పేరు నుంచియుండవలెను. ఏలనన: నీ లింగప్ప క్రీ వె. 1434-వ సంవత్సరము మొదలు 1470-వ సంవత్సరమువరకు రాజ్యపాలనముఁ జేసెను. ఆ కాలమున నప్పటి జగన్నాథము, లేక కటకపు మహారాజగు మహారాజా గజపతిరాజుగారిచే మెప్పువడయునట్లు జగన్నాథమువరకు నీ సర్కారులను జయించెను. అట్లు జయింపఁబడిన దేశము ఉత్తరమున జగన్నాథము మొదలు దక్షిణమున కొండవేటి సీమవరకును, తూర్పున కళింగపట్టణముమొదలు పశ్చిమమున చీకటివరకును నుండెను. ఒకనాటి యుద్ధమున వీరు తమమీఁద నేకముఖముగ సమకట్టి వచ్చిన 32 రు ప్రభువులను జంపిరనియుఁ జెప్పఁబడియున్నది.

ఇండియా దేశపుచరిత్రను వ్రాసిన 'టాల్ బోయస్ వీలరు' దొరవారు 'బొబ్బిలియుద్ధ'విషయమై వ్రాయుచు నిట్లనిరి:—

"బొబ్బిలిరాజుగారు గొప్ప రాజపుత్రవంశ్యులమని చెప్పుకొందురు. వీరిపూర్వులే పూర్వపు జగన్నాథపు రాజులతరపున దక్షిణదేశమున యుద్ధములం జేసిరని పురాణపుకథ కలదు."

టాల్ బోయస్ వీలరు దొరవారా యుద్ధములం బురాణకథలని చెప్పినను, పురాణకథలలో గొంత నిజమును గలదు. ఆ నిజమైనకథ వెంకటగిరిచరిత్రనుండి కనిపెట్టఁబడినది.

## రాజా పెదరాయుఁడు బహద్దరుగారు.

(సంస్థాన స్థాపకులు.)

వీరు వెంకటగిరి సంస్థానపు రాజులలో 15-వ పురుషులైన నిర్వాణరాయప్పగారు, లేక, పెదరాయుఁడుగారై యున్నారు. మొగలాయి ప్రభువులనిమిత్తి ఈ దేశమును జయించుటకు పేరు మహమ్మదుఖానుఁడను సర్దారుఁ డిచ్చటికివచ్చినప్పు డతని వెంట వచ్చిన ప్రభువు లిరువురియందు వీరొకరై యున్నారు. అప్పటి యుద్ధములయందు వీరు చాలా సహాయము జేసి పాదుషా వలన రాజాము సంస్థానమును ప్రతిఫలముగఁ బడసిరి. విజయనగరపు సంస్థానపు మూలపురుషులగు మాధవవర్మగారుం పేరు మహమ్మదుఖానుని వెంటవచ్చిన రెండవ ప్రభువై యున్నారు.

ఈ సంస్థానము నొసంగినప్పుడే పెదరాయుఁడుగారికి కుటుంబపారంపర్యముగ రాజా, బహద్దరు, మొదలగు బిరుదులును, తెల్లజెండా, ఢంకా, నవుబత్తు మొదలగు రాజచిహ్నములు నీయఁబడినవి. ఈ యుత్తరసర్కారులయందు యుద్ధసంబంధమైన అల్లరులన్నియు నణఁగినపిమ్మట నీ పెదరాయుడుగారు తమవెంటవచ్చిన కుమారుఁడగు లింగప్పగారి కీ రాజ్యమున్విడచి తమపితృపితామహక్రమాగతమైన వెంకటగిరిరాజ్యమునకుం దిరిగి వెళ్లిరి.

## II

## రాజా లింగప్ప రంగారావు బహదరుగారు.

---

ఈ లింగప్ప రంగారావుగారి నప్పటిప్రభువు లీకొండల సమీపమునందు జరుగుచుండు పితూరీలని వారణార్థము సహాయము నిరుచుగ గోరుచున్నందున నీ ప్రాతబొబ్బిలికోటను తమకు నివాసస్థానముగ నేర్పరచుకొని యచ్చట గోటను, పురమును నిర్మించి వానికిం దమ ప్రాపకుండైన షేరు మహమ్మదుఖానునిపేరున 'బెబ్బులి' యని పేరుబెట్టిరి. ('షేరు' యనంగా పులి—బెబ్బులి యనంగా పెద్దపులి.) అన్ని ప్రాతప్రబంధముల యందేకరూప్యముగ జెప్పంబడినరీతినే వీరు నిచ్చట నివసించి సాలూరు మొదలగు పర్వతప్రాంతముల బితూరీదార్ల నెల్లరలను విశేష శ్రమనొంది నివారించిరి. ఈ క్రింద వివరించిన సందర్భములవలన "రంగారావు"ను బిరుదును కుటుంబ పారంపర్యముగ పొందిరి.

శ్రీకాకుళపు సర్కారు నవాబైన షేరు మహమ్మదుఖానుని కుమారుం డొకనాడు వేటకు వెళ్లియుండంగా గంజము జిల్లాలోని పాలకొండ సమీపముననుండు "రంగవాక" యను స్థలమునొద్ద నొక బలాఢ్యుండైన పితూరీదారుం డతనిం బట్టికొనెను. ఆ స్థలము వెదురుపొదలచేతం గప్పంబడియుండుటం జేసి సైన్యమువారికి గుజ్జుపడుచొచ్చి వెళ్లుటకు వీలులేనందున నా నవాబుగారు రాజా లింగప్ప రంగారావుగారి సహాయమును

గోరిరి. వెంటనే తమయొక్క బలముగల సేనం దీసికొని రంగవాకకుం బోయి యొకనాటి యుద్ధమునందే యా పితూరీదారుం బట్టికొని యా నవాబు కుమారుని విడిపించి విచారగ్రస్తుండైన యాతని తండ్రికి నొప్పగింప నా నవాబీ రాజుగారు దనకుఁ జేసిన సహాయమును మొగలాయి చక్రవర్తిగారికిం దెలిపి సిఫారసుః జేయగా నా చక్రవర్తిగా రొకనాటిరాత్రి నీ రాజా లింగప్ప రంగారావుగారు తమ జమీందారీలోని యెన్ని గ్రామములయందుం దోరణములఁ గట్టింతురో యన్నిగ్రామముల సర్వమొఖాసాగా ననుభవించుట కుత్తరువిచ్చిరి. ఆ విధముగ దోరణములు గట్టఁబడిన గ్రామములు పదియురెండునై యున్నవి. అవి యిప్పటికిని సార్థకమైన పోటుగ్రామము లను పేరం బిలువంబడుచున్నయవి. అవి యెవ్వియనఁగా:—

1 అంపావిల్లి, 2 వంతరాము, 3 గంగాడ, 4 అంట్లవార, 5 తెర్లాము, 6, గ గన్నపాడు, 7 పుత్తరావిల్లి, 8 నారాయణపురము, 9 పలగర, 10 కంచరాము, 11 గలావిల్లి, 12 ఉద్దవ్రోలు.

ఆ సమయముననే వీరు మొగలాయి చక్రవర్తిగారివలన కుటుంబపారంపర్యముగా 'రంగరావ'ను బిరుదునున్ను బడసిరి. రంగారావనఁగా రెండర్థముల నిచ్చు బిరుదై యున్నది. (1) 'రంగవాకకు ప్రభువు.' ఇందలి 'వాక'యనుదానికి కొండలచేఁ జుట్టఁబడిన యున్నతవిశాలప్రదేశమని సర్వసాధారణమైన యర్థము. తరుచుగ నిట్టితావులు పితూరీదార్లకు నివాస

జనార్దన రంగారావు, లేక పెద జనార్దన రంగారావుగారు లక్కవరపుకోట రాజ్యమును సంపాదించిరి.

ఈస్టు ఇండియాకంపెనీవారి వ్యవహారవిషయమై సెలెక్టు కమిటీవారి మొదవ రిపోర్టు రెండవ పుస్తకము 221-వ పుటలో నిట్లు వ్రాసిరి:—

“15—విజయనగరమునకుం బశ్చిమమున బదిక్రోసుల దూరముననుండు లక్కవరపుకోట పూర్వము రంగారావుగారి [illegible]ముయొక్క శాఖవారిదై యుండెను.”

అక్కాలమున నిటీవల ననేకసంవత్సరములవరకును, కసింకోట ఎస్టేటు రావువారికి బంధువులగు వెలికానివారి క్రిందనుండెను.

V

రాజా రాయడప్ప రంగారావు బహదరుగారు.

ఈ రాజుగారు తమ తండ్రిగారు స్వర్గస్థులగునప్పటికి [illegible] నుండినందున ముందుదహరింపంబడిన పెద జనార్దన రంగారావుగా[illegible] మారుడు నప్పటికి లక్కవరపుకోటకుం [illegible] వెంకటపతి రంగారావుగారి యెస్టేటును కొన్ని [illegible]ములవరకుం బరిపాలించిరి. తరువాత నీ వెంకటపతి [illegible] మారుడగు జనార్దన రంగారావుగారును [illegible] బాలించినపిదప రాజా రాయడప్ప రంగారావు [illegible] స్వయముగ సంస్థానపు వ్యవహారమును తాము

తీసికొని యనేకసంవత్సరములు సామర్థ్యముతోను, నేర్పుతోను వ్యవహరించిరి.

---

## VI

### రాజా గోపాలకృష్ణ రంగారావు బహదరుగారు.

---

ఈ రాజుగారు రాజా రాయడప్ప రంగారావుగారికి దత్తపుత్రులై యున్నారు. వీరి జనకతండ్రిగారు గోపాలరావు గారు, వీరి సోదరులు వెంగల రంగారావుగారునై యున్నారు. ఈ గోపాలరావుగారు బొబ్బిలి కుటుంబస్థులలోనివారైనను, నెవరి నాటినుండి యీ శాఖ వేరైనది బాగుగఁ దెలియరాదు. వీరి ప్రభుత్వకాలముననే 1758-వ సంవత్సరమున విజయనగరపు పెద విజయరామరాజుగారు బుస్సీయనెడి ఫ్రెంచి సరదారునిం దోడుచేసికొని బొబ్బిలికోటను ముట్టడించెను.

ఆరము వ్రాసిన హిందూస్థానపు చరిత్ర, రెండవ సంచిక, 254—260 పుటలలో నీ క్రింద వ్రాసినవిధమున బొబ్బిలి యుద్ధవిషయమై వ్రాయఁబడియున్నది :—

" రాజా అని పేరుపెట్టుకొన్న యీ జమీందార్లయొక్క సరణిలో బొబ్బిలి రంగారావుగారు మొదటివారుగా నుండెను. బొబ్బిలికోట విశాఖపట్టణమున కీశాన్యముగా 140 మైళ్ల దూరమందున్న కొండకు సమీపముగానున్నది. ఈ తాలూకాలు సుమారుగా 20 చదరపుమైళ్లుండును. ఈ జమీందారునకును,

విజయరామరాజుగారికిని, చిరకాలమునుండి విశేష వైమనస్యము కలిగియుండెను.

విజయరామరాజుగారి యధికారమునకు రంగారావుగారు అత్యంతము భయపడుచుండియు, ఆయన యల్ప వంశస్థుఁడైనట్లు, నవీన ప్రసిద్ధికలవాఁడైనట్లు, నాయనయం దపారమైన మత్సరబుద్ధికలవాఁడై యుండెను. విజయరామరాజుగారి తాలూకాలు బొబ్బిలి తాలూకాలతోఁ గలిసియుండునవి. బొబ్బిలి ప్రజలు గట్టులు మొదలైనవాటి ప్రవాహమును మళ్లించి తమ భూములకు తీసికొనిపోవువారు, గ్రామములను దోచుకొనువారు, బొబ్బిలివారికన్న శ్రేష్ఠతరమైన యుద్ధసామగ్రి లేనందునను, రంగారావుయొక్క దేశ మగమ్యముగానున్నందునను, ఈ కార్యములకు విజయరామరాజుగారు ప్రతిక్రియ జేయలేక పోవుచు వచ్చిరి.

రంగారావుగారిని, అచ్చటనుండి తొలగించుట యావశ్యకమనునట్లు విజయరామరాజుగారు తమయొక్క యావత్తు సామర్థ్యమును, వాదదార్ఢ్యమును, వినియోగపరచి బుస్సీగారికి బోధపరచిరి. అందుపైని వంశానుక్రమముగా నివసించఁబడియున్న బొబ్బిలి విడిచిపెట్టవలసినదనియు నందుకు బదులుగా ప్రదేశములో వారియొకచోట బొబ్బిలికన్న, నెక్కువ వైశాల్యమును, యెక్కువ నాణ్యమయిఁగల వేఱే భూస్థితి నిప్పించడమగునని యు, బుస్సీగారు తెలియఁజేసిరిగాని, యీ యూహ తనకవమానకరముగా రంగారావుగారివలన భావించబడెను. తరు

వ్రాత శీఘ్రకాలములోనే దూరముగానున్నట్టియు, బొబ్బిలి యడవులలోనుండి సమీపమార్గము గలిగియున్నట్టియు, కొన్ని తాలూకాలలోకి కొందరు శిపాయిలను బంపించ నగత్యము సంభవించెను. ఆప్రకారము పంపించుటకు బుస్సీగారు అనుమతించిరిగాని విజయరామరాజుగారు చేసిన తంత్రమువలననో, లేక రంగారావుగారు అదివరకు నుద్దేశించిన సంకల్పము వలననో, గాని యీ శిఫాయీలను మార్గములో గొందరు తీక్ష్ణముగా నడ్డుకొని పోట్లాడుటయు నందువలన నా శిఫాయిలలో జన 30 మంది చనిపోవుటయు, మరికొందరికి గాయములు తగులుటయు తక్కినవాండ్రు మళ్లి వెళ్లిపోవచ్చుటయు సంభవించినది. ఈ సంగతినిబట్టి విజయరామరాజుగారు బుస్సీగారిక కోపము మరింత వృద్ధిచేసినారు. తాను చేయదలచిన పనివలన ముందువచ్చు భయంకరమైన యవస్థ నాలోచించుకొనకుండ బొబ్బిలిదేశమును లోబరచుకొనుటకును, యీ జమీందారును, సకుటుంబముగా నచ్చటినుండి తొలగించుటకును, బుస్సీగారు నిశ్చయించిరి.

శ్రీకాకుళము సర్కారులో విశాలమయిన బయలు ప్రదేశములు స్వల్పముగ నున్నవి. అందుగల పర్వతములు, ఈ జిల్లాకును వాయువ్యముగనున్న రాజమండ్రం జిల్లాకును, సరిహద్దుగానున్న పెద్ద పర్వతములకు సమీపముగా వెళ్లిన కొలది విశేష సాంద్రముగానున్న, మిక్కిలి యున్నతమైనవిగానున్న యున్నవి. వ్యవసాయముకొరకు యేర్పడి యున్న

వెళ్లువగల లోపలను, ఆపునిమిత్తే మా పర్వతములయందును, పర్వతమును పర్వతమును మధ్యనున్న స్వల్పమగు వెడల్పుగల దిగువభూములయందును, సాంద్రమైన యడవి వృద్ధి బొందించ బడియుండెను. రంగాంపురానికి వేరే పట్టణములు, కోటలు, నుండుటయేకాక మిక్కిలి యుపద్రవ మొచ్చినప్పుడు తనకుం దన వారి సంబంధులకును రక్షణార్థమై ఆయనదేశములో నత్యంత దుర్గమప్రదేశమందు నొక కోట కలిగియుండెను. అది జనులు ఫిరంగులను వాడుకచేయుట యెరుగని కాలములో శత్రువులవలన ప్రమాదము రాకుండ నాత్మరక్షణకు కావల సిన సదుపాయములన్నియు నుండునట్లుగా వింతగా కట్టఁబడియుం డెను. ఈ కోట చతురస్రాకారము గలది. రెండువందల గజ ములకు మించని ప్రమాణము గలది. దానికి ప్రతికోణమందును నొక్కొక బురుజుగలదు. కోటకు నుభయ పార్శ్వముల యందు (యొకపార్శ్వమందొకటి, యొకపార్శ్వమందొకటి,) చతు రస్రములగు ద్వారములున్నవి. గోడయెత్తు అ 22 లు బురుజు యెత్తు అ 12 లు దిగువభాగము బురుజుకు విశేష వెడల్పు గానున్నప్పటికిని మీది భాగము అ 12 లు మాత్రమే వెడల్పు గలదై యుండెను. ఇది యావత్తు పదునుగలమట్టితోఁ గట్టఁ బడియుండెను. మట్టి ముందుగా నొకవరుసవేసి, అది యెండ నిచ్చి దానిపైని మరియొక వరుసవేసి, ఆ ప్రకారముగానే క్రమ క్రమముగా చాలవరుసలు వేసి కట్టినారు. బురుజుపైని అ 10 ల యెత్తు అ 3 ల వెడల్పుగల పిట్టగోడయుండెను. ఈ పిట్టగోడకు

మీాదినుంచి దిగువకు అ 5 లు పొడవున్ను, అం 6 అంగుళ ములు వెడల్పున్ను గల సందులు, సందుసందుకు మధ్యను అ 3, 4 లు విశ్రామముండునట్లుగా నేర్పరచఁబడియుండెను.

అట్టిసందులయొక్క దిగువమట్టమునకు నొక యడుగు పైగా నొకవరుసగాను, రెండడుగులుదిగువుగా నొకవరుస గాను, మరి రెండడుగులు దిగువగా మరియొక వరుసగాను, గుండ్రటిరంధ్రము లుంచఁబడియున్నవి. కాల్చిన మట్టిగొట్ట ములు, గోడలో నమర్చుటవలన నీ రంధ్రములు రూపింపఁబడి యుండెను. తుపాకులు, ఫూసలు, బల్లెములు, శత్రువులపైని వినియోగపరచుట కీరంధ్రములను, నీయన్ని యాయుధములం గూడ స్వేచ్ఛగా వాడుకచేయుటకు సదరుసందులును, నిర్మింపఁ బడియుండెను. నలుచదరముగానున్న దిమ్మలకును, తక్కిన కోటయావత్తుకునుగూడ సదరుప్రకారము పిట్టగోడ కట్టఁబడి యుండెను. కోటకు నెదుటిభాగములయందు నలుచదరపు దిమ్మలక్రిందినుండి గుమ్మములుండెను. వాటిగుండా నుండు మార్గ మెదురుగా నుండుటకుబదులుగా గోడలోపల నొక ప్రక్కనుండి కొంతమేరదాకా వెళ్లి యక్కడినుండి మోచేతి వంపుగ మళ్లి కోటలోనికినున్నది. ఏమాత్రమైన శత్రుభయము కలుగగానే మార్గమంతయు కొట్టిన చెట్లువేసి మూసివేసి ద్వారముఖమందు ముళ్లకంచలు, కొమ్మలు, మొదలైనవి వేసి కొంతదూరమువరకు కప్పివేయుచుండిరి. బురుజులపైని, పిట్టగోడపైని, రాటలుపాతి వానిమీాద దిట్టముగా పాకలు

వే సరుకువారు వానిపంచలు, పైన చెప్పిన సందులు, గుండ్రరంధ్ర ములు మొదలయిన వానిపై నుండి వ్యాపించియుండెదును. గోడను, పంచల, మధ్యనుండి యొకమనుష్యుడైన దూరివెళ్లు టకు సందుగానుండ నుండెదును. బురుజులకు, వానిమీద ను సిపాయిలకు ఎండవలనను, వర్షమువలనను, నిబ్బందులు కలుగకుండ నుండుటకొరకు పాకలువేసి యుంచుచుండెదు వారు. కోటచుట్టును 500 గజములకు పైగా విస్తీర్ణముగల భూమి వెలుపల బయలుగా నుంచఁబడియుండెను. ఆ బయ లుకు చుట్టును 4, 5 మైళ్లవరకు సాంద్రమైన యడవియుండెను. సామాన్యము కోటలకు నడవిలోనుండి యొక్కటికన్న యెక్కువ మార్గములుండుట యాచారములేదు. ఆ మార్గ ముఖమందు కోటనుండుగోడవంటి సన్నపయున్న, ఆకృతియుగల యొక గోడయు, నా గోడకు రెండుకొనలను గుండ్రటి బురుజులును, మధ్యభాగమునందు ముందుకు చతురస్రముగాఁ గట్టఁబడియున్న గోడల సహితమైన ద్వారములు నుండెడివి. ఇట్టి కట్టడములు నడవియొక్క కొనభాగమందు కట్టుట యాచారములేదు. అడవిమధ్యను ప్రత్యేకము వెల్లడిగా నుండునట్లు చెట్లు మొద లగువానిని కొట్టి బయలుచేసి యట్టబయలులో నట్టికట్టడము లను కట్టుటయును, ఆ సమీపమునకు శత్రువులు రాకుండ చేయుటకొరకు మట్టితో నొక్కుపాదవున గోడలైన, లేక కంచ యైన కట్టుటయు నాచారమై యుండెను. ఆ మార్గము సరిగా మున్నను మనుష్యులుమాత్రము నడచుటకుఁ దగిన వెడల్పు

గాను, సర్పగమనమువలె సర్వత్ర వంపులుగలదిగాను, నడవిలో మధ్యమధ్య గొప్పపొడవుగల దిమ్మలతోను, పైని చెప్పిన ద్వారముఖమందునువలెనే కోటదండెవంటి పెద్దగోడలతోను, వాని యుభయపార్శ్వములయందుండెడు బురుజులతోను, కూడుకొన్నదిగా నుండెడిని. బొబ్బిలివారి బందుబస్తు లీప్రకార ముండెడివి. 250 గుఱ్ఱపుసేన సహితమైన జన 750 యూరోపియనులను, నాలుగు యుద్ధపు ఫిరంగులను, విజయరామరాజుగారియొక్క ఆయన స్వాయముగా నడపించుచున్న జన 11,000 బంట్రోతులు, శిఫాయిలుతోఁ గలిసియున్న సేనను తోడ్కొని మె॥ బుస్సీగారు బొబ్బిలికోట మీదికి వెళ్లిరి. "అరణ్యమార్గ ముఖమందున్న మొదటి యుద్ధగోడమీఁద తెంపులేకుండ ఫిరంగులు కాల్పఁబడుచుండఁగా దానిప్రక్కలను, నడవిని చెట్టుకత్తులతో నరుకుచు నిప్పుపెట్టి తగలఁబెట్టుచు నా గోడవెనుకను బయిలులోనికి సైనికులు ప్రవేశించి బురుజుల వెనుకకు వెళ్లెడు సరికి నక్కడ నున్న కాపర్లు తటస్థమయిన యుపద్రవమును తెలిసికొని తమ స్థానమువదిలి యచ్చటికి వెనుకనున్న కాపరులయొద్దకి పారిపోయిరి. అయిదుమైళ్ల పొడవుగల యీ మార్గ మధ్యమందున్న తక్కిన యుద్ధగోడలు మొదలైనవానిపైనికూడ, పైన చెప్పినప్రకారము ఫిరంగులు కాల్చి వానిని పడఁగొట్టుచు, నడవిని కత్తులవలన, నగ్నివలన, నాశము నొందించుచు నీ వరుసగా బుస్సీగారు కోటసమీపమునకు వచ్చిరి. కోట కనుపించ

గానే బుస్సీగారు తనసేనను నాలుగుభాగములుగా విభజించి యొక్కొక్కభాగమువా రొక్కొక్క ఫిరంగును తీసికొని యొక్కొక్క బురుజును మోహరించుటకు నియమించెను. రంగారావుగారు సకుటుంబ సపరివారముగా నా కోటలో నుండెను. అందులో జన * 250 ఆయుధహస్తులును, నంత రెండింతలు స్త్రీలు, శిశువులును నుండిరి.

జనవరి తే 24 దీని నరుణోదయకాలమందు నాలుగు బురుజులవైపున నాలుగు ఫిరంగులను సిద్ధపరచి మోహరము ప్రారంభించిరి. బురుజులపైనున్న జనము వానిపైనున్న పాకలకు నగ్నిభయము కలుగునని యోచించి పాకలను దిగువకు లాగివేసిరి. అస్తమదిఘంటలవేళకు చాలామట్టుకు బురుజులపైనున్న గోడలు శిథిలము నొందింపఁబడెను. అంతట సేనయొక్క నాలుగుభాగములలోనున్న ముఖ్యులున్ను, తాడునిచ్చెనలువేసికొని వెంటనే మీఁదికి వెళ్లసాగిరి. ఒకఘంటవరకు విశేష యుద్ధముచేసియు నొక మనుష్యుఁడైన బురుజుమీఁదికి వెళ్లఁజాలక పోయెను. గాయములనొంది చాలామంది క్రిందికి పడిపోయిరి. మిక్కినవారును నేమియు చేయఁజాలక క్రిందికి వెళ్లిపోయినప్పిరి. అంతకుమీఁద నలసిపోవుట సంభవించినందున కొంత

* ఈ సంఖ్య మాత్రము సరియైనది కాదు. ఇతరచరిత్రలలో 4,000 పదాతిన్ని, 1,000 [illegible] వారున్ను నుండినటులఁ జెప్పఁబడియున్నది. మరియు [illegible] చేత ముట్టడింపఁబడిన కోటను ప్రాతఃకాలము మొదలు సాయంకాలమువరకును, 250 మంది సైన్యముతో కోటలోనుండి యుద్ధముచేసి పోరాటకసాధ్యమై యున్నటుల స్పష్టమగుచున్నయది.

సేపు విశ్రమించుటకు నాజ్ఞాపింపఁబడిరి. అదివరకు పిట్టగోడలు చాలామట్టుకు పడగొట్టఁబడుటచేత నా సమయమందు ఫిరంగులు కాల్చి, తక్కినభాగములను పడద్రోయుటకు చాలా యొదుపుగా నుండెనుగాని యీవల ప్రమాదప్రయత్న మధికమైన కొలఁదియు నావల రక్షణప్రయత్నమును నధికమాయెను. తమపిల్లలను, తమగుహలను, కాపాడుకొనుచు భీకరముగానున్న యడవిమృగములవలె గోపాటోపముతో బురుజీలమీద నివసించియున్న బంటుమానాగల జనము యుద్ధము చేసెను. వారిలో ననేకమంది శత్రువులను, తృణీకరించుచు బురుజులపైని నిలిచి పైకెక్కివచ్చుచున్నవారిని పట్టుకొనుచు వారి నిచ్చెనలను నులిపివేయుచుండిరి. అట్లు చేయుటకు వీలు పడనప్పుడు మీఁది కెక్కివచ్చుచున్నవారిని బల్లెములతో బొడిచి వేయుచుండిరి. అయితే కేవలము నిరావరణదేశమున నున్నవారగుటచేత బురుజులపై కెక్కుచున్నవారి వెనుకనున్న సైనికులు గురిగా గాల్చిన తుపాకీ వేట్లవలన సులభముగా జంపఁబడిరి. హిందూదేశస్థులయందు నెన్నఁడు నిట్టి యత్యతిశయధీరత్వమును చూచియుండనందున యూరోపియను లాశ్చర్యపడి వారియొద్దికి వచ్చినయెడల రక్షించడమగునని విడవకుండ తెలియఁజేయుచుండిరి. గాని అట్లా తెలియఁజేయుచుండినప్పుడల్లా వారు యూరోపియనులను ధూషించుచు మరణేచ్ఛం దెలియఁజేయుచుండిరి. అపరాహ్ణకాలమందు రెండుఘంటలవరకు నొకమనుష్యుఁడైన బురుజుమీఁదికి వెళ్లలేకపోయెను.

అంతట తిరిగి కొంతసేపు మోహరము నిలిపివేసిరి. అప్పుడు రంగారావుగారు తన ముఖ్యజనులను పిలిచి కోటను సంరక్షించునాశ కనపడదనియు, యూరోపియనులయొక్క బలాత్కారమువలనను, నంతకన్న నవమానకరమైన విజయరామరాజుగారి యధికారమువలనను, వంచనగలుగకుండ దమ స్త్రీలను, శిశువులను, కాపాడుట యావశ్యకమనియు వారితోఁ జెప్పెను. కొంతమంది యందుకొరకు నిర్ణయింపఁబడినవారై ప్రతిమనుష్యుఁడుం జేతులో నొకదివిటీ, బల్లెము, బాకు పట్టుకొన్నవారై కోటమధ్యనున్న యిండ్లవద్దికి వెళ్లి తారు, గంధకము వేసి సిద్ధపర్చఁబడిన వరిగడ్డితో వానికి నగ్నిముట్టించి యగ్నితాపమునకు పొగకు నిలువలేక పైకి వెళ్లిపోయి వచ్చిన ప్రతిస్త్రీని, ప్రతిశిశువును, నిర్దయులై పొడిచివేసిరి. పాలు ద్రాగుచున్న శిశువులం దీసికొనివచ్చిన భార్యలనైన కనికరించక వారిభర్తలు చంపివేసిరి. ఈ భయంకరమైన నాశనమునకు కారణమైన క్రూరబుద్ధిం జూచి యదివరకుఁ బగదీర్చుకొనియెదమనియు నాగ్రహముం గనుపరచెదమనియు నెత్నించినవారి యుత్సాహము నిష్క్రాంతత నొందెను. ఈ ప్రకారము నననష్ట జరిగించుకొని యా యిండ్లు తగలబెట్టినమనుష్యులాగ్రహముచేత వెఱ్ఱెత్తినవాండ్లవలె కోటగోడలమీద తాము దేహత్యాగము నొందుటకై తిరిగి వచ్చిరి. ఆ నాలుగుభాగములలో నొక భాగమునకు సేనాధిపతిగానున్న మె. లా. దొరగారా యాగ్రహసహసవ్యాపారముం జూచుటలో గోటకాపలాజనము

ఛాలా తగ్గిపోయినసంగతిం దెలిసికొని తిరిగీ కోటను మోహరిం చుటకు వెళ్లెను. అనేక నిచ్చెనలు నిరర్థకములైనవి. కొంచెము మంది గ్రినేడియరు శిఫాయిలుమాత్రము బురుజుమీదికి వెళ్లి మరికొంతమంది తమవాండ్రువచ్చి కలిశెడుపర్యంతము నిలబడి యుండిరి. రంగారావుగారు కోట బురుజుయొక్క సంరక్షణ నిమిత్తము తొందరగా వెళ్లుచు తుపాకిగుండు తగిలి మృతి నొందెను. ఆయన పోవుటచేత నాయన స్నేహితులయొక్క తెగువు మరింత యెక్కువాయెను. ఆయనను చంపినందుకు పగతీర్చుకొందుమని యొకగుమికూడినవారై కోటయొక్క తక్కినభాగములను నిర్మనుష్యముగా విడిచిపెట్టిరి. ఫ్రెంచి సైనికులు వారివారి నిర్ణయభాగములయందు మోహరించిన వారై సంఖ్యలకొలంది నిరాంతకముగా బురుజుగోడలపైకి నెక్కివెళ్లిరి. అయినను బొబ్బిలి ఫౌజుబురుజును విడిచిపెట్టుట గాని, శరణుజొచ్చుటగాని జరిగించలేదు. వారిలోం బ్రతిమనుజుండును ప్రతికోటిబలములోంజేరిన యొక్కొక వైరితో మోహ రించుచునైన, నట్టివైరిమీది కత్తివెళ్లుచునైన నుండెను. క్రింద పడిపోయి మరణవేదనం బడుచున్నప్పుడు సహా ప్రాణముపోవు వరకును జేతులో నాయుధమును విడిచిపెట్టలేదు. ఈ ప్రకా రము మోహరము నాశనమొందినదనునప్పటికి నంతకంటె భయంకరమైనది. కోటదిగువను బ్రత్యక్షమాయెను. జయించి నామను సంతోషము పోయినది. అందరు మౌనముతోను, యాశ్చర్యముతోను, పశ్చాత్తాపముతోను నొకరినొకరు చూచు

కొనిరి. అత్యంతవ్యధచిత్తులు సహా తమకండ్లయెదుట జరిగిన మహాకష్టమైన నాశనముం దలంచుకొని కన్నీరు నిలుపలేక పోయిరి. ఇది యేమిటని చూచుచుండఁగా దూరముగా నున్న యొకసందులోనుండి యొకచిన్నవానిని చేయిపట్టుకొని యొకముసలివాఁడు తీసికొనివచ్చుచున్నట్టు గనుపడెను. ఆ ముసలివానిని శ్రద్ధతో గౌరవించి యక్కడనున్న జనులు మ. లా. దొరగారియొద్దకి తీసికొనిపోయిరి. ఇతఁడు రంగారావు గారి కుమారుఁడు. ఇతని తండ్రియొక్క యుద్దేశము కాక పోయినను వీనిని నేను కాపాడినానని యనుచు నా చిన్న వానిని మ. లా. దొరగారికి నతఁ డప్పగించెను. ఇందువలన నందరికిని మరియును యుత్సాహము కలిగెను. అనఁగా నీ చిన్న వాఁడు దక్కుటవలన తామందరు దురదృష్టవశముచేత జరిగిన ఘోరవిపత్తు కొంత తగ్గినదనుకొనిరి. ఆ ముసలివానిని, నా పిల్లవానిని తక్షణమే బుస్సీగారియొద్దకుఁ బంపించిరి. ఆయన కోటయొక్కస్థితి విని యాలోపలికి వెళ్లుటకు నిష్టములేక డేరాలో నుండిపోయెను. ఆయన కేవలము కరుణారసబద్ధుఁడైన [illegible]వలెను దయతో వారిని నాదరించి బొబ్బిలి తాలూకాలకు జమలుగా నిదానిలో తానీయఁదలఁచిన ఖండమునకు సదమాన్యముగా నేర్పఱచి యా చిన్నవానిపేర పట్టా తయారు చేయవలసినదని వెంటనే యాజ్ఞాపించెను. శత్రువులవలనఁ బ్రమాదము కలుగకుండ లష్కరులో వారిని సంరక్షించవలసినదనికూడ నాజ్ఞయిచ్చెను. ఆ రాత్రియు, పిమ్మట రెండు

రోజులును, గాయములు తగిలిన యనేకమందికి కావలసిన సంరక్షణ జేయుట మొదలగు పనులలో గతించినవి. అయితే మూడవరోజు యర్ధరాత్రివేళ విజయరామరాజుగారున్న ప్రదేశమునందు పుట్టిన గలిభివలన సేనలోని యావన్మందియు తొందర నొందిరి. రంగారావుగారి తాలూకు నలుగురు సైనికు లాయన పడుటచూచి యాకోటలో నెవరును వెళ్లని భాగమునందు దాగుని చాలా రాత్రియైనపైని మెల్లనగా గోటగోడలపై నుండి దిగజారి విజయరామరాజుగారి లష్కరులోనుండి యెవరికి ననుమానము పుట్టకుండ తెలుగు మాటలాడుకొనుచు సమీపమగు నడవులలోనికి వెళ్లిపోయిరి. లష్కరులో తొందర శాంతించువరకు రెండురోజు లచ్చటం బొంచుండి వాండ్రలో నిద్దరు మధ్యమధ్య మీరెవరని యడిగిన వారిని సంశయము పుట్టకుండ తమ సంభాషణవలన మోసపుచ్చుచు విజయరామరాజుగారి డేరావద్దకి వచ్చి వెనుకవైపున డేరాక్రిందినుండి పాకలోనికి వెళ్లుసరి కాయన యొక్కరు నిద్రించుచుండిరి. విజయరామరాజుగారు విశేష స్థూలదేహులగుటచేత సహాయము లేనిది లేచుట యీయనకు గష్టముగా నుండెను. ఆయిద్దరు మనుష్యులును నూపిరి సహితము బిగబట్టుకొని వెళ్లి యాయన హృదయభాగమందు దాక ముహూర్తమందు కత్తులతోం బొడిచిరి. ఆయన కేకవేయునప్పటికి నొక శిపాయి లోనికివచ్చెను. అతండు తుపాకీ కాల్చినాడుగాని గురితప్పిపోయినది. తత్క్షణమే యనేకమందికూడ లోనికివచ్చిరిగాని పొడిచినవాండ్రు నిర్లక్ష్య

ముగా నా దేహమువైపు చూపించి యదిగో చూడండి! మాక్కుఁ దృష్టమైనది అని బిగ్గరగాఁ జెప్పిరి. వారు వెంటనే వాండ్రను తుపాకులువేసి చంపి ముక్కలుగాఁ దెగఁగొట్టిరి. అయితే వాండ్రు విజయరామరాజుగారిని ముప్పదిరెండు స్థలములను పొడిచిరి. వీండ్రిద్దరివలన నీ పనికానిపక్షమందు నడవిలో మసలియున్న యిద్దరు నీపనిచేసి యీ యత్నములోఁ దాము మృతినొందుటకుఁ బ్రమాణము చేసికొనియుండిరి."

విజయరామరాజుగారినిఁ బొడిచి చంపిన యిద్దరిలో నొకరు రాజాముకోటకు సంరక్షకుఁడగు తాండ్ర పాపయ్య యను రంగారావుగారి సరదారుఁడు. ఈయన బొబ్బిలికోట కొట్టఁబడెనని విని యీ పనిచేసినవారిపయిఁ బగఁదీర్చికొందునని ప్రమాణముజేసి మరి ముగ్వురితో బొబ్బిలికి త్వరగాఁ బోయెను. రంగారావుగారి సోదరులగు వెంగలరావుగారికోటను సంరక్షించుటకుగా నుత్కృష్టమైన పనిచేసి తమయన్నగారు పడిన తరువాత నత్యధికమగు శౌర్యపరాక్రమముతో యుద్ధముజేసిరి.

ఈ యుద్ధములో బల్లెమును ధరించిన యీ వెంగలరావుగారు అశ్వారూఢుఁడై కత్తినిఁ బట్టుకొనిన నిజాము సైన్యపు సర్దారు నొకనిని ద్వంద్వయుద్ధమునకుఁ బిలిచి వానిం బొలియించిరని చెప్పఁబడియున్నది. విరోధిసేనలు రెండును కొంత దూరమున నిలిచి వీరి ద్వంద్వయుద్ధము నాతురతతో గనిపెట్టెను. వెంగలరావుగారు శిరస్సున బలముగ గాయపరుపఁబడి యీ గాయపు వేదనచేఁ దెలివితప్పి యుద్ధము ముగియువరకుఁ గోట

లోఁ బడియుండిరి. పిమ్మట దమ యన్నగారి కుమారునితోఁ గూడ రాజాముజేరి 1765-వ సంవత్సరమున దాను మృతి నొందువరకుఁ బూసపాటివారి యధికారమునకు దృఢవిరోధిగ నుండిరి. రంగారాయచరిత్రయందును, నిప్పటికిం దెనుఁగు దేశముయొక్క ప్రతిభాగమందుఁ బాడఁబడుచుండు బొబ్బిలి పాటయందును, బొబ్బిలి యుద్ధములోఁ గనఁబఱుపఁబడిన పరాక్రమ మెక్కువగ స్తుతింపఁబడియున్నది.

---

బొబ్బిలి యుద్ధవిషయము—(యథామాతృకము.)

(హదీఖతుల్ ఆలం అనుగ్రంథము.)

---

ఈ విషయముంగూర్చి హదీఖతుల్ ఆలం అనుగ్రంథ ములో గొన్ని వాక్యములు వివరింపఁబడియున్నవి. ఈ గ్రంథము పారసీభాషలో వ్రాయంబడినది. గ్రంథకర్తపేరు మీర్ అబ్దుల్ ఖాసిం అని ఇతనికి బిరుదునామము మీరాలం (ప్రపంచ ములో నధికుఁడని.) పై గ్రంథనామములోఁ జివరనున్న 'ఆలం' అనుశబ్దము, మీరాలం అనుదానిలోని చివరపదమే. ఈ గ్రంథములో దక్కను హైదరాబాదులోఁ బ్రభుత్వముచేసిన మహమ్మదీయ పాదుషాల చారిత్ర ముండును. గ్రంథకర్తయగు మీరాలం అనునతఁడు నిజాముల్లీఖాన్ బహద్దూర్, సికందర్‌జా బహాదర్ అనుపేరులుగల తండ్రికొడుకులు హైదరాబాదులో నబాబులుగా నుండఁగా వారికి ముఖ్యమంత్రి (దివాన్) గా

నుండెను. ఇంతియకాక దక్కను హైద్రాబాదు దేశములోని వాడై జగత్ప్రసిద్ధినందిన ముఖ్తారుల్ముల్కు అను బిరుదు నొందిన 'సర్ సాలార్ జంగు' అను నైజామువారి దివానువంశ మునకు మూలపురుషుఁడై యున్నాఁడు.

పై హదీఖతుల్ ఆలం అను గ్రంథము సన్న 1214 హిజిరి (క్రీ. వె. 1796) లో రచియింపఁబడినది. పిమ్మట సన్న 1266 హిజిరి (క్రీ. వె. 1848 లో హైద్రాబాదుపట్టణములో నుండు సిరాజుల్ముల్కు బహదరువారి యచ్చుకూటములో లెతో గ్రాఫుగా నచ్చువేయఁబడినది. ఈ సిరాజుల్ముల్కు బహదరు సర్ సాలార్ జంగునకు పినతండ్రి.

పై గ్రంథములో నేమి యున్నదనఁగా:—

"సన్న 1165 హిజిరి (క్రీ.వె. 1751) సంవత్సరములో జరిగిన వృత్తాంతములు వ్రాయుచు 231-వ పుటలో 3, 4, 5 పఙ్క్తులలో (ఫ్రాంచివారితరఫు) నవాబగు మూసాబూసీయొక్క వృత్తాంత మును నుడువుచు "విజయరామరాజునకు" 700 (యేడువందల) వెలమల కాల్బలముగల వెలమవంశస్థుఁడగు రంగారావు జమీన్దారునకు కొన్నియుద్ధములు జరిగినవి. అనంతరము రంగారావుజమీన్దారుతో యుద్ధముచేయుటకుగాను విజయ రామరాజు మూసాబూసీని వెంటబెట్టుకొనిపోయి రంగారావుతో యుద్ధముచేసి అతనివంశమువారినందరిని నరికివేసెను." అని పై వృత్తాంతము ముగించుటకు బూర్వము పై పుటలోనే 8, 9 పఙ్క్తులలో నీ క్రిందివిధముగా వ్రాసెను. ఎట్లన్నను:—

వెలమలలో శూరులగు సేనాగ్రరును యుద్ధసమయ ములో రాజుయొక్కయును, ఫరంగీయొక్కయును సేనలను క్రిందుమీదు జేసి, అనేకులను జంపి యా యుద్ధములో దాముసు హతులైరి." అని.

---

బొబ్బిలితో విజయనగరము విరోధించుటకుఁ గారణము.

---

ఈ విషయమై లోకల్ రికార్డ్సు నాల్గవ వాల్యూములో పూసపాటివారి పూర్వోత్తరములో వివరింపఁబడినవిధముగాఁ గొన్ని సంగతులు యథామాత్రృకగ వ్రాయవలసియున్నవి. ఎట్లనఁగా:—

"ఈ రాజుకుఁ బ్రియనందనుఁడైన పెద్ద ఆనందరాజు గారు రాజ్యభారము వహించిరి. రాజ్యము చేయుచున్నప్పుడు యింతకుమునుపు సంస్థానాలు యావత్తు నారాయణపట్టం సింహాసనస్థులైన విక్రమదేవువారికి పేష్కస్తు యిస్తూవుండేవారు. ఇటుతర్వాత నా సంస్థానం బలహీనంక్రింద వచ్చినందున యీ మన్యపు పాలేగారులు ప్రబలి యెవరి అంతట వారు మొవాసులై విక్రమదేవువారిని లక్ష్యపెట్టి పేష్కస్తు యివ్వక వుడాయించి స్వతంత్రులై అనుభవిస్తూన్నారు. గనుక అప్పుడు ఆనందరాజుగారు యీ మన్యాలు దరోబస్తు తమజేసుదస్తులోనికిఁ దెచ్చుకోవలెనని ఆలోచన పుట్టి అంతట హైదరాబాదుకు జమాబందీకిఁ బోయివుండఁగా హాకీంవారిని సదరహీ వ్రాసిన మన్యాలు యావత్తు మా స్వాధీనం చేయించి పరమానా

దయచేయించమని అడిగినారు. గనుక అప్పుడు పాదుషావార్లు యీ మన్యాలు మీకు వ్రాసియిచ్చినందున మాకు యేమి ఫాయతు అని అడిగితే యీ మన్యాలు యావత్తు కళింగ సర్కారు క్రింద పలుకుతూవుంటే యిదే ప్రతిష్ఠ. ఇదిగాక యీ మన్యాలు మా జేబుదస్తులో వచ్చినవెనుక మీకు నజరు గుజరాలు యిస్తూవున్నానని అర్జు చేసుకొనేవరకు ఆ మాటలను సమ్మతించి యితను ఆలోచనయోగ్యుడనిన్ని, పరాక్రమవంతుడనిన్ని, సర్కారుపట్ల ప్రమాణీకుడనిన్ని విచారించి రాజా [illegible] ఆనందరాజు మన్నె సుల్తాన్ బహదర్ అనే కితాబు దయచేసి మన్యాలను యావత్తుకు సన్నదు వ్రాయించి యిప్పించి [illegible]పూర్వకముగా సెలవు యిచ్చినారు. గనుక హాకీం వారి [illegible] ప్రకారం తిరుగా దేశములోనికి వచ్చి సకలసన్నాహములతో [illegible] కట్టు అయిన కుమతె ప్రవేసించి విస్తారం [illegible] యుద్ధసన్నద్ధులై బయలుదేరి మన్యాలుమీద మోహరా చేసి దర్జను పాలెగాండ్లను జయించి వారి జేబుదస్తులో తెచ్చుకొని పేష్కస్తు తీసుకుంటూ వచ్చినారు.

ఆ యుద్ధమందు రాజువారి బలం బహు హతమైనది. [illegible] రాజు కొన్ని దినములు రాజ్య[illegible] కాలను వేంచేసి యింద్రసాన్నిధ్యమునందు [illegible] తరువాత ఆయన కొమాళ్లయిన విజయరామరాజు [illegible] నారాయణపట్నంమీదికి దండెత్తిపోవలెనని యుద్ధసన్నద్ధులై ముందర తమతాలూకు సరదార్లు సాగి

న్నారాయణరాజు వగైరాలకు సైన్యసమేతంగా సెలవు యిచ్చి నారు. వారు నారాయణపట్నం వెళ్లేటానకు బొబ్బిలిదేశం మీదుగా మార్గం గనుక బొబ్బిలివారికి, పూసపాటివారికి బద్ధశత్రుత్వమయినందున రాజువారి ఫౌజు మాదేశంగోగుండా రానిచ్చేమా అని బొబ్బిలివారు సైన్యయుక్తముగా వచ్చి అడ్డం తగిలి పోసీయక కొట్టినారు. అప్పుడు బొబ్బిలివారి బాహాటో పానికి యెదిరించలేక విజయరామరాజు మేము మార్గంపట్టుక పోతూవుంటే మీరు నిమిత్యంలేనిది యీ సమయన మాకు అడ్డంతగిలి రాకుండా కొట్టినారుగదా మంచిది. నా శరీరంలో జీవంవుంటే, యెన్నటికైనా మీ సంస్థానం పుచ్చుకోకపొయ్యే నా అని పుచ్చుకోకపోతే విజయరామరాజుకాడని శపథాలు పలికినారు. ఆ మాటలు వారు విని మీ తండ్రిగారు ప్రతిజ్ఞలు చేసి యేమాత్రం జయించినారో మీరు అంతమాత్రం జయించి వేస్తారు. ఇదిగాక మీరు మా మీదిన వచ్చే పనానకు అంత్య కాలానకుగాని రారు. మీ తండ్రిగారున్ను తీరా అంత్యకాలా నకు మా సంస్థానంమీదికి వచ్చి మరల బ్రతికినవారుకారు. అటువలెనే మీరున్ను కాలప్రమాణం అయినా మా సంస్థా నంమీదికి వస్తారు. పొమ్మనమని ఖబురుపంపించినారు. వారికి వీరికి విరోధము పుట్టడానికి అదే ఆరంభం."

విజయనగరము కోటకట్టి యందులోం బ్రవేశించిన యీ విజయరామమహారాజుచరిత్రము వ్రాయుచు "ఈ తీరున సకల సంతోషములతోనున్ను, విజయనగరము కోటలోనుండి

రాజ్యము చేయుచుండి కొన్ని దినములకు బొబ్బిలివారిగడీమీాదికి లడాయికి పోవలయునని తమ సైన్యం యావత్తు తయారుచేసుకొని [illegible] పాలెగాండ్లనున్ను వారివారి రాణువతో కాస్సి తలబుచేసి పిలిపించి బందోబస్తు ఫౌజును తీసుకొని ఫిరంగులు మొదలైనవి అన్ని తయారుచేసికొని సకల సంతనలతో నున్ను, బొబ్బిలివారిపై పోయేవరకు వారున్ను, భుజపరాక్రమముగలవారున్ను, గొప్పసాహసులనుపించుకొన్నవారు. గనుక తమ సరదారులతో సైన్యయుక్తముగా వచ్చి రాజుగారితో లడాయిం చేసిన్నివరకు యుభయులున్ను ఘోరయుద్ధము చేసి బొబ్బిలివారి ధాటికి విజయరామరాజుగారు నిలువలేక పరారీ యైపోయినందున వారి వెంటనే తగిలి కుమెలకోటవరకు పొడిచినారని అని యుమకిలో నున్నది.

ఈ గ్రంథములోనే మరియొకస్థలములో బొబ్బిలివారిని జయించుటకు విజయరామరాజుగారు చేసిన ప్రయత్నములంగూర్చి ఆ ప్రయత్నములవివరము యున్నది. అది యెట్లన్నను:—

"ఈ పైకొన్న శత్రువులను జయం చేస్తూ బొబ్బిలివారిని గెలిచినగాని సాధింపవలయుననే తాత్పర్యముచేతను తమ జమాను పరగణాలలో బెలగాం అనే గ్రామంలో కోట పెట్టించినారు. అక్కడనుంచి బొబ్బిలిప్రజలను విచారించుటకు యత్నిస్తిరి. ఈ బెలగాంను బొబ్బిలికి రెండామడదూరం రమారమి యుంటుంది. ఈ బెలగాం నారాయణపట్టణం బొబ్బిలిసందున నున్నది. నారాయణపట్టణానికి అయిదు ఆమడ. అక్కడి

నుంచి నారాయణపట్టణం పలికించుకున్నారు. ఆ మీదట తిరుగ సరంజాం చేసుకొని బొబ్బిలిమీద పోయి లడాయి అయిన వెనుక బహుమంది ప్రజలు పోవడమున్ను, గాయములు తగలడమున్ను, ఈ చొప్పున రాజు వారి ఫౌజు పరాస్తు అయినది. ఆ సమయము చూచి రాజుపని మించయితుబాకీలో నున్నది కాదని కాశీపతి రాజుగారు పేష్కస్తు స్రుడాయించినారు. ఈ మాటలు విజయ నగరంలోవుండే వుద్యోగస్థులు రాజుగారు బెలగాం కోటలో వుండఁగా యీ స్థితి వ్రాయించి పంపించేవరకు అక్కడినుండి విజయనగరం వచ్చిరి."

మఱియొకస్థలములో " అంతట విజయరామరాజుగారు వారిని (కాశీపతి రాజుగారిని) యింతటినుంచి సర్కారు వల్ల భయము కలిగివుండమని సెలవిచ్చినారు. ఈలీసున నుండఁగా నారాయణపట్నంవారికి బొబ్బిలివారు బోధచేసినసంగతి—మీరు పూసపాటివారికి జమాబంది యెందుకు యిస్తారు. వారు మీ మీదికి యుద్ధానకు వచ్చినప్పుడు కనుపించుకున్నాముకాము గనుకనా యిప్పుడున్ను మీరు ఘుడియవద్దు. ఇంతకు పూస పాటి విజయరాముఁడు నీమీద దండుయెత్తితే మాకున్ను సమా చారము తెలియనే తెలుస్తున్నది. మా దేశంమీదనుంచి ం వలెను. కాఁబట్టి అప్పుడు మీకు మేము మద్దత్తువస్తున్నాము. అని వారికి మద్దత్తుయెత్తు యిచ్చి బోధపరచి రాజుగారికి పలక కుండా చేసినాఁడు. ఈ సమాచారంయావత్తు రాజుగారికి ఫౌజు దారుఁడు బెలగాంకోటలో వుండి విని తమఖానందు విజయ

నగరము కోటలో వుండఁగా వ్రాయించి పంపించేవరకు రాజుగారు విని బహుకోపం తెచ్చుకొని ఫౌజుయావత్తు కూర్చుకొని బొబ్బిలిమీద దిగినట్టుగా దిగి లడాయి చేస్తూవుండి అక్కడి సమాచారం నారాయణపట్నంవారికి తెలియకుండా చేసి నారాయణపట్నంమీదికిన్ని కొంత లష్కరు పంపించి, నారాయణపట్నంసమాచారము బొబ్బిలివారికి తెలియకుండా చేసి నారాయణపట్నంమీద తమ పరాక్రమంయావత్తు అగుపరిచినారు. గనుక రాజుగారి రాణువ యుద్ధమువల్లనేమి, బహు చలిజ్వరాలవల్లనేమి అనేకమంది పరలోకానికిపోయిరి.”

“ఈ నారాయణపట్నము వచ్చేవరకు రాజుగారి (విజయరామరాజుగారి) దగ్గర నలభై వేల ఫౌజు వున్నది. గనుక చలము సాధించవలెనన్న కార్పణ్యము విచారించిరే కాని యెంత ఫౌజు చచ్చినా ఫికిరువా లేదనుకున్నారు. ఈ నారాయణపట్నంలోని నీళ్లవంటి విషపునీళ్లు ప్రపంచములో యెక్కడా లేదు. ఆ సమయమందు బొబ్బిలినారాయణపట్నం సందున రాజుగారిసైన్యము నాలుగువేలు హతమయినది. నారాయణపట్నమువారి సైన్యమున్ను ఆలాగుననే విచ్ఛేదమయినది. గనుక దుర్బలులైన మనము [illegible] రాజవారితోటి విహితంగానుండి సుఖముగా నుండుకొంటిమి. బొబ్బిలివారిమాటలు విని యింత మోసపోతిమి. ప్రజలు యావత్తు చచ్చిపోయిరి. ఇంకను మనబ్రతుకేమియున్నది. ఇంతటికిన్ని బలవంతుడితోటి విరోధము చేసి నెగ్గవలెనంటె పులినిచూచి నక్క వాత పెట్టుకోవలెననే

సామెతగానే క్రియలేదు. అని అక్కడినుంచి వారు విజయ రామరాజుగారివద్దికి తమ వకీలును పంపించినారు. సమాధానము చేసుకొని రమ్మనినారు గనుక అతనువచ్చి అన్న మాటలు—'మా తాలూకు ఫౌజున్ను విస్తారము హతమయినది. మీ రాణువయున్ను చాలా హతమయినది. తమకు దయచేసి సెలవు యివ్వవలెను.' అంటే రాజుగారు సెలవిచ్చినారు. 'మాటలు యేమంటే యింక పదివేలు లయమైనాగాని మాకు ఫర్వాలేదు. చలము సాధించడము మాకు సామ్రాజ్యము మాకు చేకూడుట.' అని రాజుగారు పలికేవరకు వకీలు మనవిచేసికొనిన సంగతులు 'మాకు గ్రహచారము చాలనందుచేతను రంగారావుమాటలు విన్నాము. గనుక మాకు యింత అనుభవము అయినది. గనుక మా తక్సీరు మాపుచేసి మమ్మును బాగుచెయ్యవలెను.' అని అనేవరకు ఆ మాటలు రాజుగారు విని 'మీరు మాకు యెక్కువ కట్నం కానికెలు యివ్వవద్దు. మేము విజయనగరం తర్లివచ్చిన నాటనుండిన్ని నేటివరకు అయిన దండుఖర్చులు ముజరా యిప్పిస్తే తాలూకా మీ ఆధీనము చేయుచున్నాము. యీ సలహా మీకు సమ్మతి లేకపోయినా మాకు యెంతశక్తివుంటే అంత యుద్ధము చేయడమున్ను మాకు మంచిది.' అని వుత్తరము చెప్పినారు గనుక తిరిగి వకీలు మనవిచేసికొన్నది. 'మీరు దండుఖర్చులు ముజరా యివ్వమని సెలవుయిచ్చినారు. ఈప్రకారము యిచ్చేవరకు మాకు సంస్థానము ఆశలేనేలేదు. మా తాలూకా యింత

మాత్రము గనుక మా అహవాల్ తెలిసివుండిన్ని యీ ప్రకా
రము చేస్తిస్తే మేము యేలాగున భరించపోతాము. అది
యునుగాక విజాపు సంస్థానము మామీదమాత్రమే కాదు.
బొబ్బిలివారిమీద ప్రతిసంవత్సరము మీరు దండెత్తుచునే
యున్నారు. మా గ్రహచారదోషమువల్లను బొబ్బిలివారి
మాటలు వినబట్టి యింత యోగం పోసగిందీ.' కాబట్టి యీ
తప్పు క్షమించుమనిన్ని మాకు శక్తిలేదుకాని జీతాలు మినహా
యిత్తామనిన్ని యిస్తాము' అని నిండా మనవిచేసుకొనే
సరికి రాజుగారు సమ్మతించి దొరలను పిలుపించి లెఖలు చూపించి
అందరి దస్కతులుచేసికొని కౌలు యిప్పించినారు. ముందు జరుగ
వలసిన సంవత్సరములకు జమాబంది నిర్ణయించుకొని వారికి
సెలవు యిప్పించినారు.

అనంతరం బొబ్బిలి రంగారావుగారిమీదికి లష్కరు
పోవడానికి తయారుచేసి సేనాపతుల నందరిని రమ్మని తలబు
రాయుడు దేశస్థులున్న వాళ్లు యీ తూరి వెలమలు అంతా
ఆయుధాలు పట్టుకొని యేకస్తులై యున్నారు. మనము వారితో
యుద్ధంచేసి జయించలేము.' అని అన్నారు. అందుకు రాజు
గారు బహుల కోపంచేస్తే అప్పుడు బుర్రా బుచ్చన్నగారు
దివాను హైదరుజంగు విని శాంతపరిచి చెప్పిన ఆలోచన
యేమంటే యీ తూరి మీరు లడాయికి పోవడము మోఖాబు
చేసి మీకు ప్రతిగా పూసపాటి రామచంద్రరాజుగారిని
అంబారీలో కూర్చుండబెట్టి సకల సంతనలతోటి సైన్యం

పంపించడము వుత్తమమని మనవిచేసేవరకు ఆ మాటలకు రాజుగారు సమ్మతించి ఆ ప్రకారముగానే బొబ్బిలిమీదికి పంపించేవరకు అక్కడ రాజా బొబ్బిలి రంగారావుగారి తాలూకు సరదారులందరు అభిమానించుకొని అట్టహాసముతోను మేలైన మన్య దొరలు యుద్ధసన్నద్ధులై వచ్చి మన ప్రాణాలుపోతే పీడా పోయెను. నేటి దినం యేలాగైనా విజయరామరాజును పొడిచి పారవెయ్యవలెను. యితనితోటిగాని మన సంస్థాన పీడ వదలదని ఆలోచన చేసి మేలైన సరదార్లు నంతా మొక్కమొనచేసుకొని వచ్చి రాజువారి సైన్యంమీద పడి అంబారీచుట్టూనున్న ఫౌజును యావత్తు చంపి, అంబారీలో వాడు విజయరామరాజుగా తలచి యీటెలువేసి గుబ్బ కిందికి దింపేవరకు అంతట రామచంద్రరాజుగా నగుపడువరకు అంతట వెలమవారు విజయరామరాజా అని యింత బొహాటోపముచేసి హంవీరులైన సరదారులను గోలుపోయితివి అని యింత ప్రయత్నమున్ను నిష్ఫలమైపోయెను. అని దుఃఖించి రామచంద్రరాజు తలకాయవుప్పుకు పంగనామాలుపెట్టి సాయంకాలానకు విజయనగరం పంపించేవరకు అప్పుడు ఆయన క్షమాళ్లుచూచి బహు దుఃఖపడేవరకు విజయరామరాజుగారు వారికి దుఃఖోపశమనముచేసి పోయినవాడే విజయరామరాజు అనిన్ని వున్నవాడే రామచంద్రరాజు అనిన్ని ఖిలాసాగావుండుమని తమ జాగీరులో 'రేగులవలస' అనే పరగణా, జమీదారీ వ్రాయించి యిచ్చి కోట పెట్టించి యిచ్చినారు."

గనుక పూజేవారు బహు సంతోషించి వుండేటప్పుడు బొబ్బిలి మాటలు యోచిస్తూ మనివిచేసి దుభాషి లక్ష్మన్నకు లక్ష రూపాయిలు కట్టణం యిచ్చి తమ మాటలు యోచిస్తు ఖాము దుకు బోధపరచి తనమాట కరారుగా జరిపేటట్టుగా స్ప్రశ పరచుకొని అక్కడనుంచి ఫ్రాంసువారిని యెవరికి తెలియ కుండా బొబ్బిలిమీదికి తెల్లవారేటప్పటికి తీసుకువచ్చి ముట్టిగ ఘోయించినారు. అంతట తెల్లవారిన తరువాత బొబ్బిలివారు లేచినూచేవరకు జాతులవారి ఫౌజు బండి ఫిరంగులు యెన్ఖై వేలకు చుట్టూ దిగివుండేటప్పటికి వారు అనుకొన్నమాటలు ఈ మద్దతున ఫ్రాసపాటివార్ని బూసీవారిని కూడా కలుసుకొని సంధి చేసుకుంటేగాని అనుకూలం గాదని ఆలోచన చేసుకొని రంగారావువారు తమ తాలూకువారిని సమాధానానికి పంపించినారు. గనుక అక్కడినుంచి యవతలికివచ్చి మాట్లాడే వరకు గుణం లేకపోయె. గనుక అక్కడనుంచి యవతలికి వచ్చి బూసాబూశివారిని నీవు రాజుచేత లంచం తిని లంచగొండె మాటలు వాడినంతలో వీరిని భగవంతుడు బాగుచెయ్యడని చెప్పి తమ కోట దగ్గరకు వచ్చేపరియంతరం వెయ్యింటికి బారును పొడిచి రంగారాయనివారివద్దకి వచ్చి అంతటి రాయని వారితో యిక బొబ్బిలి ఆశనున్ను ప్రాణాల ఆశనున్ను లేదు. ముందరి జాగ్రత విచారించుకోవడం బహు ఉత్తమ కార్యం. ఈ మద్దతున ప్రాణాలకు ఆశపడితే బహు అపకీర్తి రాగలదు. అన్యచింతలు మాని యుద్ధసన్నద్ధులమై శత్రుబలంమీద నడచి

శౌర్యం ప్రకాశమానం చాయడంకన్న వేరే ఆలోచన లేదని మనివిచేసేవరకు రంగారాయలంగారు చిత్తగించి సర్వనిశ్చయం చేసుకొని తమ యింటి రాణివాసస్త్రీలను యావత్తుమందు కొట్లలో వేసి చిచ్చు ముట్టించుమని శెలవుయిచ్చి తన సర్దార్లను చూచి మీమీ ఆయుధంబులతోటి సన్నద్ధులై రమ్మని ఆజ్ఞాపించి తమకు ప్రయత్నపడుచూ వుండగా యింతలో రంగారావు వారిభార్య పతివ్రతాశిరోమణియైన మల్లమ్మగారు విజయరామ రాజుగారికి అన్నా యిదివరదాకా నేను పూసపాటివారియిల్లు నాకు పుట్టిల్లు అనుకొనివున్నాను. ఈ యిప్పట్టున నా పసుపు కుంకుమ నిలుపుమని సమాచారము పంపిస్తే అందుకు విజయ రామరాజు నీవు నాకు సహోదరివి సరేవే మాకు భావ మరదులకు యిద్దరికి విరోధము వచ్చినది గనుక నన్ను అతడు అతణ్ని నేను జయించవలెనని అన్యోన్య జయకాం క్షలచేత నున్నవారము. కాబట్టి యీ సమయమందు రంగా రావువారిని నేను జయించి హతపరిస్తినా నీకు ముండగ్రాసా నకు మూడుగ్రామాదులు యిప్పిస్తాను. ఇవతలికి వచ్చి వుండుమని తిరిగి మల్లమ్మగారికి వర్తమానము పంపించె. గనుక ఆ నిష్టురాపమానపుమాటలు విని చాలా దుఃఖపడి పాపాత్మా యీ తీరున శిశుబాలవృద్ధులతో వున్న మమ్మున హతంచాయవలెనని క్రూరకృత్యానికి వొప్పివున్నవాడవు. గనుక నీవు యుద్ధభూమి యందు మృతుడవైతే నీ పెండ్లాము ముండగ్రాసంతింటుంది గాని మేము పుత్రమిత్రకళత్రాములతో వీరస్వర్గానకు వేంచేస్తా

యున్నాము. నాకు ఒకనాటికి ముండ్రగాసము లేదు. అని బహు మానవతి అయిన మల్లమ్మగారు యింటిలోనికిపోయి క్రొత్తగా పెండ్లయిన కొమార్తెలను, తోడికోడండ్లను మొదలైన రాణివాసస్త్రీలను గొంతులుకోసి చిచ్చుకు మనస్సు అయినవారిని చిచ్చున లయపొందించి యెవరెవరికి యెట్లా చావవలయునని నిశ్చయించినారో ఆ ప్రకారం స్త్రీలను అందరిని ఒకరైనా మిగలకుండా మృతిపరిపించి తదనంతరము తన కుమారుఁడు చిన్నవాఁడు వెంకటరంగారావు అని ఒక చిన్నవాఁడు వుండఁగా యితను అయినా వంశానకు బ్రతికివుంటే అంతే చాలును. అని పాపమ్మ అనే బ్రాహ్మణస్త్రీ వుండఁగా ఆ చిన్నబాలుని ఆమె వొళ్లోవేసి యీ శిశువును బ్రతికించమని చెప్పి తానున్ను చిచ్చుపెట్టుకున్నది. అంతట రంగారాయనిగారు మొదలయినవారు స్త్రీలు హతమయిన వర్తమానము విని సర్వసంగపరిత్యాగం చేసుకొని వెలమదొరలు యావత్తు వీరశౌర్యం ధరియించి తమతమ ఆయుధంబులు చైకొని లష్కరు మీదికిపోయి చేతులు పొక్కులు పొక్కెందాకా శత్రువులను పొడిచి రంగారాయనివారు అయిదువేల సైన్యముతోటి యెనభై వేల ఫౌజుమీదపడి చిత్రకౌశలంచేతను రామ రావణ యుద్ధానికి సరిగా యుద్ధంచేసి యిరవై వేలకు శత్రుసైన్యం లయం చేసినారు. పైనవ్రాసిన చిన్నవాణ్ని తీసుకొని బ్రాహ్మణస్త్రీ పోతూవుండఁగా మార్గంలో ఫారాచౌకీలదగ్గర అటకాయించి శిపాయీలు యీ చిన్నవాఁ డెవరు అని యడిగి పోనియ్యక

పొయ్యేవరకు అంతట ఆమె తనకుమారుఁడనేవరకు మొంగిలి తినమన్నందున ఆ చిన్నవాని చొంగ నాలికెను వ్రాసుకొని ప్రాణసంరక్షణం చాయడం యెక్కువ ధర్మమని విచారించి యీ ప్రకారం చేసినందున పారావాండ్లు ఆమె కొమారుఁడని నిశ్చయించి విడిచిపెట్టినారు గనుక రాతోరాతున నడిచి ప్రాణాలు తప్పించుకొని బయిట వచ్చినది.

ఈ చిన్నవాఁడు శానాదినములు బ్రతికినాఁడు. బాల్యమందు అయిదుసంవత్సరములవాఁడై ముప్పై అయిదు సంవత్సరములపర్యంతరమున్ను పెద్ద విజయరామరాజు ఆనందరాజుగారు గతించినవెనుక విజయరామరాజుగారి అమలులో వీరి అన్నగారైన సీతారామరాజుగారు ఖైదులో వుండినాఁడు గనుక పట్నాభందగ్గిర కుంపిణీవారి లడాయిలో పోయినరాజు బహు అభిప్రాయియుండు గనుక రంగారావు కుమారుఁడైన వెంకటరంగారావుయందు దయవచ్చి ఖైదులోనుంచి తీసివేయించి తమ సముఖానకు పిలుపించి బహుమానపూర్వకంగా పూర్వం వారి తాలూకాలో రాజాం పరగణాకుమాత్రం జమీదారీ వ్రాయించి యివ్వవలెనని ప్రయత్నముచేస్తే సీతారామరాజుగారికి సమాధానము కానందున యీ బొబ్బిలిస్థళం సాధించడానకు మన పెద్దలు విస్తారం అర్థవ్యయంచేసి లెక్కలేని ఫౌజుబందీ హాలెంచేసుకొని అనేకపరిసల సాధించలేక బహు ప్రయాసపడి దైవవశాత్తున సాధించినారు. కాఁబట్టి యీ ఆలోచన సర్వదేవా చాయవద్దు. అని బోధపరిచి తాలూకా యివ్వ

క్షుండా చేసినారు. గనుక అంతట అన్నగారిమాటలు అతిక్ర మించఁజాలక ఖయిదుమాత్రం వదలించి విజయనగరములో సంతపేటడాబాలో వుంచి వివాహము చేస్తామని చెప్పితే ఆ మాట వెంకట రంగారావుకు సమ్మతిగాక నాకు వివాహ మక్కర లేదు. మీకు సమ్మతి అయి శలవిస్తే మాయింటిదాసీ దానికూతురు వున్నది. దానిని పిలుపించుకుంటాను. అని అన్నందున ఆప్రకారమే చేసుకోమన్నారు. గనుక ఆ దాసీ కొమార్తెను పిలుపించుకొని దానితో సంయోగముగా వుండి మఱి కొన్నిదినములకు రహస్యకృత్యంగా తాను వున్నట్లుగా వుండి లంజెసానినిమాత్రం నివాసస్థలమందు వుంచి తాను పరారి అయినాఁడు. అంతట దాసీదిన్ని పదిదినములు వుండి పరారి అయిపోయి ఆ వెలమ కొమారుణ్ని కలుసుకొనేవరకు దానిని వెంటదీసికొని హైదరాబాదుకు వెళ్లిపోయినాఁడు. తదనంతరం రాజుగారి మనుష్యులకు తెలసి వీరువున్న స్థళంలో చూచి లేకపోయినందున విజయరామరాజుగారికి మనవిచేస్తే మేము నాడే శలవుయిచ్చినాము పోనియ్యమన్నారు. ఆ దినం సీతారామరాజుగారు శత్రుశేషం బ్రతికి తప్పించుకపోయెనని చాలా విచారపడుచున్నారు. ఆ మీఁదట వెంకట రంగారావు హైదరాబాదు పోయి నిజాంవారి దర్శనము చేసుకొని తమ హాఖీఖత్తు యీావత్తు తెలుపుడి చేసుకొని తిరిగి తమ జమీాదారీ తాలూకాకు కుంఫిణీవారిదగ్గిరకు ఫరవానా తెచ్చుకొనేవరకు యింతలో పూసపాటివారిపనులు నీరసంలో వచ్చె. గనుక

తమ తాలూకా యావత్తు కుంఫిణీవారు దయచేసినందున నాలుగుసంవత్సరములు వ్యవహారము చేసుకొని తిరిగి సంస్థానం వున్నదనిపించి కాలప్రమాణమయినందున పరలోకగతుఁడయినాఁడు. ఈ ప్రకారం పరాక్రమశాలులైన రావు రంగారావు వెంగలరావు మన్యదొరలు తమ అయిదువేల సైన్యముతోటి యిరవైవేలకు శత్రుసైన్యం హతంచేసి రణభూమియందు వారిని స్వర్గపదానకు వేంచేసినమీదట పెద్ద విజయరామరాజుగారు యావత్తు శత్రువులు హరించిపోయిరిగదా యని సంతోషము చేతను లడాయితీరిన మూడుదినములకు బొబ్బిలికోటలో డేరా వేయించుకొని సుఖంగా వుండఁగా రంగారాయని భావమరిది మల్లమ్మగారికి కేవలం సహోదరుఁడైన తాండ్రపాపయ్యగారు రాజాపుకోటలో వుండి యుద్ధప్రశంస విన్నవాఁడుకాఁడు. అటు తర్వాతను తమ బంధుజనులను యావత్తు విజయరామరాజు చంపించి కోటలో తాణ్యాం వేసుకొనియున్నాఁడని విని రోషశోక సందహ్యమానమానసుండై కొంతసేపు విచారించి రాజవధార్థము రాజాపుకోట బయలుదేరి యుక్తివలన చంపవలెనని వచ్చేటప్పుడు ఆనందరాజుగారివద్దనుంచి వచ్చినట్లుగా తెల్లకాకితాలు వుత్తరాలు మడిచి పైన విజయరామరాజుగారి బిరుదావళి వ్రాసి ఆ వుత్తరాలు చేత తీసుకొని ప్రచ్ఛన్నవేషం దాల్చి రాత్రియామున్న రప్రొద్దుకు బొబ్బిలి ప్రవేశించి మొక్కడెక్కడి చౌకీలదగ్గిర మేము ఆనందరాజుగారిదగ్గిరనుంచి యీ రాజుగారికి వుత్తరాలు తెచ్చినామని ఆ లిఖోటాలు చూపించి బహు

ప్రయత్నముచేతను రాజువుండే డేరాసమీపమునకు వచ్చేవరకు అక్కడ ఫారాదగ్గిర అటకాయించినంతలో మేము రాజా ఆనందరాజుదగ్గిరనుంచి పుత్తరాలు తీసుకవచ్చినాము. ఈ తక్షణ మివ్వవలెను. నిమెషం గనుక ఆలస్యమాయెనా ఆనంద రాజు మమ్మున తలలుగొట్టించివేస్తామని ఆజ్ఞాపించివున్నారు. కాబట్టి మీరు త్వరగా ఖబురుచేసి మమ్మున తీసుకపోవలసినది. కించిత్తు ఆలస్యమాయెనా మీరు నేరస్థులుకావలసివచ్చును. అని యీతీరున జోహారుగా పలికేవరకు ఫారా శిపాయీలు రాజుగారు నిద్రబోతూవున్నారు. మూడుదినములనుంచి యుద్ధ ప్రశంసవల్లీను నిదుర లేదు. గనుక యిప్పుడే మేము లేపితే ఆగ్రహముచేసి మమ్మును నేరస్థులను చేతురు. అది గనుక వారు నిదుర లేచినట్టుగానే సమయం కనిపెట్టి మిమ్మును హజూరుకు తీసుకుపోతూవున్నాము. అంతపరియంతము వుండుమని చెప్పే వరకు పాపయ్యగారు కాముకా యిప్పుడు రాజుగారిని నిద్ర లేపి పుత్తరాలు యిస్తేనేకాని కూడదు. మమ్మున నీ వెంట బెట్టుకొని పొమ్మని చెప్పినందున ఆ మాటలకు ఫారా జమా దారుడు నిబద్ధిగా ఆనందరాజుగారిదగ్గిరనుంచి వచ్చినారని యెంచి సంజాయించి తమ ఫారాదగ్గర జాగాచూపించి రాజు గారు లేవగానే పుత్తరాలు యిప్పిస్తాము. అదిపర్యంతరం నాల్గు ఘడియలు పడుక్కొండుమని డేరాలోపల తమ ఫారాకు లోపుగా స్థళము చూపించిరి. గనుక వుండి ఆ వేళదినం రాత్రి రెండు ఝామూలపరియంతరం వెన్నెలకాస్తూవుండి అంతట

చంద్రాస్తమయం ఆయెను గనుక చీకటికూడా ప్రసక్తమయ్యి నందున నల్లని శాలువవంటి కంబళి ముసుకువేసుకొని నేల సాటుగా దొర్లిపోయి రాజు పడుకున్న డేరా కత్తిరించి లోపలికిపోయి నిద్రబోతూవున్న రాజును మేలుకొలిపేవరకు రాజు తత్తడిల్లి నీవు యెవరని అడిగితే నేను బొబ్బిలివారి పులిని తాండ్రపాపయ్యను. యెరగవా అని రొమ్ము తట్టుకున్నాడు. అంతట రాజుగారు నిద్రపోతూవున్నట్లుగా వుండి ప్రక్కలో కత్తులు చూచుకునేవరకు అంతకు తత్పూర్వమే రాజు లేవక మునుపే పాపయ్య సంగ్రహించినందున అగపడలేదు. గనుక రాజు నాలుగుమూలలు వీక్షించి పాపయ్య వచ్చినమార్గానవే ఒక లఘువుతోటి యివతలికి వచ్చినాడు. కించితు పారిపోయెనా చుట్టూ పారాలున్నవి. ఒకమారు పిలిచినా అంతా వత్తురు. రాజు బ్రతికిపోవును. ఇన్నిటికి మృత్యువు ఆసన్నమయినందుకు యీవయినం తోంచక చెట్టున చుట్టూ యీటెలు చేరబెట్టి వుండగా ఒక యీటె తన బలంతోటి లాగేవరకు అదిన్ని యీటెముక్క రాక వృత్తికిజ్ఞమాత్రం వచ్చేవరకు ఆ కట్టె తోటి యీ పాపయ్యను వంగదీసిపొడిస్తే కంఠము క్రిందికిదిగింది. రాజు బహు వైష్టుపాటుగు ఆయినమనిషిన్ని, బహు బలవంతుండున్న గనుక వంగినపాటున తాండ్రపాపయ్య బాకుదీసుకొని కడుపు చీరినాడు. గనుక యీ తీరున యిద్దరున్ను హతమయినారు.

తదనంతరం రాణువవారు అంతా వచ్చిచూస్తూవుండగా పాపయ్యతో వచ్చిన సేవకుండు 'పులిపులి' అంటూ 'బొబ్బిలి

వ్వారి పులి' అంటూ రభసం చేస్తూవుండగా దగ్గరవున్నవారు యీ సేవకుని నరికి పారవైచిరి. వీడు ఒకఁడున్ను యిద్దరి ఖూనీ చేసినాడు. ఆ మీాదట మఱి నాల్గు ఘడియలకు మొసెబూసి వారికి రాజు గతమయిన వర్తమానం తెలిసినందున భయపడి యీ స్థళంలో యిటువంటి శూరులు యెంతమంది యున్నారో యిఁకను యిక్కడ వుండరాదు. అని తత్క్షణం అక్కడినుంచి లేచి యివతల నాలుగు క్రోసులదూరం వచ్చి దిగినాడు."

---

బొరాబట్టీ కృష్ణదేవు గజపతి యను కటకపు రాజులకై సియ్యాతులో చేరియున్న బొబ్బిలియుద్ధ వృత్తాంతము.

---

(యథామాతృకము.)

శాలివాహన శకవర్షంబులు 1677 అగు యువసంవత్సరమునందునను:—

అంతట గోలుకొండలోనున్న నవాబు మీారు నిజావల్లీఖాన్ బహద్దరువారు మూసాబూసి అనే ఫ్రాంసుధొరకు కళింగ సర్లస్కరు ఉద్యోగము దయచేసి యతనివద్దను దివానుగిరీ చేస్తూ రాజకార్యము తీర్చబడానకు హైదరు జంగు అనే తురకను కుదురుపరచి తగిన ఫౌజు వెంటతోడుపరచి వారి వెంట పంపిన సరదార్లు;

తురకలు.

1 జంద్రాలు మహమ్మదు హుస్సేను.

1 లాడాఖాన్‌కు మర్దాన్.

1 సిద్దిబలాల్.

1 జాన్ ఖాన్ అమీరుజా.

1 నబాబు హుస్సేనల్లీఖాన్ బహద్దరు.

(ఈయన బందరు నవాబు ఆయె.)

1 షుకురుల్లాఖాన్ వగైరా.

6

---

ఫ్రాంసుఫోరలు.

1 ముసేలాన్.

1 ముసామస్తేను.

1 ముసాతిపులాం.

1 ముసాలస్సేను.

1 ముసాకుస్లాం.

1 ముసాకుప్పు.

1 ముసామాసు.

7

---

ఇదిగాక ఛత్రపతి రామచంద్రు మొదలైన రాజపుత్రులును ఈప్రకారముగా సరదారులను యేర్పరచి కొన్ని యేనుఁగులు ఉష్ట్రశిలేభక్స్తి గుఱ్ఱపుఫౌజు కొంతగడిదీ తుపాకి చకముకీ తుపాకి ముసాబూసియొక్క ఖాన్ తాబేసీలు దాదు ఘటాలాలు కొన్ని మరికొంత మొగఫౌజు అరాబాఫిరంగులు శేఖలాలు కావలసిన మందుగుండు సామగ్రి యింతమట్టుకున్న

జ్ఞతపరచి దేశముఖర్దు బందుచేయించి సర్కారు అర్థము దస్తుచేసి ఖజానా నింపవలసినదని హుకుం ఫరమాయించి అంపించఁగా ముసాబూసి పైనచెప్పిన పరివారముతోటి గోలకొండనుంచి తర్లివచ్చి మచిలీబందరు మజిలీగడిచివచ్చి గౌతమీ మహానది దాటి కోటిలింగాలవద్దను దండు దిగివుండి ముసాబూసి తన దివాను అయిన హైదరుజంగును పిలిపించి కళింగసర్కారులో జమీందారులను అందరిని బయటికి రమ్మని ఫర్మానాలు వ్రాయమని హుకుముచేయఁగా హైదరుజంగు అదేప్రకారముగాను ముసాబూసి పురఘ్వుదంతుల్ ముల్కు గజఫరాజంగు శిఫాయి సరదారుగారిపేరు బెట్టి దరోబస్తు శ్రీకాకుళపు సర్కారులోనైన జమీందార్లకు ఫర్మానా కాకితములు వ్రాయించి హుజూరుసర్కారాజనాన్ని అంపించఁగా వారు వెళ్లి జమీందార్లకు ఫర్మానా కాకితముల నగుపర్చగాను శ్రీరాజా పూసపాటి విజయరామ రాజుమహారాజులుంగారు నలభైవేలు కాల్బలమున్ను నాలుగువేలు గుఱ్ఱపు ఫౌజున్ను వెంట కొలువఁగా కదలివచ్చెను. మరిన్ని కాకర్లపూడి జగన్నాథరాజు సత్యవరపు తాలూకా జమీందారుఁడయిన కాకర్లపూడి రామభద్రపాయకరావు, ముఖీ కాశీపతిరాజు యీయిన శృంగవరపుకోట తాలూకా జమీందారుఁడు. పెద్దాపురపు తాలూకా జమీందారుఁడైన రాజా వత్సవాయరాయపు రాజు మాడ్గుల్ల జమీందారుఁడైన లింగభూపతి సైయతలు, వర్జియలు కొలువఁగా వచ్చెను. పొన్నమండ జమీందారుఁడు అయిన మందపాటి రఘునాథరాజు యీ బల

భద్రరాజు వీరందరున్ను వచ్చి రాజమహేంద్రవరము ప్రవేశించియుండిరి. పూసపాటి విజయరామరాజుగారు కళింగకు లోనైన దర్బస్తు పాళ్యాలు మన్నెగాండ్లను అందరిని కొట్టి కప్పములు పుచ్చుకొనినప్పుడు బొబ్బిలి జమీందారుడైన రంగారావునుకూడా తాను లోబడచేసుకోవలెనని యెన్ని ఆవర్తులు తనయుక్క ఫౌజు యావత్తు తీసికొని బొబ్బిలి రావువారిగడీ మీదికి లడాయినిమిత్తము మోహరముచేసినాగాని రావు రంగారాయనింగారు నాలుగువేల బలమున్ను వెయ్యిమంది వెలమవారిలతోటిన్ని వుండి తిరుగబడి పోట్లాడి రాజు ఫౌజును తూలబొడిచివేస్తూ వచ్చినారు గాని యెప్పుడున్ను లొంగినారు కారు. అందునుగురించి విజయరామరాజుగారికి రంగారాయని మీద కాన్పుయ్యున్ను యున్నది గనుక విజయరామరాజుగారు తన్ను రాజమహేంద్రవరము సర్లష్కరు దర్శనానకు వెళ్లినారిన్ని సమాచారము తెలిసి రావు రంగారాయనింగారు ఈ సమయములో మనముకూడా రాజమహేంద్రము వెళ్లి ప్రవేశిస్తే విజయరామరాజుగారున్ను మనము కూడా ఒకచోట వక మహలులో సలిచింపబొయ్యేవేళకు సరసము జరుగక పోదు. అందగినుక యిప్పుడు విజయరామరాజు రాజమహేంద్రవరములో వుండగా మనము వెళ్లడము సలహాకాదని విచారించి వారివారి జవాబు సవాలు యేమియేమి జరుగుతున్నదో తెలిసే పర్యాయత్వేన మనము పెద్దాపురమువద్దికైనా వెళ్లి సర్లష్కరుని కలుసుకుందాము అని తన మంత్రులు

సర్దార్లతో ఆలోచనచేసి రంగారాయఁడుగారు రాక నిలచిరి. ఫూసపాటి విజయరామమహారాజులుంగారు రాజమహేంద్రవరము ప్రవేశించిన మరునాఁడు మూసాబూసి ఫ్రరస్ఫుదంతుల్ ముల్కుగారి భేటీకి వెళ్లి కొంతసేపు ప్రసంగించినమీదట దివాను హైదరుజంగు సాన్నిధ్యమందు వుండగానే యెప్పటికిన్ని కళింగ సర్కారుకు జమాబంది యేర్పాటై వున్నది గనుక ఆ చొప్పున యిప్పుడు పంద్రెండులక్షల రూపాయిలున్ను చెల్లిస్తున్నారము. మీరు అందుకు అంగీకరించి గోదావరిదాటి ఆవల దిగవలసినది. అని చెప్పితే అందుకు వప్పక తాము శ్రీకాకుళము చూడకుండా తిరుగవలసినది లేదని యనిరి. అందుమీదను విజయరామరాజుగారు సన్నష్కగు శ్రీకాకుళము పర్యంతము వచ్చేపక్షమునందు ఈఫౌజు మోపికకూడా కూర్చుకుంటే యీసారె బొబ్బిలి సాధించవచ్చును. అని ఆలోచన నిశ్చయుం చేసికొని మూసాబూసివారివద్దనుంచి కదలి హైదరు జంగును చెయిబట్టుకొని యీవలకుఁ దీసికొనివచ్చి గోదావరీ నదీతీరమునందు షమేనాలోన కుర్చీలమీద కూర్చుండి విజయ రామరాజుగారు హైదరుజంగును చూచి మీరు బూసీగారు సహా శ్రీకాకుళం పర్యంతిరమున్ను వచ్చేపక్షమునందు అక్కడ వక కార్యమున్నది. అది మీరు సహాయులై మాకు చక్కపరచి యిస్తే మీకు మూఁడులక్షల రూపాయిల కట్నము యిప్పిస్తున్నా నని అన్నంతలో హైదరుజంగు ద్రవ్యమునకు అపేక్షపడఁగా కళింగలో బొబ్బిలి అని వున్నది. అక్కడ రావు రంగారావు

అని ఒక వెలమమన్నె ఘోరలు వున్నాఁడు. ఆయన యే ప్రొద్దు మా దేశముమీద ఫితూరీచేస్తూ దేశం ఖర్చు ఆబాదు కానివ్వఁడు. సర్కారు అర్థం దస్తు కానివ్వఁడు. నాలుగువేల రాణువ వెయ్యిమంది వెలమఘోరలతో యున్నాఁడు. ఎన్నిమారులు మేము ఎత్తినడిచినా లొంగినాఁడుకాఁడు. అని చెప్పితే విజయ రామరాజు అంటే విస్తరించి సైన్యముకలవారలున్ను, మిక్కిలి పరాక్రమవంతులున్ను అని మేము వింటూవుండేవారము. మీకు ఆ వెలమ ఆయన ఒకషరవాతోఁచినదా అంటే ఆలాగు నన పని లేదు. మావద్ద విస్తరించి ఫౌజున్నమాట యథార్థమేకాని నా ఫౌజు అంతాచీకాకు చెయ్యడానకు రంగారాయని భావమరిది తాండ్రపాపయ్య అనే ఆయన ఒక వెలమఘోరవున్నాఁడు. ఆయన ఒక్కఁడే చాలును. అని ఆయన సహాయంచేతనే రంగారాయఁడు యెవరినీ లక్ష్యంచేయఁడు. సర్కారును సహా లక్ష్యంలో వుంచఁడు. అది గనుక ఇంతకు ఒకటి విచారించండి. మీరు హాకీలు వచ్చినారంటే ఇంతగా పేరుబడ్డ బలవంతులము మేము చేతులు జోడించుకొని దర్శనానకు వచ్చినాము. తక్కిన జమీందారులు అంతా వచ్చినారు. రావు రంగారాయుఁడికి మీ యందు గణనలేకనేగదా భేటీకిసహా వచ్చినవాఁడుకాఁడు. ఎక్కువలు నేను చెప్పవలసియున్నదా అంటే హైదరుజంగు ఏని సకలదేశాలును జయించినాను. మాకొక వెలమమన్నె గాడు దొడ్డ అని చెప్పుతున్నారు. అవస్యం మా అల్లామీద ఆనవున్నది. బొబ్బిలికోట్టి బొబ్బిలి మీకు పట్టముకట్టుతున్నాను.

ఈమాటలు తప్పను అని కత్తికొట్టి రాజుకు ప్రమాణము యిచ్చినాడు. రాజుకున్ను, హైదరుజంగుకున్ను జరిగిన జవాబు సవాలుచారులవల్లను రావు రంగారాయనివారు విని యినుగంటి రంగయ్య దామెర దమ్మన్న కందిపల్లి ధర్మారాయుడు మొదలైన వెలమఘోరలను పిలుపించి విజయరామరాజుకున్ను, హైదరుజంగుకున్ను, జరిగిన సవాలు జవాబులున్ను చెప్పి బూసి సర్లష్కరుడు కళింగకు వస్తున్నాడట. హైదరుజంగు మనలను సాధించి బొబ్బిలికోట విజయరామరాజుకు పట్టముకట్టుచున్నానని నమ్మకముచేసినాడట. విజయరామరాజు బొబ్బిలికోట యేలుకుంటానని సంతోషిస్తూవున్నాడట. అని యావద్వర్తమానమును తెలియబలికి వారు హాకీలు అయి దేశము యేలుకోవచ్చినారు. రాజుకు మనకు విరోధముగాని హాకీంకు మనమీద యేమి విరోధము వున్నది. మనము స్త్రీబాలవృద్ధులతో వున్న కోటమీదికి రాజుమాటలు విని హాకీలు యెందుకు వచ్చేరు. అని ప్రస్తాపనచేసినారు. మరిన్ని అయినాగాని మనము హైదరుజంగుగారివద్దకు వక వకీలును పంపిస్తే ఆయన తాత్పర్యం యావత్తూ తెలుస్తుంది. అందుమీద అప్పటికి తోచిన యత్నం చేయనేవచ్చును. అదిగాక బందరులోవున్న మూసాకుమందసు అనే ఫ్రాంసుఘోర మనచోట చాలా విహితం వున్నవాడున్ను మన మర్యాదలు తెలుసును. అదిగనుక బొబ్బిలివారియొక్క రాజకార్యము తీర్పునుగురించిన మాటలకు మాజమ్మా వున్నదిన్ని వారిమీదను రాజుమాటలు

మీరు విని హుజ్జతు జరిగించడము ధర్మముకాదని ముసాఫ మందరువద్దనుంచి మూసాబూసికిన్ని హైదరుజంగుకున్ను ఉత్తర ములు తెప్పించవచ్చును. అని యాలోచనచేసి రంగారాయ నింగారు తన వకీలు నియోగి పంతెనబుచ్చన్న అనే ఆయనకు పాలకీతగిన సల్తనలనుకూర్చి నీవు వెల్లి హైదరుజంగు తాత్పర్యం తెలియఁగా అతను ప్రసన్నబుద్ధి అగుపరచకుండినా ఆ మార్గా ననే బాదరు వెల్లి మూసాకుమందరుని చూచి ఆయనవద్ద దుబాసి అయిన మద్దాలవెన్నెనాయఁడుగారిముఖతః యీ సం గతి యావత్తు కుమందరుకు తెలియఁజేసి మనకోట వాఁడబీ జరి గించేటట్టుగా మూసాబూసిపేరనున్ను, దివాను హైదరుజంగు గారిపేరనున్ను జాబులు వ్రాయించి పట్టించుకివచ్చి వారికి ఆ జాబులు అందించి అందుమీఁదనున్ను వారి తాత్పర్యము యే చొప్పున వుంటున్నదో తెలిసి రావలసినదని చెప్పి జాబులు వ్రాయించి ఇచ్చిరి. అంతట పంతెనబుచ్చన్న జాబులు అందు కొని బొబ్బిలి తరలెను.

రాజమహేంద్రవరములోను హైదరుజంగు ఫ్రానసపాటి విజయరామరాజుగారితో కొంతసేపు మాట్లాడి ఆయనను బసకు పంపించి తాను మూసాబూసిగారివద్దకు వెల్లి కళింగ సర్కారులోను బొబ్బిలి అనే పాళియస్థలము వున్నది. అక్కడ జమీదారుఁడు రావు రంగారాయఁడు అనే ఆయన సీమలో సితూరీచేస్తూవున్నాఁడు. సీమలోను విజయరామరాజుగారికి సీమ అంతా శిస్తు పడనివ్వఁడు. దస్తు కానివ్వఁడు. అదిగనుక

వారిని బొబ్బిలిగడీలోనుంచి ఫారాకుచేసి ఆ స్థళం ప్రాసపాటి విజయరామరాజుగారికి పట్టము గట్టితే దేశములో ఫితూరీ లేకుండా నిమ్మళించివుంటున్నది. సర్కారు అర్థమున్న దస్తు అవుతున్నదని చెప్పి రంగారాయడు గ్రామ్యము మనిషి గనుకనే యిందరు జమీందార్లు యిక్కడికి మాభేటికి వచ్చి వున్నప్పటికిన్ని ఆ వెలమఘోర మనలను నిర్లక్ష్యంచేసి భేటికి సహా వచ్చినాడుకాడు. అని కాముకా (మకాం) బొబ్బిలి కొట్టి విజయరామరాజుకు పట్టము గట్టవలసినది. అని బూసీకి బోధపరచినాడు. మూసాబూసీన్ని హైదరుజంగున్ను ప్రాస పాటి విజయరామరాజుగారున్ను సమస్తసైన్యముతోనున్ను రాజమహేంద్రవరము తర్లి పెద్దాపురమువద్దకు వచ్చి ప్రవే శించియుండగాను రంగారాయనింగారి వకీలు అయిన పంతెన బుచ్చన్న బొబ్బిలినుంచి వచ్చి పెద్దాపురం ప్రవేశించి తగు మనుష్యులందరిని చూచి హైదరుజంగు భేటికి వెళ్లగానే ఆ వకీలును చూచి హైదరుజంగు యితన్ని రంగారాయుడుగారి వకీలుగా తెలిసి మీ ఘోర రంగారాయుడికి మేము ఫరవా తోచలేదు. గనుకను మా భేటికి వచ్చినారుకారు. నీకు యిక్కడ యేమిపనియున్నది. మీ రంగారాయుడివద్దకు పోవలసినది. అని చెప్పంగా ఆలాగే వెళ్లగలందులకే వచ్చినాను. అని అతని మనస్సులో క్రోధమున్న జాడ తెలుసుకొని పంతెనబుచ్చన్న అక్కడ నిలవ సహించక హైదరుజంగును చూచి మా రావు గారు నిరపరాధులు. సర్కారుకు విధేయులుగాని వేరేలేదు.

దుర్బోధలవల్ల నీవు దుర్ణయం తలంచినతలంపు. మానుపించే వారు చెప్పితే అప్పుడు వినేవు. అని దిగ్గున లేచి రంగారావు గారు రాసిపోతూవ రేమంటే శత్రువుడైన విజయరామరాజు ముందుగా వచ్చివున్నందున మా రావుగారు వచ్చినపక్షమందు రాజుతో చెప్పవచ్చునని సంకోచించి రాలేదు. హకీములు విూరు అండదుబజమీందారులయందువలెనే మా రావుగారి యందు సముబుద్ధివుంచి రమ్మంటే రానయి వుంటారంటే ఆ మాటను గడ్డకను మాయెదటికి రాపనిలేదు. కోట విడిచిపో వలసినది. అని తురక చెప్పెను. అందుకు బుచ్చన్నరావుగారు ప్రాణాలతో కోటవిడిచిపోరు. నీవు యేమిచేసేవు. దుర్బోధ ఆలాగున అనిపిస్తుంది. మానుపించేవారిచేతనే మానుపించడ మవుతుంది. అని తెలియబలికి బుచ్చన్న బందరువెళ్లెను.

ఆ తరువాత హైదరుజంగు హర్కారాజోడా తయారుచేసి రంగారావుగారిని కోటవిడిచి లేచిపోవలసినదని జాబులు వ్రాసి వారిచేతికి యిచ్చి మీరు వెళ్లి బొబ్బిలికి దోవలు, మన్యం సూర్గి మైదానం, ఆకోట బందుబస్తు అంతా చూచి రంగా రావుకు జాబులు యిప్పించిరమ్మని అంపించగా ఆహర్కారాలు మార్గములు కని బొబ్బిలివచ్చి రంగారావుగారికి జాబులు యిచ్చి నంతలో రంగారావుగారు చూచుకొని మేము దేహములు వుంచుకొని కోట విడిచిపెట్టుదుమా కోట విడిచేకాలానకు కోటా దేహాలుకూడా వకసారిగానే విడిచిపెట్టుతాము. అని చెప్పి యుక్తముచొప్పున మారుజాబులు వ్రాయించి యిచ్చి

వచ్చిన హర్కారులకు బహుమానములు చేయించి తిరిగి తను వకీలు దామెర దమ్మన్నగారినికూడా అంపించఁగా వారు వెళ్లి హైదరుజంగుకు జాబులు యిచ్చి వున్న వాస్తవం జరిగినవాస్తవం అంతా తెలుపుడి చేసిరి. దామెర దమ్మన్నగారు మొదట వెళ్లగా హైదరుజంగు చూచి ప్రభువు రాకవుండడము యేమంటే మీరాజు విరోధానకు వెఱచిరాలేదు. తమకు కౌలు దయచే యిస్తే పిలుపిస్తున్నాను. అనఁగా కోపంవచ్చి కౌలు వ్రాయము. తాను రానక్కరలేదు. కోటవిడిచిపోవలసినది. అని ఖండనగా కసిరి చెప్పఁగా దమ్మన్న బొబ్బిలికి తిరిగి వచ్చి రావుతో ఆ సంగతి చెప్పెను.

పంతెనబుచ్చన్న బందరు ప్రవేశించి మూసా కుమందరు ఫోరగారిని కని రంగారాయసింగారి జాబులు యిప్పించి విజయరామరాజుగారి దుర్బోధలచేతను మూసాబూసీ దివాను హైదరుజంగు తలఁచిన దుష్కార్యమున్ను, వారు బొబ్బిలి సాధించడానకు యెత్తివస్తూవున్న సంగతిన్ని యీవత్తున్న దుబాసీ అయిన మద్దాలరెడ్డినాయని ద్వారా తెల్పుడుచేసి నంతలోను మూసా కుమందరు చాలా నొచ్చుకొని విజయరామరాజుయొక్క దుర్బోధలు విశ్వసించి ఫరాంసువారు స్త్రీ బాలవృద్ధజనముతోకూడా మిక్కిలి అభిమానశాలి అయి వున్నటువంటి రావు రంగారాయనింగారి కోటమీద నిరహేతుకరముగా నడిచినారు. అందువల్ల రావుగారికి ఒక అపాయమైనదిన్ని అనేమాట పుట్టితే యెంత అపయశస్సు. అది

గనుక బొబ్బిలి రావుగారిగడీమీదికి మీరు యెత్తినడపడం బహు నిందకున్ను, అపయశస్సుకున్ను హేతువ అవుతున్నది. ఆలా గంటి తెగువకార్యము చేయవద్దని యెన్నో విధములుగా మూసా కుమందరుగారు మూసాబూసీపేరను జాబులు వ్రాసి యిచ్చి స్నేహి యిప్పించి మూసామర్తేను అనే ఫ్రాంసుధొరను పిలిపించి నీవు యీ జాబులతోకూడా మూసాబూసీవద్దకు బోయి నేను చెప్పినమాటలుగా నీవు చెప్పవలసినది యేమంటే రావు రంగా రావుగారను యెప్పుడు పూసపాటి విజయరామరాజు చప్పు చేయ్యాప్రం లేవాడు. ఆ యినప్పటికిన్ని రంగారావు మిక్కిలి సిపాయి మనిషిన్ని అభిమానశాలిన్ని గనుకను విజయరామరాజుకు లొంగనాడుకాడు. ఆ క్రోధముచేత రాజు యెన్నివిధాలగా నైనా కుయుక్తులు చేస్తున్నారు. ఆ రాజుమాటలు విశ్వసించి మీరు బొబ్బిలిగడీమీదికి దండుయెత్తివెళ్లితే వెలమవారు అభిమానవంతులు. అందులో రావువారు మిక్కిలి మానధనులు. రంగారాయుడు స్త్రీబాలవృద్ధజనంతోకూడా వున్నపని. వారిగడీ మీదికి మీరు దండెత్తి వెళ్లినంతలో వెళ్లినవారున్ను, మీరున్ను, రాబోగు. తప్పవస్తే వారున్ను స్త్రీబాలవృద్ధజనంతో కూడా సమాప్తం అవుచున్నారు. గాని మరివకటి జరగనేరదు. తుదను అపకీర్తి నిందకు ఫరాసువారు ప్రాప్తులు అవుతున్నారు. గనుక రాజు ~~[illegible]~~ మాటవిని రావువారిగడీమీదికి వెళ్ల వద్దని అవశ్యం చెప్పవలసినది. అని బోధపరచి పంపేన యిచ్చ [illegible]గా ఆ యిచ్చన్న మూసామార్తేను అనే

ఛోరను వెంటబెట్టుకొని వచ్చి కస్సికోటలోను మూసాబూసీని కలుసుకొని జాబులు బూసిఛోరగారికి యిచ్చెను. మూసా మర్తెను వచ్చి తనతో కుమందరుగారు చెప్పిన సంగతులన్ని బూసిఛోరగారికి తెలియఁజెప్పి ఆ మూసాబూసి హైదరు జంగును పిలిపించి మూసాకుమందరు మాకు అత్యాప్తుఁడున్ను, గురువుసమానుఁడున్ను ఆయన బుద్ధులు మేము వినవలసినది ముఖ్యము. అని చెప్పి కుమందరుఛోరగారు వ్రాసినజాబులు వినుపించగా విని హైదరుజంగు అంగీకరించినట్టుగానే వూరి కేనే వుండెను. ఆ మూడోనాఁడు మూసాముర్తెను తిరిగి బూసీ ఛోరగారి శెలవుపుచ్చుకొని బందరుకు వేచిపోయెను. ఆ రోజు సాయంత్రమునందు విజయరామరాజు హైదరుజంగు డేరాకు వచ్చి నేను చెప్పినమాటకు మీకు దాఖలా అయినదిగదా బందరుకు వకీలును అంపించి మూసాకుమందరుఛోరగారివద్ద నుంచి మూసాబూసీగారిపేర జాబులున్ను రంగారావు హితవు కూర్చి బూసీవారితో కొన్ని సంగతులు చెప్పగలందులకు రాయ భారానిన్ని తెప్పించినాఁడు. గాని తాను మీ దర్శనానకు వచ్చి కలుసుకోవడానకు వొప్పినాఁడుకాఁడు. అంత గ్రామణా గా మసులు తూన్నాఁడు. అని చెప్పితే అందుమీఁద హైదరుజంగుకు మరిన్ని కోపము, కార్పణ్యము యెక్కువతోఁచి కాముకా బొబ్బిలి జమీన్ తీసివేయడమే నిశ్చయించుకొనెను. పంతైన బుచ్చన్న కూడానే వుండెను. మూసాబూసి దివాను హైదరు జంగు విజయరామరాజు మొదలైనవారలు అంతా ఆ సైన్య

ముంతో కూడా దేవుపల్లివద్దను పోయి దిగివుండగా రావు రంగా రావుగారు చిట్టీల రాసున్నను కూడా యిచ్చి చెలికాని వెంకయ్య అనే వెలమ సర్దారను సర్కారుకు నిమిత్తము అంపించగా ఆయన దేవుపల్లివద్దకువచ్చి హైదరుజంగుభేటీకి వచ్చినంతట ఆయన నుంచి హైదరుజంగు బహు కోపంతోను మీ దొర చిన్న పిల్లలతో కూడా కోటవిడిచి లేచి వెళ్లినాడా లేదా అని అడిగితే కోటవిడిచివెళ్లడానికి మేము సామి అంత సర్కారుకు వ్యతిరిక్తము నడిచినాము. దివాణపుపయికం బాకీ పెట్టుకున్నామా? పయికం అడిగితే తిరగబాటుచేసినామా? అంటే కాముగా కోటవిడిచి లేచిపోవలసినది. అని హంకారబుద్ధితో చెప్పగా రంగారావుగారికి నీతో పూర్వమంతు శత్రుత్వము వున్నదోలును. లేకుంటే యీ దుర్బోధన పుదయించదు. అని తెలపు పుచ్చుకొని లేచిపోయి బొబ్బిలి ప్రవేసించి రంగారాయనివారితోటి యుద్ధము నిశ్చయము. హైదరుజంగుమతము సంధికి ఒందు కాకుంచోవ్వను విచారించడానకున్ను చోరకానడు. అని జరిగిన సంగతి అంతా తెలియబలికిరి. అందుమీాదను బూసి హైదరుజంగు విజయరామరాజుగారు సహాయాసస్తు సైన్యములతోనున్ను దేవుపల్లి తర్లివెళ్లి బొబ్బిలి కోటకు వెలుపటను ఫిరంగిగుండు దూరానను దండు దిగివుండగా బొబ్బిలికోటలో రంగారాయడు చాకులవల్ల దండు వచ్చి కోటవెలపట చెలువు అనుకొని దిగివున్న సంగతి తెలిసి రావుగారు కోటబురుజు యెక్కిచూచి కోట బాలా

మీఁదను నౌబత్తువేయించి తగు వెలమ దొరలను మొదలయిన వారిని అందరిని పిలుపించి ఫిరంగులు, జజాయీలు, గంటికోడులున్ను, శేకలాలు, జబర్జంగీలు, లగ్గదాదులున్ను, లగ్గదింబులున్ను, మరి తగిన సాధనములు అన్ని బురుజుల మీఁదనున్ను, కోటకొమ్మలమీఁదనున్ను తయారు చేయించి గట్టిగా నౌబత్తు వేయించేటప్పటికి ఆ ధ్వని విని హైదరు జంగు హసనల్లీఖానుని పిలుపించి ఆ ధ్వని యేమి అని అడిగితే రావు రంగారావు కోటమీఁద నౌబత్తు వేయిస్తూన్నారు. అని చెప్పఁగానే మిగుల కోపంవచ్చి సాహెబు సుభావచ్చి దిగియున్నాఁడు గనుక నౌబత్తు యీపాటి నిలిపి కోటవిడిచి లేచి పొమ్మని చెప్పఁగా దుల్కు హసనల్లీఖానుణ్ని అంపించఁగా అతఁడు కోటలోనికి వెళ్లేటప్పటికి రంగారావు యెదుటవచ్చి కౌఁగలించుకొని వెంటబెట్టుకొని వెళ్లి కూర్చుండి ఉభయులు కొంతసేపు యిష్టాగోష్ఠిప్రసంగము అయినతరువాత హైదరు జంగు చెప్పినసంగతులు అన్ని చెప్పితే రంగారావు చాలా నొచ్చుకొని నౌబత్తు పాదుషహా దయచేసి యిస్తే తెచ్చుకున్నాము. గాని దొంగతనముగానున్ను, అన్యాయముగానున్ను, వొకణ్ని కొట్టి తెచ్చుకోలేదు. అదిగనుక నౌబతు మానుమని వుల్లంఘనచేయడానకు యేమినిమిత్తము. ఇదిగాక యీ పూటవరకున్ను యెంతలేని ఆపదలు వచ్చినాగాని యీ స్థళం విడిచి మరి వకస్థళానకు మేము పోయి యెరుగము. సమస్తభాగ్యము యీ స్థలములోనుండే అనుభవించినాము.

మేనువిడిచి లేచిపోవడానకు సర్కారుకు అంత తప్పి తిరుగ లేదు. విజయరామరాజుయొక్కనున్ను, మాయొక్కనున్ను తారతమ్యము ప్రకలాగున తెలుస్తూవున్నది. ఒకపచ్చ నిషాను నలభైవేలఫౌజుతో వున్న రాజుసేనతో పంపించండి. మా ఫౌజు నాలుగువేలతోనున్ను మేము ఆ నిషాను తీసుకొంటిమట్టా యినా సర్కాలములో నమ్మి ఖాయముచెయ్యండి. ఆ నిషాను మేము పుచ్చుకోకపోతిమట్టాయినా మీ చిత్తానకు తోచినట్టు మాయెడల సిధించి జరిగించవలసినది. లేదా రాజుపట్టమున్ను దేశములుకూడా మా జిమ్మా చేయించండి. మామూలుగా రాజు యిస్తూవున్నకానుక రెట్టింపు మేము చెల్లిస్తున్నాము. అట్లగాకపోతే నలభై వేలతో వున్న రాజునున్ను, నాలుగువేల తోవున్న మమ్ములనున్ను బాసికట్టి చివరి తమాషా చూడండి. మేము ఫ్రాన్సీసువారము బొబ్బిలిస్థలం రాజుకు దయచేయండి. రాజు వ్రాడినా మాకు దయచేయండి. అంతేకాక దేహములతో మేము స్థలమువిడిచి పోయ్యేవారముకాదని సాఫ్ జవాబు చెప్పెను. అంతట హుసనల్లీఖానుడు తిరిగి లష్కరులోకివచ్చి హైదరుజంగును చూచి రంగారావు నౌబత్తున్న మానడు. కోటనువిడిచి లేచిపోడు అన్యాయముగా వారిమీద దండెత్తితే చాలినయినంతమట్టుకు వెనుకతియ్యడున్ను అని రావుగారు పలికిన స్థితులు అన్ని తెలియపలికేటప్పటికి హైదరుజంగు చాలా కోపంవచ్చి అట్టయితే యిప్పుడు వానిని కోటలోనుంచి వాగ్దా చేయిస్తున్నాని అనంగా ఆమాటకు విజయరామరాజు

గారువద్దనుండి కొంత వృష్టి చేసెను. అందుమీదను హసనల్లీ ఖానుడు హైదరుజంగును చూచి అన్యాయముగాను రంగా రావుకు విరోధి అయిన విజయరామరాజుమాటలు పట్టుకొని పండువంటి సంసార్లు అందులో మిక్కలి అభిమానవంతులు మర్యాదస్థులు నిరపరాధులున్ను అయిన రంగారావు కోట మీద నీవు కార్యంచేస్తే యింకలో యెండగు చావకుండా బొబ్బిలికోట ఖాలీ అవుతున్నదా. కోట ఖాలి అయ్యేవేళకు ఆ లోపలి శిశుబాలవృద్ధజనము దక్క పిట్టమిగిలిపోవుతున్నారా. యీలాగంటి దారుణం నీవు చెయ్యకు. త్వరగా అది మళ్లీ అనుభవములోకి వస్తున్నదిగాని వృథా పోనేరదని మరికొన్ని ఉచితమైనమాటలు చెప్పితే హైదరుజంగున్ను విజయరామ రాజున్ను యిద్దరు బూసిగారి డేరాలోకి వెళ్లి గుండు చలా యించకుండా రంగారాయఁడు పలకిడని బోధించి యుద్ధానకు బూసీని ప్రోడుపరచి హైదరుజంగు రాజు యిద్దరున్ను వెల పలికి లేచివచ్చి ఫౌజు యావత్తు సదురుపరచి యుద్ధారంభము చేసి కోటమీదికి గుంపు్లు నడిపించి హల్లాచేసిరి. కోటమీద నుండి లగ్గ దింపుతూరాగా తుపకబలము విస్తారమున్నది గనుక ఫిరంగులచేత కోట కొంత పడఁగొట్టి అరేబియా ఫిరంగులు తయారుచేసి అగాదులుచేస్తూరాగా ఆ గుంపు్లు నగరువాకిళ్ల నంటి తగులుతూ వచ్చేటప్పటికి రంగారావుగారు తమవద్ద వున్న వెలమదొరలనందరిని పిలచి హద్దుమిగిలివచ్చినది. ఎదిరి సైన్యం చూస్తే విస్తారంవున్నది గనుక మానసంరక్షణ విచా

రించుకొని శాశ్వతధనమైన యశస్సును పొందవలసినది. చెలికాని వెంకయ్యను నగర్లలోకి వెళ్లి స్త్రీబాలురను ముందుగా స్వర్గలోకయాత్రకు నడిపించుమని ఆజ్ఞాపించగా ఆయన లోగిళ్లోకి వెళ్లి రంగారాయనిగారిభార్య, కుమారుణ్ని తొడల మీద వుంచుకొని కూర్చునివుండగాను ఆమెను చూచి శత్రుసైన్యములు హస్తమిగిలివచ్చిరి. అని చెప్పినంతమాత్రాననే ఆయమ్మవారు ఒక దాసీని పిలిచి యీ చిన్నవాణ్ని కోటవెలపలవుంచి బ్రతికించుకొమ్మని యివ్వగా ఆ దాసీ అడలుతూ ఆ చిన్నవాణ్ని గడ్డిగుమ్మానను తీసుకొనిపోవుతూవుండగా బూసీ ఫౌజువారు పట్టుబట్టారు. ఆ చిన్నవాణ్ని మూసాబూసివారు కనుకాంతకిలకరుణచేత డేరాలోనే వుంచిరి. రంగారావుభార్య, కుమారుణ్ని దాసీదాసిచేతికి యిచ్చి భగవంతుని తలచి శత్రువశముకాని స్వశమగు నని తలంచి కటారినేల ఆని అందు మీద పడి దేహము విడిచెను. మిగిలిన స్త్రీబాలురను అందరిని చెలికాని వెంకయ్య చిత్రవధచేసినాడు. ఆ సమయమందు ఆ కోటలోవున్న రాజబంధువులైన వెలమవారు నూరు యిండ్లవారు. శిశుబాలవృద్ధజనసమేతముగా నూరుయిండ్లవారు చిత్రవధను పొందిరి.

చెలికాని వెంకయ్య తిరిగి రంగారాయనివద్దికి వచ్చేవారకు తురకఫౌజు తారసమై వస్తూవున్నది గనుకను తన కుమారుణ్ని జాగ్రత విచారించుకొమ్మని దేశభారము తమ్ముడైన వెంగళరాయనికి వప్పగించి రంగారావు కోటగుమ్మం బయలు

వెడలి అనేకమందిని శత్రువులను వధచేసి చాలామంది తురక సవార్లను వధచేసి తన శరీరముకు అనేకగాయములు తగిలి నప్పటికిన్ని జంకక నిలవ నోపిక తక్కువై మండి మీద కూర్చుండి ఝుముదాళంవరాతీసి దగ్గిర దాసివచ్చినవారిని పొడుస్తూ శత్రువులను గుదుముతూ హుంకరిస్తూ కొంతసేపు మిక్కిలి సిఫాయిగిరీచేసి అంతట దేహదార్ఢ్యం తక్కువయి త్రిమూర్త్యాత్మకమయిన మహా తేజస్సువంటి ఆ వీరపురుషునియొక్క తేజస్సు సూర్యమండలము సొచ్చి స్వర్గమునందు చేరెను.

ఆ పిమ్మటను రంగారాయని తమ్ముడైన వెంగళరాయఁడు ఇనుగంటి నరసయ్య, కందిమళ్ల ధర్మారాయడు, చెలికాని వెంకయ్య, మొదలైన వెలమ దొరలున్ను, నాలుగువేల ఫౌజున్ను వెంటతీసికొని బయలువెడలి బహు యుద్ధముచేసి అనేకమంది శత్రువులను వధచేసి మహా పరాక్రమము ప్రకటన చేసి తన శరీరమందు మిక్కిలి గాయములు తగిలేవరకు హైదరు జంగు డేరా సమీపానకువచ్చి అంతట దేహదార్ఢ్యము తక్కువయి భూమియందు దొరిగినంతట మూసాబూసిగారు వెంగళరాయని చూచి వారియొక్క పరాక్రమమునకు చాలా సంతోషించి మెచ్చుకొని వెంగళరాయణ్నిన్ని, రంగారావు కుమారుణ్నిన్ని యుభయులను చాలా దయచేసి కుమానవుంచి హైదరు జంగును పిలిచి యిటువంటి దారుణకర్మము విజయరామరాజు యొక్క దురాలోచనవల్లనున్ను నీ ప్రయత్నమువల్లనూ సంభవించినది. ఇందులఫలం యీ రాజు శీఘ్రకాలములోనే అను

భవించపోతున్నాడు. నీకున్ను కించిత్తుపొందకమానదు. అని మిగుల నిందించినాడు. అక్కడికి యుద్ధము సమాప్తి అయినది. కనుకను ఎవరి డేరాలోను వారు నిమ్మళించియుండిరి. ఆ వేళ సాయంత్రం కావచ్చే వేళకు రాజాంగడీలోవున్న తాండ్రపాపయ్య గారికి బొబ్బిలిమీద లడాయికావడమున్ను కోటలో యావత్తు సమాప్తికావడమున్ను రంగారాయనిగారు సమాప్తి అయినా రనిన్ని తమ లంపతావాణ్ని మారువేషం వేసుకొని వెళ్లి విజయరామరాజు డేరా యెక్కడవున్నదో గుర్తుచూచి రమ్మ నగా వాడు వెళ్లి గూఢచర్యచేతను విజయరామరాజు డేరా గుర్తుచూచివచ్చి ఆ డేరా ఉనికిపట్టు ఆనవాలు గుర్తులు అన్ని తెలియజెప్పగా ఆ రాత్రి భోజనములేకనే తాండ్రపాపయ్య ఒకడున్ను దేవులపల్లి పెద్దన్న అనే ఆయనయున్ను, బుద్ధరాజు వెంకప్ప, ముగ్గురున్ను ప్రచ్ఛన్నముగా తమ్మునన్యులు గుర్తు తెలుసుకో లేకుండా వచ్చి విజయరామరాజు డేరా మరుగునకు వచ్చి రెండు ఝాముల రాత్రికి ప్రవేశించి నాలుగు ఘడియల తెల్లవారి ఉండే పర్యంతమున్ను సమయము కాచియుండి అప్పుడు రాజుయున్న డేరా గోడ చాకుకత్తితో చూరికత్తితో చించి ముగ్గురున్ను లోపల ప్రవేశించగానే డేరాలోపల రాజు పడుకున్న గది గుమ్మమువద్ద పారా యిస్తూవున్న యిద్దరున్ను పాపయ్య వస్త్రాలను చూచి యెవరని అటకాయిస్తే తాండ్ర పాపయ్య తినచేతి తలవాటుతోటి యిద్దరినిన్ని ఒక్క దెబ్బను నరికి పులిపులి అని ధ్వనిచేసినాడు. ఆ ధ్వనివిని రాజు మేలు

కొని యీ ధ్వని తాండ్ర పాపయ్య ధ్వనిలాగున తోస్తున్న దని విజయరామరాజువారు లేచి తలవాకు వెలికేసమయము లోను తాండ్ర పాపయ్యగారు విజయరామరాజు మెడమీద చెయివేసి అదిమిపట్టి మొలలో బాకు వైరదీసి రాజుగుండె ల్లలో దించి నాభిపర్యంతమును చీరగా పేగులువెలికిపడి విజయరామరాజు స్వర్గస్థుడాయెను. అంత రాజు ఫౌజులో జనము తొందరపడి పాపయ్యవద్దెరా ముగ్గురినిన్ని చూచి పోర్ని చుట్టుకొని తాండ్రపాపయ్యను, దేవులపల్లి పెద్దన్నను, బుద్ధరాజు వెంకప్పను ముగ్గురిని కలిసి యుద్ధముచేయగా వారున్ను కొందఱిని వధచేసి స్వర్గస్థులయినారు. ఈ సంగతి మూసాబూసీగారు విని చాలా ఆశ్చర్యపడి తాండ్ర పాపయ్య సాహసకృత్యానకు చాలా ఆశ్చర్యపడి అప్పుడు రంగారాయనిం గారి కుమారుణ్ణి న్ని, రంగారావుగారి తమ్ముడైన వెంగళరా యడుగారినిన్ని, యిద్దరినిన్ని పిలిపించి చాలా దయచేసి తగిన వస్త్రపాత్రములు, ఏనుగులు, గుఱ్ఱములున్ను, బహుమాన ములుచేసి వారి సీమవారి నేలుకొమ్మని కొత్తపల్లి మొదలైన సీమ జహగీరు యిచ్చి మూసాబూసీగారున్ను, హైదరుజం గున్ను, తక్కిన సరిదార్లున్ను, ఫౌజులతోటికూడా హైదరాబా దుకు లేచిపోయినారు."

ఈ యుద్ధమునుగురించిన వృత్తాంతము యీ దిగువ నుదహరించఁబడిన చరిత్రలలో సంగ్రహముగఁ జెప్పఁబడి యున్నది:—

1. డబ్లియు. డబ్లియు. హంటరుదొరవారిచే వ్రాయఁబడిన ఇంపీరియల్ గెజటీయర్ ఆఫ్ ఇండియా, 13-వ సంచిక, 484—485 పుటలు.

2. తారంటన్‌దొరవారిచే వ్రాయఁబడిన గెజటీయర్ ఆఫ్ ఇండియా.

3. ఇ. బాల్ఫర్‌దొరవారిచే వ్రాయఁబడిన సైక్లోపేడియా ఆఫ్ ఇండియా, 2-వ సంచిక, 271-వ పుట.

4. మాల్కమ్‌దొరవారిచే వ్రాయఁబడిన లార్డ్ క్లైవు గారిచరిత్ర, 2-వ సంచిక, 2—4 పుటలు.

---

## VII

## రాజా వెంకట రంగారావు బహద్దరుగారు.

## (1794—1801.)

---

ఈ రాజా వెంకట రంగారావుగారు రాజా గోపాలకృష్ణ రంగారావుగారి కుమారులై యున్నారు. ఏ యుద్ధమునందు తమ తండ్రిగారు చంపఁబడిరో యట్టి ఘోరతరమైన బొబ్బిలి యుద్ధమునందు కుటుంబస్థులందరికి సంభవించిన గతినుంచి తమ

తండ్రిగారి యుద్దేశమునకు విరుద్ధముగ నొక వృద్ధునివలన గాపాడబడి ప్రాణసంరక్షణ జేయఁబడినవారును, ఆ రాజా గోపాల కృష్ణ రంగారావుగారి కుటుంబములో జీవరదు నిలచియున్న వారునై యున్నారు. వీరు మూడు నాలుగు సంవత్సరముల లేతప్రాయముగలబాలురై యుండఁగా తమ యుపాధ్యాయుఁడగు నొక వృద్ధునివలన, యుద్ధభూమియందు మిగిలిన తన సేనతో జరిగిన ఘోరకృత్యమునకు జీవించుచున్న 'లాలు' దొరగారికి నొప్పజెప్పఁబడిరి. బుస్సీదొరగారు పూజ్యులైన యీ చిన్నవానిని, యీ యుపాధ్యాయుని స్వభావసిద్ధమైన యత్రి దయార్ద్రహృదయముచే విశేషాదరణముతో దగ్గరకు దీసి తమ పటకుటీరములో శత్రువులవలన నెవ్విధమైన భయము వీరలకు గలుగకుండునటుల జాగ్రత్తగ సంరక్షింపుమని యుత్తరవ్వు జేసిరి. మరియు బుస్సీదొరగారు బొబ్బిలికి ప్రతినిధిగా తమ తండ్రిగారికిచ్చెదమనిన పరగణాలకీ చిన్న రాజాగారిం బ్రభువుగ నేర్పరచిరనియుం జెప్పంబడియున్నది. ఆ పరగణా లెవ్వియో దొరికిన యాధారములం బట్టి చెప్పుటకు వీలులేదు. అయినను కొత్తపల్లిపరగణాయని నొకదానిలో జెప్పంబడియున్నది. యుద్ధమందు గాయములుతగిలిన వీరి పినతండ్రిగారగు వెంగలరంగారావుగారీ యుద్ధపుసందడియంతయు నణగినపిమ్మట తమ భుజపరాక్రమముచేతనే కవిటి, రాజాం పరగణాలను తిరుగ సంపాదించి పూసపాటివారి యధికారమున కెదురించుచు బొబ్బిలి రాజ్యమునంతను సంపాదించుటకు సకల ప్రయత్నములం

జేయుచు రాజాములో నివసించి 1765-వ సంవత్సరములో స్వర్గస్థులైరి.

1757-వ సంవత్సరమున బుట్టిన "బుస్సీదొరగారిపైన లాతీ" యను గ్రంథమువలన లకవరపుకోట యిస్టేటు బొబ్బిలి సంస్థానముక్రింద నప్పటివరకు నుండినటుల గానంబడుచున్నది. ఆ పుస్తకములోననె బుస్సీదొరగారీ వెంకట రంగారావుగారిని బొబ్బిలికిని, లకవరపుకోటకును స్వామియుఁడనియును వ్రాసెను.

ఈ రాజా వెంకట రంగారావుగారు రాజాములో దమ పినతండ్రిగారి సంరక్షణలో నుండిరి. వీరినే చరిత్రకారులు 'చినరంగారావుగారని వాడుచుండిరి. మరియు నీ వెంగల రంగారావుగారు గతించినపిమ్మట విజయనగరపు కుటుంబస్థులు, తమ విరోధులని రాజాం కవిటి పరగణాల నిచ్చి తుదకు రాజీపడిరనియు నొకకథ కలదు. అయితే యీ క్రింది కారణములంబట్టియు, తెలియవచ్చిన యితర సమాచారములంబట్టియు, నిది నమ్ముట కనర్హమై యున్నది. ఏలనంటె ఈ రాజీవలన చిన రంగారావుగారు విజయనగరపువారివలన మేలును పొందుటకు బదులుగా తమ పినతండ్రిగారి భుజబలముచే సంపాదించఁబడిన యీ పరగణాలయందు గల నిరంకుశాధికారమును విడుచుకొని యేల విజయనగరపువారికి లోబడుదురు. ఇంతియకాక విజయనగరపువారికీ రాజీవలన నీ పరగణాలయందు స్వతంత్రపు హక్కు కలిగినయెడల నప్పటి విజయనగరపువారి దివాను సీతారామరాజుగారీ చినరంగారావుగారిని నొక మోసమైన

ఝుపాయముచే నేల విజయనగరమునకు రప్పించి యచ్చట వీరినాంక్షలో నుంచిరి.

ఇంక జరిగిన దేమనిన:— ఈ చినరంగారావుగారు 1765 సంవత్సరమువరకుం దమ పినతండ్రిగారగు వెంగల రంగారావు గారి సంరక్షణకు లోఁబడి రాజాములో నివసించిరి. పిమ్మట మరియొక బంధువైన యినుగంటి చిన నరసయ్యగారి యాజ మాన్యముక్రింద యుండిరి. ఈ నరసయ్యగారి సంరక్షణలో నుండుగాలముననే పెదవిజయరామరాజుగారి పౌత్రులైన చిన విజయరామరాజుగారి దివానును, సోదరుఁడునైన సీతారామ రాజుగారీ చినరంగారావుగారిని స్వాధీనపరచికొనుటకు సకల యత్నములం జేసిరి. యుద్ధానంతరమున విజయనగరపు జమీం దారిక్రింద జేరిపోయిన బొబ్బిలి, సీతానగరము పరగణాలను తిరుగ మీ కిచ్చెదమని యనేకపర్యాయములు జెప్పి విజయనగ రము రమ్మని పిలువబంపిరి. గానీపనుపులు నిరాకరించబడినవి. ఇనుగంటి చిన నరసయ్యగారు కొన్ని సంవత్సరములవరకు నీ చిన రంగారావుగారిని విజయనగరపువారి కరారులను నమ్మ కుండునటుల జేయుచుండెను. అయితే యీ చిన రంగారావు గారు తమకు 15 సంవత్సరముల ప్రాయమురాగానే యీ బం ధువుయొక్క సలహాను నిర్లక్ష్యముజేసి విజయనగరమునకు వెళ్లెను. అచ్చట రెండుసంవత్సరములవరకు వారి యాంక్షలో నుండెను. వీరు మిత్రభేదముచే విజయనగరమునకు దీసికొని పోఁబడినది మొదలుకొని యీ చిన రంగారావుగారికి పిత్రార్జితమైన

రాజ్యము వచ్చునంతవరకును కవిట, రాజాం పరగణాలు పూస పాటివారిక్రింద నుండెను.

విజయనగరమునుండి యీ వెంకట రంగారావుగారు తప్పించుకొని యుద్ధకాలమున జనిపోయిన తమ తల్లిగారికి సోదరియు, తమకుం బినతల్లియునైన జగ్గమ్మగారివద్దకు వెళ్లిరి. ఈయమయు తమభర్తగారగు పిఠాపురపు రాజుగారైన నీలాద్రి రాయ బహాదరుగారును—ఆనంద గజపతిరాజుగారి భయము వలన పిఠాపురము విడిచి సామర్లకోటలో నుండిరి. ఈ చిన్న రంగారావుగారచ్చట గొన్ని దినములు నివసించియుండి, బొబ్బిలి నుండి కొంతమంది వెలమదొరలను, వెలగాలను, బిలుపించి [illegible] వెళ్లి యచ్చట గొన్ని సంవత్సరము లుండిరి.

పిమ్మట నిజామువారి [illegible] పాత్రులగువారికి నింగ్లీషు వారి యధికారము మీా ముఖ్య సర్కారుజిల్లాలలో స్థిరపడెను. (1794.) అప్పుడు హిందూస్థానభాగమునకు గవర్నరుగానున్నవారిచే నీ చిన రంగారావుగారు పిలిపించబడి తమ పిత్ర్యమైన రాజ్యమును పూర్వపు బొబ్బిలిరాజులకు గల సకలరాజచిహ్నములతో నిప్పించబడిరి. నిజాంవారిచ్చిన రాజుగారు శెలవుపుచ్చుకొనినపుడు యాంగ్లేయ ప్రభువులకు సిఫారసుత్తరముల నిప్పించుటయెకాక నిజాంవారొక గుఱ్ఱమును ఢంకాసహితముగ నయచేసిరి. ఈ యుద్ధము జరిగిన బొబ్బిలికోటకు మైలుదూరములోనున్న యిప్పటి ప్రాతకోటను వీరు కట్టించిరి. వారిచే గట్టింపంబడిన దివానుఖానా, చిన్న మేడ, దానిని గలసియున్న

జన్నానాభవంతియు నిప్పటికిని మంచి స్థితిలోనె యున్నయవి. వీరి ప్రభుత్వకాలమూరు న్నొకక-సంవత్సరమైనప్పటికిని, వీరి చ్చిన యనేకాగ్రహారములవలనను, వీరు త్రవ్వించిన పెద్ద చెరువులవలనను, వీరు వేయించిన తోటలవలనను, సుప్రసిద్ధిం జెందినది. వీరసంతానవంతులైనందున బొబ్బిలి కుటుంబములో నొక శాఖయగు పాత్తేరురావు వారి కుటుంబములోని 'రాయ డప్ప' యనుఁ జిన్నవానిం దత్తునిజేసుకొనిరి.

---

## VIII-వ పురుషుఁడు.

### రాజా రాయడప్ప రంగారావు బహదరుగారు.

### (1802–1830.)

---

రాజా రాయడప్ప రంగారావుగారు 1790-వ సంవత్స రము జనవరు నెల తే 4 దీని జన్మించిరి. వీరు దత్తులగునప్పటికి 13-వ సంవత్సరము వయస్సుగలిగియుండిరి. వీరి పెంపకపు తల్లిగారిపేరు 'చిన్నమ్మ'గారు. ఈయమ కోటగిరి వారి పుత్రిక యైయుండెను. ఈమె యీ రాజుగారి దత్తతనుగురించి యాక్షే పించగా గలెక్టరుగారికిని, గవర్నమెంటువారికిని, విస్తారమైన గ్రంథము జరిగెను. అయితే యీ రాజాగారి పినతండ్రియగు రావు వెంకట్రావుగారిచ్చిన బలమైన సంజాయిషీవలన వీరి దత్తత గవర్నమెంటువారిచే నంగీకరించఁబడినది. ఈ సమయ ములో బూసపాటివారి రాజ్యము దిరుగ దమక్రిందఁ జేర్పించి కొనుటకు చాలా ప్రయత్నముఁ జేసిరి. గాని వారిప్రార్థన

నిరాకరించబడినది 1803-వ సంవత్సర మక్టోబరు తే 21 దీని శాశ్వితకౌలు' సన్నద్ ముల్కియత్. ఇస్టిమిరార్‌ను నీ గవర్న మెంటువారివలన పొందిరి. వీరనేకాగ్రహారములం జేయుట యేగాక బొబ్బిలిలోను, రాజాములో నన్నసత్రములంగూడ స్థాపించి యింక ననేక ధర్మకార్యములం జేసిరి.

అప్పటి గవర్నరుగారగు సర్. తామస్. మన్రోగారు వారి యాత్రాచరిత్రలో వీరివిషయమై యీ క్రిందివిధమున వ్రాసిరి:—

"బొబ్బిలి రాజాగారు తమ జమీందారీలోని విశేష ముగా వస్త్రముల నేతగల సిరిపురమను గ్రామములో నన్ను వచ్చి కలిసికొనిరి. వీరేనుఁగుపై గూర్చుండి వచ్చిరి. వీరివెంట వీరి బావమరిదియు, నప్పటి పద్ధతులం దెలిసిన మఱియొక వకీలును వచ్చెను. ఈ రాజాగారు చుఱుకుతనముగలవారును, తెలివితేటలు గలవారును, తమ వ్యవహారమును తప్సీలుగ జూచుచు వ్యవహరింపుచున్నవారునై యుంటున్నారు. దేశ విషయమై నే నడిగిన ప్రతిప్రశ్నమునకు వెంటవెంటనె జవాబు నిచ్చుచుండిరి. వారు తమదేశము నాలుగు పరగణాలుగ విభ జింపఁబడియున్నదనియు, నందు మూడు పరగణాలలోఁ బైకము నొకదానిలో ధాన్యమును వసూలు చేయఁబడుచుండు ననియు, రైతువారీ వ్యవహారమే జరుపఁబడుచుండుననియు, కొన్నిగ్రామములకుమాత్ర మొకసారి నిర్ణయించఁబడిన పైక మే గ్రామయజమానులచే వసూలుజేయఁబడుచుండుననియు,

ప్రతిరైతుకు భూపరిమితిని, శిస్తును తెలియఁబరుచు నొక పట్టా నిచ్చుచున్నామనియు, ఆ శిస్తులు కాలమానభేదము లనుబట్టి మార్చబడకపోయినను నిరుపేదరైతులకు క్షామ కాలములలోఁ దరుచుగ వసూలుచేయఁబడక విడిచిపెట్ట బడుచుండుననియుఁ జెప్పిరి. మరియు ధాన్యపు వసూలుగల పరగణాలో నా ధాన్యమును భాగమునకుగాక పైకముక్రింద నుండు భూమియొక్క విరివిని, తరగతిని బట్టి నిర్ణయించఁబడిన రీతిని వసూలుచేయుదుమనియు జెప్పిరి. వీరు రైతులను బాగుగ బాలింపుచుండిరనుటకు వారలలో నొక్క రైతైనను వీరిపై నేకోర్టులోను ఫిర్యాదుజేయకుండుటయె రుజువుగనున్నది. వీరు ప్రభుత్వమునకు వచ్చినప్పటికిని, యిప్పటికిని, వారిదేశము లోని సాగుయొక్క తారతమ్యము నడుగగా వారి దేశమిది వరకే నోభూమికై విడిచిపెట్టబడిన తగుమాత్రపు భూమి కాక తక్కినదంతయు సాగుక్రిందికి దీసికొనబడియుండుటచేత విశేషాభివృద్ధిగలదిగ నుండలేదనియు, చెరువులు బాగుపరచ బడినందుచేత వానిక్రిందిపంట లభివృద్ధములగుటంబట్టి కొంచెము హెచ్చుగ శిస్తులు వచ్చుచున్నవనియుం జెప్పిరి. వీరిపై నేవిధమైన ఫిర్యాదును రాకుండుట వీరివలని భయముచేతనే గాని వీరి న్యాయపరిపాలనమువలనగాదని కలెక్టరుగా రభిప్రాయ పడిరి. వీరు శిస్తువసూలు కఠినముగ జేయుచున్నారు. అయి నను వీరు న్యాయముగా బరిపాలించువారనియే నమ్ముదును. అట్లుగానిచో నలుగురికిని వెళ్లుట కవకాశముగలదియు, నేవిధ

మైన యత్నము లేనిదియు నగు జమీందారీలో నొక్క ఫిర్యాదైన పిరికిలన ప్రజలకు గలిగిన భయముచేత రాకయుండునా! నా యొద్దకు ఫిర్యాదైనను రాలేదు. వీరి గ్రామములు జనాకీర్ణములుగను, సభివృద్ధిగలవిగను, నున్నవి. అయినప్పటికిని యనుకూలమైన వీరి వ్యాపారములో నొక్కటి బాగులేదని చెప్పగలను. వీరు నక్కేతర జమీందార్లతో పాటు అనధికారముగ కొన్ని యినాములను స్వంత చేసుకుంటిరని నేను నమ్ముట నకారణముగలదు."

1821-వ సంవత్సరములో రాజా రాయడప్ప రంగారావుగారు అప్పటి కలెక్టరు గవర్నరుగారి ఏజంటు వద్దనుంచి యీ క్రింద హుకుమందిరి.

---

... సాహెబు మొహర్బాక్.

దోస్తు: రాజా రాయడప్ప రంగారావు బహదరుగారికి.

---

వృషనం॥ ర మార్గశిర ॥ 2 శ॥ వారంవరకు ఖుషీని వున్నాము. మీ మాజుమా నామా వ్రాయించి పంపిస్తూ రావలెను. తే॥

ఇప్పుడు తయారవుతూయున్న దగ్గ్యలేమినుల తాలూకు తాత్పర్యం వ్రాయించి మీకు తెలిసివుండగలందుకు యిందులో బిడాయించి పంపించనయినది. ప్రసిద్ధిపొందినటువంటి పూర్వోత్తరపు జమీందార్లకు వారి తాలూకు జమీందారీలున్ను వారికి దేశంలో జరిగే మామూళ్లున్ను వారికింద శాశ్వతంగా వుంచడం

వల్ల వారియొక్క పూర్వోత్తరపు ప్రతిష్ఠను వృథపర్చవలెనని అందుల ముఖ్య తాత్పర్యము వుండివున్నది.

బదుళ్లు తీర్మానంశాయడమువల్లనున్ను, గయిరువాజి బీ వ్యవహారములువల్లనున్ను మీా జమీాదారీ విక్రయించబడి మీా కుటుంబముకు యెప్పటికి ప్రాప్తంకాకుండా పోయేటట్లు ప్రస్తుతం జరుగుతూవున్న ఘట్టమును అనుసరించివుండి జరగ తగ్గిన వ్యత్యయములు మీాకు విశదమయ్యెవున్నది. మీా జమీా దారి గవర్నమెంటువారి అనుమతంమీాద న్యాయంగా మీాగు వకరిపరం చేసుకున్నప్పుడు శివాయిచేసిన్ని మీాగు దాఖలు చేసిన వడంబడికె చొప్పున నడుచుకోక పోయినప్పుడున్ను గవర్న మెంటు వారి రజా తలబులకు మీారు తప్పి నడిచినప్పుడున్ను మీా జమీాదారీ గునహాకింద పోగొట్టుకోవడం శివాయిచేసిన్ని మరి యెప్పుడు మీా కుటుంబం వారివద్దనుంచి యితరులకు చెంద కుండా నిర్ణయించే పద్ధావతులవల్ల లభించే కిఫాయతులు మీారు విశధపర్చుకోవలసినది. యీ చొప్పున మీారు కిఫాయ తును పొందే నిమిత్తం మీా జమీాదారీ విక్రయంవల్ల నేమి వుచి తార్థంవల్ల నేమి మరియే యితరమైన సబబులవల్ల నేమి యెవరి కైనా యిచ్చివెయ్యడానికి సనదీమిలకియ్యతు యిస్తిమిందులో మీాకు వున్న అధికారం యిప్పుడు అక్కరలేకుండా చేసుకోవ డమునుగురించి మీాకు అంగీకారము అయినసంగతి లిఖిత రూపకమైన అర్జీవల్ల తెలియశాయవలసినది. యీ ప్రకారంగా లిఖితరూపకంగా తెలియచేసే జమీాదార్లు సదరున వ్రాసిన

ప్రయోజనములపట్ల నిర్బంధించడం మరిన్ని యే కోర్టులలో నున్ను ముందుగా గవర్నమెంటు వారి శలవులేనిది ఖుద్దున హాజరు కావడానకు సమనుకాబడదు. మఱిన్ని యిందులో వుదహరించిన చొప్పున అంగీకరించే పూర్వోత్తరపు జమీ దార్ల పరంగా పోలైసు ప్రయోజనములు వుంపించ గలందులకు విచారించనైనది. ప్రయోజనములు వారు తమ తాలూకా మనుష్యులవల్లనే దేశాచారం చొప్పున జరిగించగలందులకు శలవు యివ్వనవుతున్నది. మరిన్ని మోతరఫాదస్తును గురించి వక ప్రకరణం వ్రాయబడియున్నది. అందుకు నిర్ణయించ బోయే నిబంధనల చొప్పున యికమీదట ఆ దస్తునుగురించి దరోబస్తు సంగతులు ఆలోచించినమీదట అనుకూలంగా అగుపడ్డ చొప్పున గవునరుమెంటువారితరపునయినా జమీ దార్ల తరపునయినా జమశాయవలెనని విచారించనైనది.

ఇప్పుడు నిర్ణయించిన కొత్తఘట్టంవల్ల మీరు పొందే కిఫాయతులు మీరు పూరాగా ఆలోచించి అందును తాత్పర్య మున్ను దృఢకరంలో నిర్ణయించుకొన్న సంగతులున్ను ఆ కిఫాయతులను పొందడమునకు మీకు యిచ్ఛ కలిగివున్నదీ లేనిదీ పరిష్కారంగా వ్రాయించి మాకు పంపించవలసినది. మఱిన్ని మీ సంస్థానం మీ పూర్వులు యేకాలమందు సంపాదనచేసి నారో మీ కుటుంబములలో యేపరసను రాజ్యాభిషేకము అవుతున్నదో, పెద్దకుమారుడు తతిమ్మా స్వజనులను సార ఘణశాయడమునకు బాధ్యత కలిగివుంటున్నదో లేదో, విభక్తం

జరిగేటప్పుడు జమీాదారీ యెప్పుడైనా పంపకము అయినదో లేదో, ఆ చొప్పున కావడముకు ఆచారము వున్నదో లేదో, ఆ వయినమున్ను అటువంటి విభక్తములు జరుగడమునకు హేతువైన ముఖ్యమైనసంగతులున్ను అందుకు యెవరికెలవృపూచ ఆ చొప్పున పంపకము కాబడ్డదో ఆ సంగతులున్నుకూడా వ్రాయించవలసినది.

ఇందుకు మీా జవాబు ౧౮౨౧-వ సంవత్సరం డిశెంబరు దివి ౩౧ రోజుకైనా అంతకులోగానైనా పంపించగలందులకున్ను యిందులో వ్రాయించిన అనేకసంగతులను మీాకు శక్యమైనంతమట్టుకు వైనముగానున్ను పూరాగానున్ను వ్రాయించగలందులకు మీాపేర వ్రాయించనైనది. గాన ఖాతరుకు తేవలెను. దివి ౧౬ డిశెంబరు ౧౮౨౧-వ సంవత్సరం విజయనగరం కలెక్టరు వారికచేరి.

జె. స్మిత్తు అని యున్నది.

కలెక్టరు."

ఇందునకు రాజాగారిచ్చిన జవాబు.

"మెహర్బాక్. దోస్తాక్. జాక్. యి- స్మితు యిస్క్వయరు విశాఖపట్నం జిల్లా కలెక్టరు దొరగారికి.

వృషసంవత్సర పుష్య బ ౧౪ శెనివారంవరకు బొబ్బిలిలో ఖుషీనివున్నాము. మీా ఖుషార్నామా వ్రాయించి పంపిస్తూ రావలెను. త॥

ఇప్పుడు తయారు అవుతూయున్న రిగ్యులేషన్ల తాత్పర్యంతో వృషసంవత్సర మార్గశిర బ ౭ శనివారం తారీఖున మీరు వ్రాయించి యిప్పించిన ప్రత్త్రరంసంగతులు విశదపర్చుకోవడమయినది. పెర్మనెంటు కవులుతాలూకు సెం ౭ వ మూలంగా మాకువున్న అధికారము అక్కర లేకుండా చేసుకున్న పక్షమందున సర్వకాలానకున్ను మా కుటుంబములోనుంచి మా సంస్థానం అన్యాక్రాంతం కాకుండా వ్రాయవలెనని మహారాజ శ్రీ గవర్నమెంటువారికి కలిగివున్న అభిప్రాయము మీరు అంపించిన రిగ్యులేషన్ తాత్పర్యాంవల్ల మాకు బోధపడ్డది. ఈ కొత్త పట్టముకు అంగీకరించినందువల్ల మాకు జరూరయినప్పుడు జమల్లో పొందకపోవడం మొదలయిన కొన్ని బాధకరాలు వున్నప్పటికిన్ని దయసమానులయిన గవర్నమెంటువారి అభిప్రాయానుకూల్యంగా ప్రవర్తించినవారు దయసహాయం కలిగే వుంటారని మాకు తోస్తూవున్నందున మా సంస్థానం యేవిధంచేతనైనా యెవరికైనా యిచ్చివెయ్యడానకు మాకువున్న అధికారము అక్కరలేకుండా చేసుకొని యీ రిగ్యులేషన్ మూలంగా కనపడుతూవున్న గవర్నమెంటువారు దయచేసిన సహాయతులను పొందవలెనని మాకు పూర్ణంగా యిచ్ఛకలిగివున్నది. అయితే యిప్పుడె ఆ చొప్పున అర్జీ యెందుకు వ్రాయకపోవలెనంటె అందుల హేతువులు వినయంగా మనవి చేసుకుంటున్నాము. యీ కొత్తపట్టముకు మేము వప్పినపక్షమందుననైనా మోతరఫాయనకు దస్కుశాయడమో ఆ సంగతి వెనుకనుంచి

నిర్ణయించడం అవుతున్నదని వ్రాసివున్నదిగాని యీసరికి జరుగుతూవున్న మామూలుప్రకారం మోతరఫా మాపరంగానే వుంపించగలందులకు గౌనరు యిన్ కౌన్సిల్ వారి ఆలోచనలో దృఢపర్చబడ్డట్టు మీరు అంపించిన రిజ్యులేషన్ భాగములెల్ల యెక్కడా కనపడలేదు. 1820-వ సంవత్సరం ఆగష్టు తే 7 దీని రివిన్యూబోర్డువారు మీ పేర వ్రాయించినప్రకారం మోతరఫా శిస్తుపైకం మాకు ముజరాయిచ్చి గౌనరుమెంటువారి తరఫు నవుకర్లవల్ల ఆ మోతరఫా జమచేయించేపక్షమందు మాకు చాలా కుందకం సంభవిస్తుంది యెందునుంచి అంటే ఆ మోతరఫా పన్ను యిచ్చే ఆసామీలు అనేకమంది గౌనరుమెంటు వారికి శిస్తుయిచ్చే జిరాయితీ భూములలో యిళ్లు కట్టుకొని వున్నారు. సదరహీ జిరాయితీభూములలో నేమి స్వాస్థ్యపుస్థలాలలో నేమి మోతరఫా యిచ్చే ఆసామీలు యిళ్లుకట్టడునే నిమిత్తం వ్యవహారములుచేసేనిమిత్తం వుచితరూపకంగానున్ను, తక్కావీ రూపకంగానున్ను విస్తరించి ద్రవ్యము యిచ్చివున్నాము. ఇంతేకాకుండా మోతరఫా పన్ను చెల్లించే ఆసామీలలో అనేకమంది మావద్ద తక్కావీలువుచ్చుకొని జిరాయితీ భూములలో వ్యవసాయములు చేస్తూవున్నారు. గనుక మా తరఫు మోతరఫా యిలాకావాళ్లకు తప్పినపక్షమందు వ్యవసాయములు శాయడం మానుకుంటారు. ఇదిగాక మోతరఫా కట్టే రహితులున్ను గవర్నమెంటువారికి పన్నుయిచ్చే భూముదున్నే రహితులున్ను కూడా మా యిలాకాలో వున్నందున

తాత్పర్యం యిప్పుడు వినయంగా మనవిచేసుకునేది యేమం టే మామూలుప్రకారం మోతరఫా మాపరంగానే వుంపించి గన్న నసుమోటువారి శెలవుప్రకారం నడుచుకునే జమీదార్లను యిప్పుడు తయారు అవుతూవున్న రిగ్యులేషన్ల మూలంగా లభింపచేసే ఫాయదాలు యిప్పటికిన్ని జర్గలాగున మాకే అనుగ్రహ పూర్వకమైన దస్తావేజు దయచేయిస్తామన్న పక్షమందున మా సమస్థానం విక్రయంవల్లనేమి, వుచితార్థం వల్లనేమి, మరియే యితరమైన సబబులవల్లనేమి యెవ్వరికైనా యిచ్చివేయడానకు సనదీమిలకియ్యత్ యిస్తిమిరారంలో మాకు వున్న అధికారము అక్కర లేకుండా లిఖితపూర్వకమైన ఆజ్ఞ వల్ల మనవిచేసుకుంటున్నాము. ఇదిగాక మా సంస్థానం పూర్వా సంపాద్యంకావడము మొదలయిన సంగతులు వినయంగా మనవిచేస్తున్నాము. ఏమంటే మాకు కూటస్థులు మహా రాజశ్రీ సర్వజ్ఞ సింగారాయనింగారు. ఆయనమనుములు అయిన ధర్మారాయనింగారు అప్పటికి సర్వాధికారి అయిన హైదరా బాదు నబాబుగారి కార్యకర్తల్లో బహుగా అక్కరకు వచ్చినందున చాలా అనుగ్రహించి తమకు లాయఖు అయి వుండే తెల్లఝుండా, ఢంకా, నౌబతు మొదలయిన గొప్ప బిరు దులు, ఘనమైన కితాబులు దయచేసి బొబ్బిలిసంస్థానం ధర్మా రాయనింగారికి ఆ నవాబువారు బహు దీర్ఘకాలముక్రిందటను దయచేసినారు. జ్యేష్ఠానుగుణ్యంగానే రాజ్యం దఖలుపడుతూవుం డడం మాలో ఆచారం కలదు. యీ సరికి యీ సంస్థానం

యెన్నడూ ప్రపకంగా లేదు. సంస్థానంశ్రేయస్సుకోరివున్న స్వాజన్యాన్ని సంరక్షణ శాయడమునుగురించిన బాధ్యత పెద్దకుమారునికి కలిగివుండడం మాలో ఆచారమె. సమస్థానమున్ను సమస్థానానికి లాయఖు అయిన సరంజామున్ను శివాయచేసి లోతక్కిన యావత్తు ద్రవ్యానకు పెద్దకుమారునితో తతిమ్మా కుమాళ్లు సమాన అంశభాక్కులె గనుక యీ సంగతులు తమరి విశదం కాగలందులకు వ్రాయించడం అయినది. ఈ సంస్కారం మీా సిఫారస్సుతో మహారాజశ్రీ గౌనర్ యిన్ కౌన్సిల్ వారి సన్నిధికి అంపించవలెనని కోరుతూవున్నాము. గాన ఖాతర్వా చేవలెను.”

సంతకం వున్నది.”

---

ఈ రాజుగారు కీపురమునందు శ్రీవేణుగోపాలస్వామి వారి దేవాలయము గట్టించ నారంభించి యది పూర్తికాక మునుపే స్వర్గస్థులైరి. వీరికుంగిరాడయిస్టేటును యంబన్నవలస యను గ్రామమును గొనిరి. వీరు ముగ్గురుభార్యలను వివాహము జేసికొనిరి. అందులో నిద్దరిం జిత్రముగ నేకకాలమందు పాణిగ్రహణము జేసికొనిరి. అదెట్లనిన:—

మొదట వీరు సీతానగరములోని చెలికానివారి చిన్నదానిని వివాహమాడుట కేర్పాటుచుకొని యేకారణముచేతనో యా చిన్నదానిని వివాహమాడక తెల్లాములోని యినుగంటి వారి చిన్నదానిని పెండ్లియాడ నిశ్చయపరచుకొనిరి. ఈ వివాహము జరుగునాటిరాత్రికి ముందుగా సాయంకాలమున

మొదట నేర్పరచుకొనిన చిన్నదానితండ్రియు, సోదరులు నా మెను పల్లకీయం నెక్కించుకొని తీసుకొనివచ్చి దర్వాజాయెదుట సవారీదించి కత్తులం దీసికొని యిరుపార్శ్వముల నిలువంబడి యుండిరి. ఈ పిల్లను మీరు వివాహముచేసుకొననిపక్షమున నీపిల్లం జంపుటయేకాక మేము నీ దర్వాజాయెదుట ప్రాణ త్యాగముం జేసికొనియెదమని చెప్పిపంపిరి. రాజుగారు తా మాపిల్లను వివాహమాడుటకు నిరాకరించినచో వారలనిసంత పనిజేయుటలో సందియము లేదని తలంచి యిద్దరకన్యల నేక కాలమున వివాహమాడుట కొప్పుకొని వారలం గోటలోనికి రప్పించిరి. ఇద్దరిని వివాహముం జేసుకొనుటకు శెలవిచ్చినందుకు వార లంగీకరించుచు, దమకన్యకు ప్రథమతః మంగళసూత్ర ధారణము జేయుమని కోరిరి. ఇందుకును రాజుగారు ఒప్పిరి. సుముహూర్తసమయమున రాజుగా రిద్దరిమధ్యను నిలుచుండి ముందు మొదట నిశ్చయించంబడిన కన్యకకును, నావల రెం డవయామెకును మంగళసూత్రధారణముం జేసిరి. అవి పూర్వ కాలపుదినములు గనుక నిటులం జెల్లెను.

మొదటిభార్యయగు లక్ష్మీచల్లయ్యమ్మగారికి నలుగురు కుమారులు, నైదుగురు కుమార్తెలును జన్మించిరి. రెండవ భార్యయగు బుచ్చయ్యమ్మగారి కొక్క కుమార్తెయే జన్మించెను. కొన్ని సంవత్సరము లిట్లు సుఖముగ నుండినపిదప రెండవభార్య గారు కాలధర్మము నొందిరి. ఆపైని రాజుగారు వావిలవలసలో నున్న యినుగంటివారి కన్యయగు లక్ష్మీనరసయ్యమ్మగారిని

సీ॥ నాల్గైదుపచ్చళ్లు నాల్గైదూరుగాయలు నాల్గైదుకూరలును
సన్న | బియ్యపుటన్న మొప్పిదమైనపప్పుకమ్మనియింటినేయి
చిక్కనగుచల్ల | గుమ్మడివడియముల్గూర్చియింగువజేర్చిపాగి
చినకలఁగాయపులుసుచేసి | సమయోచితఫలంబులమలతరం
బుగానింటనాడించినయిక్షురసము | విడెమువాచవిదినుసు
లెప్పుడునుగుడుపు | ద్వాదశీపైత్రకాదులదక్షిణలిడి | పండి
వంటలతోవిందుబెట్టునౌర | రాయఁడపరంగరాయభూనా
యకుండు॥

చ॥ కలిగినవారిసత్రములగమ్మనిభోజనమబ్బుగానిబ | గ్గులికలు
గానోనర్పఁబడిగుమ్మడిపల్కులలంకజడిప | ల్కులుసురితాం
డ్రలోనయినక్రొత్తరుచుల్పొడికాయలబ్బునే | పోలుపగు
రాయఁడప్పవిభుబొబ్బిలిసత్రమునందుదక్కఁగాన్॥

మ॥ విజితాత్రేయకళాకమైతగుతపర్వదేవసంతర్పణా | బుజగిద్వి
శ్రుతినాలకించిపలురూపుల్వానిచంద్రుండుస్వ | ద్విజరాజత్వ
ముసార్థకంబుగసుత్రస్తిం జెందివాహ్యాళిలో | గజరాజత్వము
నొందెరాయఁడపరంగారాయరాట్కీర్తికిన్॥

చ॥ అడవులయందుఁబర్వతములందువసంబులయందు నెందునుం |
బొడమినతేనెపట్లొరులుముట్టకయుండఁగనాజ్ఞవెట్టియీ |
పుడమిఁగలట్టియిట్టిబలుపున్నియపుంబనులాచరించిరా | యఁ
డపసమాఖ్యరంగవిభుఁడంగదలన్ విడళించెనుర్వికిన్॥

శా॥ ఆశాపాలజనార్దనాంశజనితుండైనమ్మహీశుండుశ్రీ | కాశీ
యాత్రకుఁబోవుచున్నపుడువేడ్కంగాళహస్తీశుమా | ధీశుం

దోడ్పా న్నివచ్చి వీడ్కొలిపెమత్తేభంబునశ్వద్వయిర్ । దేశా
చారముక్రీత్రిఖిల్లతును బ్రీతింబంపిమన్నింపుచున్ ॥

(మం॥ పా॥ కవి.)

---

పిదినములలోనే ప్రస్తుతపు సంగంవలస జమీందారుగా
గు మృత్యుంజయ నిశ్శంకులు బహదరుగారి తండ్రిగారిని,
బాల్యమున గొన్ని సంవత్సరములవరకును సంరక్షించిరి. వీరు
1830-వ సంవత్సరము జనవరు తే 17 దీని వైకుంఠవాసులైరి.
వీరి కుమారులెవరనగా జ్యేష్ఠులు రాజా శ్వేతాచలపతి రంగా
రావుగారు, ద్వితీయపుత్రులు, రాజా జనార్దన రంగారావుగారు,
తృతీయపుత్రులు రాజా సీతారామచంద్ర రంగారావుగారు,
కనిష్ఠులు రాజా వెంకట రంగారావుగారునై యున్నారు.

---

## IX-వ పురుషులు.

## రాజా శ్వేతాచలపతి రంగారావు బహదరుగారు.

## (1830—1862.)

---

ఈ రాజా శ్వేతాచలపతి రంగారావుగారు 1810-వ
సంవత్సరం ఆగష్టు తే 15 దీని జన్మించిరి. ఈ కుటుంబచరిత్రలో
వీరి రాజ్యపరిపాలనకాలమే ముఖ్యమైనదియు, దీర్ఘమైనదియునై
యున్నది. వీరు రాజ్యమును బాగా పరిపాలించుటయేకాక
తమ తండ్రిగారివలన స్థాపించబడిన సత్రములు మొదలైన
ధర్మకార్యము లభివృద్ధికిం దెచ్చిరి. వీరు తమ తండ్రిగారి

య్యుద్దేశప్రకారము వారివలనఁ బ్రారంభింపఁబడిన దేవాలయమును బూర్తిచేయించి 1837-వ సంవత్సరమున శ్రీరుక్మిణీ సత్యభామా సమేతులైన శ్రీవేణుగోపాల కృష్ణస్వామివారి నంపు బ్రతిష్ఠించిరి. ఈ స్వామివారికి రూ. 10,000 లు రాబడిగలిగిన భూములను సమర్పించుటయె గాక బొబ్బిలి సంస్థానములోని సీతారామపురము గ్రామమునందు బ్రతిష్ఠింపఁబడిన శ్రీసీతారామస్వామి వారికి నటులనే సమర్పించిరి. 1832-వ సంవత్సరమున విశాఖపట్టణము, గంజముజిల్లాలలో జరిగిన యుపద్రవకరమైన యల్లరలలో కంబర వెంకట్రాయుఁడు మొదలైన పితూరీదార్లం బట్టికొని యప్పటి స్పెషల్ కమిషనరుగారైన రసల్ దొరగారి కొప్పగింతజేసిరి. ఇందువిషయమై 1834-వ సంవత్సర నవంబరు తే 18 దీ రసల్ దొరవారి రిపోర్టుయొక్క 60-వ పుటలో నీవిధముగ వ్రాయఁబడియున్నది:—

"ఈ విషయమున నేకాక తదితర కార్యములయందు గావలసిన పని జరుగుటకు గొంత ద్రవ్యమును బహుమతిగ నిచ్చెదమని యాశ బెట్టినప్పటికి నా కార్యములు కాకపోయినను నేను పాలకొండలో నుండఁగా ననేకపర్యాయములు నన్ను వచ్చి చూచిన బొబ్బిలి జమీందారుగారిని పల్లికధికార స్థాపనము కొరకు వారియొక్క బలమైన సహాయమును గనపరచుమని నేను ప్రోత్సాహపరచఁగా నొక మాసములోగానే కంబర వెంకట్రాయుని, వాని యల్లుఁడగు నప్పారాయునిం బట్టుకొనిరి. అట్టి తమ ప్రవర్తన విశేష ఘనత కెక్కునటుల వాండ్లనుబట్టి

యొప్పచెప్పి వారికిచ్చుట కేర్పరుచఁబడిన బహుమతిని మర్యాదా యుక్తముగ నక్కరలేదని జెప్పుచు శ్రీగవర్నమెంటు వారికి మేము చేయవలసినపనిని జేసినామేగాని బహుమతినిగోరి చేయ లేదని చెప్పిరి. కమానుగారినుండే జడ్జిగారియెదుట వాండ్లు 1828-వ సంవత్సరములో జరిగించిన ఘోరమైన ఖూనీ నేరము లకు న్యాయముగానే విచారణఁ జేయఁబడుదురు."

అప్పటి గవర్నరుగారగు ఘనతఁజెందిన సర్. ఫ్రిడరిక్. యాడెముగారు 1835-వ సంవత్సరం జూన్ తే 30 దీ గల రిపోర్టుయొక్క 27-వ పేరాలో స్వయముగ నిటుల వ్రాసిరి:—

"బొబ్బిలి జమీందారుగారు తమ దివానైన సీతారామయ్యను వెంటఁబెట్టుకొని పాలకొండలో నన్ను వచ్చిచూచిరి. పైరప్రస్తుతమైన విషయమయ్యె 'రసల్' దొరగారు తమ రిపోర్టులలో గంజాము విశాఖపట్టణము జిల్లాలలో జరిగిన పితూరీల సంబంధములో స్తుతియించిరి. కమిషనరుగా నుండిన రసల్ దొరగారికి, విశేషోత్సాహముతోను, రాజభక్తితోను, తాముచేసిన సహాయమునకు గవర్నమెంటువారు మంచి యభిప్రాయము గలిగియున్నారని వారితోఁ జెప్పితిని. ఇందులో ముఖ్యముగ నీ భాగములలో మా యధికారము నిరంకుశముగ జరుగుటకు గారణమైనందుకును, పూర్వపు పాలకొండ దివానుండుపి ప్రసిద్ధికెక్కిన కంబరు వెంకటరాయుని, యతని యల్లునిం బట్టి యొప్పజెప్పినందుకు నేను వారిని ముఖ్యముగ మెచ్చుకుంటిని. మరియు నిట్టి ఘనకార్యముం జేసినందు కిచ్చుట కేర్పరుచఁ

బడిన బహుమతిం గేవల గౌరవార్థబుద్ధితో నిరాకరించినం దుకును ముచ్చటించితిని. ఇంతియె కాక మా యధికార స్థాపనముకొరకు రసల్దారగారికి తమ స్వాంతజనమును బత్తెములను, ఖర్చులం దామే పూనుకొనుచు సహాయమిచ్చినందుకును మెచ్చుకొంటిని. రసల్దారగారితోఁ జెప్పినట్టులనే విధిగాఁ జేయవలసిన పనినిమాత్రముం జేసితిననిన్ని రసల్దారగారు జరిగించిన పనులవలన నిట్టిపని పితూరీదార్లను నేరస్థులను మరించి చేసికొనవలసిన యవసరము లేదనియు, అల్లరలన్నియు నణఁగిపోయినందుకు నిస్సందేహమనియు వారుచెప్పిరి. రసల్దారవారి నంపించుటకుఁగల యుద్దేశము గవర్నమెంటువారి యధికారమును పద్ధతులను స్థాపించుట కొరకునియు నేరస్థులకు సహాయమును, ఆదరణమునుగలుగఁజేసినవారలను శిక్షించి, యితరులకు దృష్టాంతమగునట్టులఁ జేయుటకనియు వారికిఁ దెలియఁజేసితిని. నేరముచేసిన ప్రతివారిని న్యాయరీతిని శిక్షించుటకును పితూరీలం జేసిన వారలం గఠినముగ శిక్షించుటకును గవర్నమెంటువారి నిశ్చయమని జెప్పితిని. ఇదివరకు నడచినట్టులనే యితర జమీందారులకు దృష్టాంతమగునట్టుల తాము నడచెదరని గవర్నమెంటువారు తలఁచెదరనియు, దేశములో నెమ్మదిని, యధికారమును, నిర్వహించుటకు దమ శక్తికొలంది మేజస్ట్రీటువారికి సహాయముం జేయుదురనియు, గవర్నమెంటువారు నమ్ముచున్నారనియుం జెప్పితిని. శ్రీగవర్నమెంటువారి మెప్పును, జమీందారుగారి కేవిధముగనైతే మిగుల సంతుష్టి

కరముగ నుండునో యటులనే కలెక్టరు ద్వారా నంపించవలయునని నే దలఁచెదను."

ఇందు కనుగుణముగ శ్రీగవర్నమెంటువారు రెవిన్యూబోర్డువారికి వ్రాసిరి. అందుపైని రెవిన్యూబోర్డువారి యుత్తరువున నప్పటి కలెక్టరుగారు 1835-వ సంవత్సరం అక్టోబరు నెల 29 తేదీగల తమ యుత్తరముతో గవర్నమెంటువారి ప్రకటన నంపెను. అందులో శ్రీగవర్నరుగారు వీరు చేసిన ఘనకార్యములను విశేషముగ మెచ్చుకొనిరనియు శ్రీగవర్నమెంటువారి వలన దేశమున సుస్థితి కలుగుటకు వీరు మేజస్ట్రేటువారికి జేసిన విశేష శ్రమసాధ్యమైన సహాయమున కితర జమీందారులు వీరితో సరిపోల్పఁబడరనియు వ్రాసిరి. 1856-వ సంవత్సరములో గంజాముజిల్లాలో జరిగిన యల్లరులవిషయమై యాజిల్లా కలెక్టరుగా రీవిధముగ గవర్నమెంటువారికి వ్రాసిరి:—

"విజయనగరము, బొబ్బిలి రాజాగారులు నేను కోరిన తక్షణమే వారి తాలూకు కొండవాండ్లను, సరదారులను, ఇంక నితర మనుష్యులనుఁ బంపించిరి. వారలు నాకుమిగులఁ దృప్తికరముగునటులఁ గష్టపడిరి. కావున నా రాజాగార్లవిషయమై గవర్నమెంటువారి దయను విధేయతతో మనవి వ్రాసికొన్నాడను." ఈ యుత్తరముయొక్క నకలునప్పటి కలెక్టరుగా రంపించుచు కోరినవెంటనే చాలినంత సహాయమును వీరిరువురుం జేసినందుకు గవర్నమెంటువారు మెచ్చుకొనిరనియు వ్రాసిరి.

నెం 40 రు.

రాజా సాహెబ్. మెహర్బాన్. దోస్త్.

రాజా శ్వేతాచలపతి రంగారావుబహదరుగారికి.

*　　*　　*　　*　　*　　*　　*

మీతండ్రిగారు సజీవులై వున్నప్పుడు మీరు యీవైపు నుంచి బొబ్బిలి వెళ్లేటప్పుడు విజయనగరము కోట దేవిడీ యింటి నుంచి వెళ్లదలంచుకొన్నమీదట అప్పట్లో జరిగిన సంగతులు వుదహరించిన్ని యేయే కార్యములనుగురించి యీ బ ౨ లు రోజున విశాఖపట్టణము ప్రవేశించడమవుతున్నది గనుకనున్ను మీ పూర్వీకులు యిచ్చట ప్రవేశించేటప్పుడున్ను యింటికి వెళ్ల గలందులకు యిక్కడనుండి బయలుదేరేటప్పుడున్ను దఫా 1 కి 15 నిసబున ఫిరంగులువేసే మామ్మూలు కలదు గనుకనున్ను, ఆ చొప్పున ఫిరంగులువేసేలాగు వుత్తరఖండం కమాండింగు ఆఫీసరు వారిపేర వుత్తరము వ్రాయించవలసినదనిన్ని యీ నెల ది 13 తారీఖుకు సమమైన వికారి సం॥ ర వైశాఖ బ॥ 30 సోమవారం తారీఖున మీరు వ్రాయించిన వుత్తరము ప్రవేశ మైనది.

*　　*　　*　　*　　*　　*　　*

మీ రెండోదరఖాస్తునుగురించి మీ ప్రవర్తన సదా సర్కారువారికి హర్షమై వుంటూవున్నది గనుకనున్ను, మీ పూర్వులకు సదరుప్రకారము ఫిరంగులువేసే మర్యాద జరిగించడపు ఆచారమువున్నట్టు మాకు బోధపడ్డది గనుకనున్ను,

మీరు విశాఖపట్టణము వచ్చేటప్పుడు వక మజిలీ వ్యవధానము వుండగా మీరు యిక్కడ ప్రవేశించేకాలము యెప్పుడు అయినది మాకు తెలియచేస్తే సదరుప్రకారము మీరు వచ్చేటప్పుడున్ను, వెళ్లేటప్పుడున్ను పది హేనేసి ఫిరంగులు వేయించ దగుమర్యాద జరిగించగలందులకు జనరల్ దొరగారిపేర వ్రాయించుకున్నది. గానఖాతరుకు తేచలెను.

విశాఖపట్టణం మేజస్ట్రీటు ఆఫీసు.

ది 20 మెయి॥ 1839 సం॥ రం.

ఆర్ బత్ నట్ అని యున్నది.

మేజస్ట్రీటు.

తర్జుమా. చెన్నాప రామయ్య అనియున్నది.

అ॥ మేనేజరు.

---

ఈ ఫిరంగులు వేయువిషయమునకే 1808-వ సంవత్సరము॥లో మేజర్. జనరల్. గవ్వడీదొరగారు రాజా రాయడప్ప రంగారావుగారికి వారు విశాఖపట్టణమునకు జేరునపుడు మామూలు ఫిరంగులను వేయుచుటకు కమాండింగు ఆఫీసరు గారికి ఉత్తరువు చేసితిమని వ్రాసిరి.

---

స్మాలెట్ దొరగారు కలెక్టరుగా నున్నప్పుడు 1857-వ సంవత్సరములో నాదొరవారు విజయనగరం, బొబ్బిలి రాజాగారులకుగల వివాదలను శ్రీగవర్న మెంటువారి యుద్దేశప్రకారము రాజీచేసి వారికి రిపోర్టు సంపగా వారీ క్రిందివిధమున కలెక్టరుగారికి జవాబంపిరి:—

"శ్రీగవర్నరుగారును, వారి సభవారును యిద్దర జమీందారులకుంగల వివాదాంశము లతితృప్తికరముగను, గౌరవముగను, రాజీ జరిగినందుకు గవర్నమెంటువారి సంతోషము నా జమీందార్ల కిద్దరికిని కలెక్టరుగారు తెలియపర్చవలసినదనియు నీ విధముగ నా గొప్ప జమీందార్లకుండు వివాదలను దృప్తికరముగఁ బరిష్కరించుటలో కలెక్టరుగారు చేసిన పనికి నిండుగ నామోదించితిమనియు వ్రాసిరి."

---

రీస్ దొరగారు కలెక్టరుగ నుండునపుడు 1858-వ సంవత్సరములో రాజా శ్వేతాచలపతి రంగారావుగారికి క్రింది విధమున వ్రాసిరి:—

"ఈ మధ్య నేను మీ జమీందారీలో కమాను చేయుచుండినపుడును, బొబ్బిలిలో మకాముఁ జేసినపుడును, మీ దేశముయొక్క, ప్రజలయొక్క, స్థితిగతులం గనిపెట్టితిని. మీ పురాతన యిష్టేటులను మీరు వ్యవహరించువిధము నేను వినినంతవరకు నాకు బహు తృప్తికరమైనది. తక్కినచోట్ల లేనితృప్తియు, నైకమత్యమును, మీ దేశపు ప్రజలకుం గలిగినందుకు సంతసించితిని. మీ జమీందారీలోఁ బోలీసువారి కే విధమైన పనియుం గలిగియుండినట్లు లేదు. నేరములు జరుగుచుండినట్లు దెలియలేకపోవుటయేకాక నన్నిచోట్లను సాధారణముగఁ జరిగెడి స్వల్పనేరములు సహా జరుగనందున మీయొక్క నేర్పుగల వ్యవహారమే యిందుకు కారణమైనందుకు తృప్తినొంది

నిసి. పురోహితులకు సహా తగాయిదా లున్నట్టు దెలియరాలేదు. జమీందారీ వ్యవహారవిషయమునైతేనేమి, మీ స్వంతవిషయమునైతేనేమి యొక్క యజ్ఞమైన, యీ ముసాఫరీలో నాకు గాలేదు. ఈ ప్రకారముగ వ్యవహారము జరుగుచున్నందుకు తమ యొక్క తమక్రింద వ్యవహరించు వారియొక్క యోగ్యతకు చాలా సంతోషించితిని. ఇంత సమృద్ధికలిగియుండిన విషయమును శ్రీగవర్నరుగారికిని, వారి సభవారికిని విశదపరచక యుండను."

అటుపైని సెక్రెటరిగారు శ్రీగవర్నమెంటువారికి వ్రాయగా వారు బొబ్బిలి రాజాగారి ప్రశస్తవిషయములకును, వారి జమీందారీని పరిపాలనఁజేయు నేర్పునకును మెచ్చుకొని మంచి యభిప్రాయముం గలవారైరి.

---

ఈ రాజాగారనేకమైన యెస్టేటులం గొని జమీందారీని వృద్ధిఁజేసిరి.

(మాడుగులు జమీందారీలోనుండి.)

మాడుగులు జమీందారుగారివలన దేవసురవరమును, జగన్నాథపురమును, వీటి ముఖాసలు వంతర్లపాలెము అప్పలరాజపురమునున్ను, పప్పుసెట్టి శేకనిన్నీ కొనిరి. చీడికాడ జగన్నాథపురమను యెస్టేటును మండపాక జగన్నాయకులవద్దం గొనిరి.

(గంజముజిల్లాలోనుండి.)

కరకవలస, మునగవలస, యను నలువదియైదు గ్రామములుగల మాలుగు జారీ యెస్టేటును తనఖా కట్టుకొని యీ యెస్టేటుదార్లైన మకిటపల్లి వెంకన్న, చినకామన్నలకు, వీరు కొంత ద్రవ్యమును బదులిచ్చిరి. పిమ్మట వీరికుమాళ్లు రాజా సీతారామకృష్ణ రాయఁడప్ప రంగారావుగారివలన నివి కొనఁబడినవి. కిలబరిగి భాస్కర నరసింగిరావుపంతులుగారు కంతలి, మరెతిన, హుండాలు కొనఁబడినవి.

(విజయనగరము జమీందారీలోనుండి.)

పల్లెకు వేలములో జంపెన విజయరఘువర్మనాథరాజు గారి తాలూకు అన్నమరాజుపేట, కొత్తవలసయను మొఖాసా గ్రామములు కొనఁబడినవి. దంతులూరివారివద్ద తుమ్మపాల యను మొఖాసా గ్రామమును. తిరుమల వద్దంటి అయ్యవార్లం గారివద్ద జమ్ము, గుజ్జంగివలస, అంబటివలస, సువ్వామును మఘ రలసహితముగను, చింతపల్లిపేట, శేరీపేటయు, 1843-వ సంవత్సరములోఁ గొనఁబడినవి.

---

మీఁద నుదహరించఁబడిన కలెక్టరుగారు బొబ్బిలివారికిని, విజయనగరమువారికిని జేసిన రాజీప్రకారము తుమ్మపాల, అన్నమరాజుపేట మొదలగు నేడుగ్రామములు విజయనగరము వారికి 1858-వ సంవత్సరములో శాశ్వతకవులున చేయఁబడి

సని. ఆ రెస్తు చెల్లుటకు విశాఖపట్టణపు కలెక్టరుగారే జవాబుదారులై యుంటున్నారు.

ఆ రాణీనామాకాకితముల నంపించుచు కలెక్టరుగారీ క్రిందివిధముగ వ్రాసిరి:—

“[illegible]

ది రాజా ఆఫ్ బొబ్బిలిగారికి.

మీరున్ను, విజయనగరము రాజుగారున్ను వచ్చే డిశంబరునెలలో నా శిబిరాన్ని గలిసికొనుట నాకిష్టమైయున్నది. ఆ రాజాగారు మిమ్ము కలిసికొనుట తనకు కిష్టమనియు, గతించిన మనోమాలిన్యములన్నియు మఱవవలసినదనియుం జెప్పుచున్నారు. ఇందుకు మీరు సమ్మతింతురని నా నిశ్చయము. ఇట్టి తృప్తికరమగు సంగతికి నేను కారకుండుగా నుండుటయు నాకు మిగుల సంతోషముగ నున్నది. విజయనగరపు రాజుగారు స్వయముగ మీయందు స్నేహముగలిగియుండుటకు నిండా యభిప్రాయము గలవారై యున్నారు. ఇంక మీరు నట్టియభిప్రాయమునే గలిగి యీ యుత్తరమునకు ప్రత్యుత్తరము నంపుదురని నిరీక్షించుచున్నాను.

సి. డబ్లియు. కీన్ అనియున్నది.

గవర్నరు యేజెంటు.”

---

[అయిన నిష్కర్షరుపఁబడిన కలయిక కొన్ని మర్యాదల
హెచ్చుతగ్గులవలన జరగఁబడ లేదు.

---

ఈ రాజాగారు తమ బావమరుదులైన రాజా యినుగంటి రామారాయనింగారికి ఉంగరాడ, కింతలి, మెంటినహుండాలను, రాజా యినుగంటి రాజగోపాలరాయనింగారికి చీడికాడ, జగన్నాథపురము హుండాలనిచ్చి వారి నాయిస్టేటులకుం బ్రాప్తిటర్న్లుగం జేసిరి. వీరిలో రెండవవారు సంతానవంతులైనందున వారి భార్యయు, రాజాగారికి సోదరియునైన గోపయ్యమ్మ గారి యనుమతిమీద చీడికాడ, జగన్నాథపురము, యిస్టేటులను మరలం దీసికొని రాజాగారింకొక సోదరికిం గుమారుండైన వావిలవలస యినుగంటి పెద సీతారామస్వామిగారికి నిచ్చిరి.

ఈ రాజాగారు బహు దయారసమును, దాతృత్వముం గలవారు. అనేకుల కగ్రహారములను, భూములను. యినాములుగ నిచ్చిరి. వీరు మతవిషయమున నిండా పట్టుదలగల వారు. రోజుకు మూడు పర్యాయములు, అనఁగా ప్రాతఃకాలమునందును, భోజనాత్పూర్వమందును, సాయం సధ్యయందును, దేవాలయమునకు వెళ్లుచుండిరి. వీరు శైవభక్తికిం బ్రఖ్యాతుసి మాడ్కి సంచరించిరి. వీరనేకులకు ననేక శాస్త్రాదిగ్రంథములం జెప్పించిరి.

వీరాపత్సయమున ననేకులగు జమీందార్ల కప్పుల నిచ్చి, వారిం గాపాడినందుకు కార్మైకల్ దొరవారు తమ జిల్లా మాన్యుయలులో నిట్లు వ్రాసిరి:—

"బొబ్బిలివారివద్ద తీసికొనఁబడిన ఋణములవలన ననేక సంవత్సరములుగా ఈ జిల్లాలోని సగము యిస్టేటులు గుణహా క్రింద దాఖలు కాబడకుండను, చెడిపోకుండను తప్పించబడినది."

ఈ రాజాగారు త్రవ్వించిన యనేక చెరువులకును, వేయించిన తోఁటలకును, తమ తండ్రిగారియొక్కయు, సోదరుల యొక్కయు నామధేయములనే యుంచిరి. 'వేణుగోపాలవల్లభమను' తోఁట వీరినాఁడె 1855-వ సంవత్సరములో విశేష కర్చుబెట్టి వేయించబడినది.

(ప్రవృత్తి, నివృత్తి, సీసమాలిక.)

ప్రవృత్తి[illegible]ము.

సీ॥ శ్రీమంతుఁడగుచుఁ దనకీర్తి మాన్యుఁఖలు ధర్మసాధనమను ధర్మమె
ఱిఁగె । మంచిపద్యాలఁ బెక్కమంగినిఁ బెంచియనేకౌషధ
ములఁ జేయించినాఁడు । పరివారజనులకుబంధువర్గములకా
శ్రితులకుఁ గోపులకితర దేశ । వాసులకు స్వదేశవాసులకడి
గినవెంటనే ముందులిప్పించినాఁడు । బహువిధగ్రంథముల్
బహుదేశములను వెదకించి తెప్పించి వ్రాయించినాఁడు । పలు
విద్యలాశ్రితులైన కవులకుఁ గాంచ రాత్రింబుఁ జెప్పించినా
డు । వింతవృత్తాంతముల్ విని యెంతవెలకైన మంచివస్తువులర
ప్పించినాఁడు । పైదేశములవింతపనులెల్లఁ బరివారిసంచయంబు
నకు నేర్పించినాఁడు । పెక్కుపుష్కరిణులు పెక్కుకటాకముల్
పెక్కుకాలువలుఁ ద్రవ్వించినాఁడు । పెక్కగ్రహారములు పెక్కు

మొఖాసాలు పెక్కండ్రకిచ్చి పెంపెక్కినాడు । తనతో విరోధించి తన యాజ్ఞ మీరిన క్రించుల నెల్ల సాధించినాడు । ధనధాన్యములు సమృద్ధములుగా నెల నెలకిప్పించి పోష్యుల నేలినాడు । వర్ణాభిమాన మేర్పడఁగ ననేక పద్మజులను మన్నించి మనిచినాడు । వాత్సల్యమునఁ దండ్రివలె నాశ్రితులాలింపుచుఁ బ్రజలఁ బాలించినాడు । లలి నిజానేకాశ్రితులకుఁ జరస్థిర జీవికలిచ్చి పోషించినాడు । తేనెయున్నంతకుఁ దేనెపట్లవలెనె ముట్టకుండఁగ నాజ్ఞ వెట్టినాడు । పరికించి తగిన భూసురులకు నిత్యసాలగ్రామదానముల్సలిపినాడు । తాండ్రినాటి సంస్థధర్మకార్యంబులతిశయ వృద్ధిఁ బొందించినాడు । విజయరామావనీవిభుని పట్టాభిషేకపు శుభలేఖ రాఁ గాంచి మంచి । కిత్తిఖానులు రెండు సుస్థిమొకటి మేలైన ఖిల్లతుతోడ నంపినాడు । సంగమవలస మేగియుఁ గురపాము పార్వతీపురము నిక్కపట్టుగాఁ గ । దగుజమీందారులు దనపట్ల వినతులై చూడఁగా మిగులఁ బెంపొందినాడు జిల్లా చరిత్రలో స్వీయసంపత్సమృద్ధి ప్రసిద్ధి కెక్క వర్ధిల్లినాడు నెరిఁ బిటాపురపు మైనరుగారికి చటనే పెండ్లిఁ జేయించి పంపించినాడు । క్రమత సీతానగరమున రాజాముల హరి నిత్యపూజ లేర్పరచినాడు । మైస్పెనపూఁదోట గొప్ప కోనేళ్లు హరిప్రీతిగాఁ గనిర్మించినాడు । బహుధర్మవిషయక ప్రశ్నోత్తరముల చేసహిమ నెఱింగి సన్మార మొసంగి । సకలోపచారముల్ జరుపుచు మద్గురు త్రైపతేంద్ర యతీంద్రుఁ దనిపినాడు । కోటికెలపూడి సత్కులభవుండైన కోదండరామాఖ్య సిద్ధాంతి చేత । భగవ

దేకాంత సేవాకలాపప్రపదనపారిజాతాదితత్తదుచిత । సత్కృ
తుల్ చేయించి తత్కృతికర్తకుత్కృష్ట సత్కృతులొనరించి
నాడు॥

(నివృత్తిక్రమము.)

సీ॥ జనకాజ్ఞమీఱక ఘనుఁడైన శ్వేతాచలపతిరంగారాయనృపతి
సూరి । పరిభోగసూటప్రాకారముఖ్యావశిష్టకార్యంబులు
శిష్టతెన్న । సవరించిరుక్మిణీసత్యభామాసమన్విత వేణుగోపాల
విగ్రహంబు । రాజ్యలక్ష్మీసుపర్ణహనూమదాద్యష్టపరివార
దేవతాపరివృతముగ । శాలివాహనశకసంవత్సరములందుఁ
గరిశైలనిధిచంద్రపరిమితముగు । సాధారణనామసంవత్సరం
బునందలి మాఘమాసాదిపక్షమియందుఁ । బదిగడియల వేళఁ
బాంచరాత్రవిధానవృషనిసుగ్గి ప్రతిష్ఠ జేసి । యవతారదివ
సమునాఁటనె కాంచియందైనఁ బ్రాద్యమగుటవలన । మఱునాఁ
డుకళ్యాణమహము నిర్వర్తించి ద్వాదశి మొదలుగా వరుసమీఱ
నావభృథయనోత్సవంబనుకూలముగఁ జేసి సరగనీభవ్యదేశంబు
దివ్య । దేశంబుఁ జేయించి దీక్షించి వీక్షించి శ్రీరంగముననుండి
సింగభట్ట । రాహ్వయశ్రీవైష్ణవాగ్రేసరునిఁ గోరియాదినేపిలి
పించియానతిరించి । ప్రసిద్ధుఁడైనతని చేఁ బ్రతిష్ఠమతిస్థపరిగ్రహం
బుఁ జేయించితదాదిగాఁ గానిత్యోత్సవంబులు నిరుపమానంబు
గాఁ బ్రౌఢరిచేయింపుచుండుటయకాక । వసన్తచైత్రాదిగా
బ్రహ్మోత్సవము వసంతోత్సవంబునున్న పనోత్సవంబు । ఘన
వినోదోత్సవంబును జయంత్యుత్సవంబునుఁ బవిత్రోత్సవంబు

నవరాత్ర । మహితోత్సవంబబ్ధిమథనోత్సవముధనుర్మన చేరాధ్యయనమహితోత్స । వములుకళ్యాణోత్సవముకా మదహనడోలోత్సవంబులు సేయుచుండు నెప్పుడు । నీతియ కాకపవిత్రైకాదశీనిశింబురవిహారోత్సవంబులుబచరించు । సంక్రాంతిరోహిణిస్వకజన్మనక్షత్ర మేకాదశియువచ్చు నెప్పుడప్పు డంబురాప్పణ పూర్వకాచరణీయ ధ్వజారోహణమున్నాలోత్స వాదియందు । మృత్సంగ్రహణనామకోత్సవంబొనరించును చ్చావచంబులయ్యుత్సవములు॥

(కోవెల ఋలాకా జనవర్గములు.)

సీ॥ ధర్మకర్తలునుహస్తకులునధ్యాపకులుపనిషత్పాఠకులుచిత వేద। పాఠక ద్విజకదంబము భాగవత పాఠకులును గీతాపాఠకులును వైష్ణవ। పురాణపాఠకుల్ నైవేద్యవైష్ణవులర్చకులుసన్నిధపరి చారకులుపు। రోహితుల్చ్రపుదాసులుశ్రీనాంగ భాగవతులు తళిహ కైంకర్యపరులు। తగు లేఖకులుహవాల్దారులసియానుకు ల్వారక రదీపికావైష్ణవులును। వీర కాహళములుపిల్లనగ్రోవులు తిరుచిన్నములుబజంత్రీలుశంఖ । ములులోనయినవాద్యము లుపూనికొల్చుజనంబులుసాని మేళంబుభటులు । మాలికులు ద్వారమఠిమషాల్చిలుకమ్మరులులోనగుపెక్కుమందికిచిత జీవనంబులెకాక దేవప్రసాదంబు దినదినం బిచ్చుచు మనుచు నతఁడు॥

(నితకృత్యక్రమము.)

సీ॥ వేయేలనిత్యము వేకువ మేల్కాంచివిమలుఁడైగుడికేగివినయ మెనయ।మూడుప్రదక్షిణంబులొనర్చిస్వామికిసాష్టాంగవంద

నంబాచరించి। స్మరణపూర్వకముగాఁగరములుజోడించివెను
వెన్కనడకలవెడలివచ్చి । స్నానజపాదినానానిత్యకృత్యము
లొనరించిదేవమందిరముఁజేరి । వలగొనిమ్రొక్కికేవలభక్తిగల్గి
ప్రేమలనొంటికాలుననిలిచిచాలు । రంబువీచుచుఁబాంచరా
త్రోక్తవిధిద్విసహస్రనామార్చనంబర్చకులుయ । థాక్రమం
బుగఁజేసితనసందీర్థంబిచ్చునంతపర్యంతమత్యంతనిష్ఠ। నట్లుం
డిసవాంతమందుఁదీర్థప్రసాదములుగైకొనివచ్చితాభుజించి
నసినేదితింబగుసట్టసిదార్థమేమాత్రమైనసనుభుజింపఁజెపుఁ బై
న। మాపులసంధ్యావేళమందిరంబునకేగిస్వామినిసేవించివచ్చు
చుండు। ముఖ్యకాలములందుస్వయచిత్తమునందత్కథాశ్రవణం
బుతత్పూర్వకగోష్ఠి। నవభోగనవమహోత్సవసముత్సాహం
బునిత్యకృత్యములుగానివ్వటిలుచు। సకలోత్సవములకుఁజాలి
సంతోషసంబురాగిలభూములర్పణముచేసి॥

(తోట్లో ...సమర్పణక్రమము.)

సీ॥ స్వామివారికినిస్వామిలక్ష్మింబులకుచిరత్నరత్నాభరణము।
లంగిమితంబుగానర్పించిపుష్పకహయగజగరుడశేషాద్యనే
క । వాహనంబులుదాపిఁగోహమియంబులావృతినొనర్పించి
యర్పించెమరియు॥

(శ్రీసీతారామస్వామివారి ప్రశంస)

సీ॥ తనదివాస్తవ్యసీతారామయాఖ్యందుపూనిసీతారామపురము
నందు। మునుప్రతిష్ఠింపఁజేసినయుల్లాసశంబుగానొనరించి
నకారణమున । తద్వర్తియైనసీతారామమూర్తికినిట్లనెసక

లంబు నేర్పరించి రామాయణమునందు రాముఁడు క్రతువులు
చేసినట్లుండుటచేత నిజము । తత్ప్రకారము నసీతారామమూర్తి
చేబిష్టపశుక్రతులిష్టులెన్నఁ । జేయించి యేకోటఁ జాయక
యిష్టియు నిత్యాగ్నిహోత్రములన్నియ తత్కాల । ములయందు
శ్రౌతులమూలంబుగా నొనర్పించు శ్రీరామకృష్ణులందు । సను
భక్తిగల్గి యీసరణి నాధరణినాథవరుఁ డుపాసనమనంబు నొందె॥

గీ॥ నృపతిమణియైన శ్వేతాచలపతిరంగ । రాయవిభుఁడిహమందు
బరంబునందు । శాశ్వతఖ్యాతి భగవదర్చావిధులు । సేతివెల
యుంచె బ్రీతిసిరితిసారి॥

(మ॥ పా॥ కవి.)

వీరి కాలములో వరుసగ నలుగురు దివానులుండిరి. వారలు పెద్దదివాంజీగారైన యినుగంటి సీతారామయ్యగారు, రాజాగారి సోదరులైన రాజా జనార్దన రంగారావు బహద్దరు గారు, పెదదివాంజీగారి కనిష్ఠకుమారులైన యినుగంటి రాజగోపాలరాయనింగారు, మఱియు పెదదివాంజీగారికిఁ బౌత్రులును, సిరిపురం ప్రొప్రైటరుగారునైన యినుగంటి సీతారామస్వామిగారునై యున్నారు. ఈ రాజాగారు మొదట గోదావరిజిల్లాలోని చింతపల్లివారి కన్యయైన వెంకటరమణయ్యమ్మగారిని వివాహమాడిరి. ఆమె గతించిన పిదప దామెరవారి కన్యయైన వెంగయ్యమ్మగారిని వివాహమాడిరి. ఈ రాజాగారసంతానవంతులైనందున నప్పటి పిఠాపురపు రాజాగారగు రాజా సూర్యారావు బహద్దరుగారి మూడవ కుమారుని దత్తత

చేసికొని 1862-వ సంవత్సరం ఆగష్టునెల తే 18 దీని వైకుంఠ వాసులైరి.

---

## X-వ పురుషులు.

## రాజా సీతారామకృష్ణరాయణప్ప రంగారావు బహద్దరుగారు.

## (1863—1868.)

---

ఈ రాజాగారు 1845-వ సంవత్సరం సెప్టెంబరు నెల తే 15 దీని పిఠాపురములో జన్మించిరి. వీరి పెంపకపు తండ్రిగారు వైకుంఠవాసులగునప్పటికి వీరికి మైనారిటీ తీరుటకుఁ గొన్ని మాసములు తక్కువగానున్నను శ్రీగవర్నమెంటువారీ జమీందారీని కోర్టు ఆఫ్ వార్డ్సుక్రిందికి తీసికొనలేదు. వీరు కిట్టుదిట్టముగా నైదు సంవత్సరములుమాత్రమే పరిపాలించిరి. ఈ కాలములో తమ తండ్రిగారు చేసిన మంచి పనులను జరిపించుచు వృద్ధిలోనికిం దెచ్చిరి. వీరు 1864-వ సంవత్సరమున నీ పట్టణంబున, నాంగ్లోవర్నాక్యులరు స్కూలును స్థాపించిరి. వీరు తమ మేనత్తగారి కుమార్తెయగు నినుగంటి వారి కన్యను వివాహమాడి 1868-వ సంవత్సరము మే నెల తే 17 దీని కాలధర్మమునొందిరి.

వీరి భార్యగారు 'రాణీ లక్ష్మీచల్లయ్యమ్మ బహద్దరు' గారైయున్నారు.

వీరి భర్తగారు కాలధర్మమునొందగానే జమీందారీ వ్యవహార మీమెకు వచ్చెను. తమ మామగారి నాటనుండి దివానుగనుండిన సమర్థుఁడగు నినుగంటి సీతారామస్వామిగారినే

దిహీనుగ నుంచుకొనెను. ఈయమ ప్రాతకోట ననుంపత్కార మైనదానిగఁ దలఁచి యీ క్రొత్తనగిరుంగట్ట నారంభించెను. 1873-వ సంవత్సరమున బంగాళా దేశములో క్షామము ప్రబలి యుండగా రు 50,000-ల కిమ్మతుగల ధాన్యము నచ్చటి క్షామ నివారణార్థ మీయామె పంపించెను. అందునగా నిండియా మదరాసు ఉభయ గవర్నమెంటుల వారామె ధారాళమైన ఔదార్యమును శ్లాఘించిరి. హిస్. రాయల్. హైనస్. ది ప్రిన్సాఫ్ వేల్సు గారు 1875-వ సంవత్సరములో మదరాసుకు దయచేసినప్పు డామెకు ప్రతినిధిగ నామె దివానునంపిరి. అప్పుడా ప్రిన్సుగారొక గౌరవార్థమైన బిళ్లనిప్పించిరి 1876-వ సంవత్సరములో శ్రీగవర్నమెంటు వారామె ధర్మకార్యములకు మెచ్చుగా " " యను కితాబును దయచేసిరి.

ఈమె నిత్యమును గంగానదీ యుదకమునే పానము జేయుచునుండిరి.

బస్తరు సమీపస్థలములలో జరిగినఁ ఫితూరీ నివారణార్థ మీయామెగారు గవర్నమెంటువారికిఁ జేసిన సహాయమునకు గవర్నరుగారి ఏజంటు యీ క్రిందివిధమున జాబువ్రాసిరి:—

నెం 260 రు.

రాజా సాహెబ్ మెహర్బాన్ దోస్త్

రాజా శ్రీలక్ష్మీ చల్లయ్యమ్మ బహద్దరు బొబ్బిలి రాణిగారికి.

ఈ మధ్య బస్తరులో నుద్భవమైన ఫితూరీ నివారణనిమిత్తమై యిక్కడినుంచి సైన్యము నడపఁబడిన సంగతిలో మీరు

చేసిన కుమ్మక్కునుగురించిన్ని సదుపాయమునుగురించిన్ని, గవర్నమెంటువారు మీకు థ్యాంక్సుచేసినట్లు మీకు తెలియచేయ కోరినారు. గనుక యీ సమాచారము సంతోషపూర్వకముగా మీకు విశదపరుస్తూ సదరు ఆర్డరుయొక్క యింగ్లీషు యెకుస్ట్రాక్టు యిందుతో పంపించడమైనది.

గవర్నరుగారి ఆక్టింగు ఏజెంటు.

అని యున్నది.

గవర్నమెంటువారి ఆఫీసు,

మకాం విశాఖపట్టణము.

1876-వ సంవత్సరము జూలై నెల తే 22 ది.

---

శ్రీగవర్నమెంటువారి యుత్తరువులోని భాగము.

---

"గుడ్రిచ్ దొరవారు హిస్. హైనస్. విజయనగరపు మహారాజావారికిని, బొబ్బిలి రాణిగారికిని ఈ మధ్యసేనలను నడపుటలో వారలుచేసిన సహాయమునకును, సదుపాయమునకును, శ్రీగవర్నమెంటువారి వందనముల నంపవలసినది."

(నిజమైన యకుస్ట్రాక్టు)

సంతకము వున్నది.

గవర్నరుగారి ఆక్టింగు ఏజంటు.

---

మరియొక సమయములో శ్రీగవర్నమెంటువారి ఏజంటు
గారిస్టిన్ దొరగారు రాణిగారికి వ్రాసినజాబు.

నెం 91 రు.

రాజా సాహెబ్ మెహర్బాన్ దోస్తాన్

రాజా శ్రీలక్ష్మీచల్లయ్యమ్మ బహదర్ బొబ్బిలి రాణిగారికి.

పాచిపెంట మకాములో పోలీసువారు లేనప్పుడు అ॥ ఏజంటువారైన మె॥ ఫ్రేజరుధొరగారు మిమ్మును గోరినవెంటనే మీరు 50 మంది బంటుమానాను మీరు పాచిపెంట పంపించి నట్టు మె॥ ఫ్రేజర్ధొరగారు మాపేర వ్రాయించినారు. మీరు వెంటనే సహాయముచేసినందుకు చాలా సంతోషించడమైనది.

*    *    *    *    *    *    *

విశాఖపట్నం డి॥ గవర్నరు ఏజంటువారి ఆఫీసు
1880-వ సంవత్సరం మార్చి తే 31 ది మకాం మాడగెడ.

జె. యచ్. గారిస్టిన్ అని యున్నది.
గవర్నరు ఏజంటు.

సారధిపండా
ఫ్రె॥ జవాబుని వీసు
అని యున్నది.

కె. క్రిష్ణారావు అనియున్నది.
మేనేజరు.

---

1871-వ సంవత్సరములో నీ రాణిగారు తమ భర్త యొక్క యనుజ్ఞాప్రకారము వెంకటగిరవంశవృక్షములో 27-వ పురుషులైన రాజా సర్వజ్ఞ కుమారయాచేంద్ర బహదరు, సి.

యస్. ఐ, శ్రీ వెంకటగిరి రాజాగారి 3-వ కుమారుని దత్తత(జేసి కొనిరి. వీరి మైనారిటీలో గూడ నీ రాణిగారే ప్రభుత్వముం జేయుచుండిరి. డాక్టరు మార్ష్ దొరవారిచేఁ దమ కుమారులకు విద్యాభ్యాసముం జేయించిరి. ఆమె 1887-వ సంవత్సరము మే నెల తే 7 దీని వైకుంఠవాసినులైరి.






# XI-వ పురుషులు.

## మహారాజా సర్. వేంకట శ్వేతాచలపతి రంగారావు బహదరు

### కె. సి. ఐ. ఇ. మహారాజావారు.

* ఈ మహారాజా వారు 1862-వ సంవత్సరం సెప్టెంబరు నెల తే 8 దీని జన్మించి 1871-వ సంవత్సరమున వెంకటగిరిలో బొబ్బిలి రాణిగారివలన దత్తతఁ జేసికొనఁబడిరి. వీరు వెంకటగిరి నుంచి 1872-వ సంవత్సరం డిశెంబరు నెలలో బొబ్బిలికి వచ్చిరి. వీరు కొన్ని సంవత్సరములవరకు నిద్దరు హిందూపాధ్యాయులచే విద్య గరపఁబడుచు నటుతరువాత మూడున్నర సంవత్సరముల వరకు 'మార్షు'దొరవారివద్ద విద్యనభ్యసించిరి. ఈ వైపుఁ బ్రసిద్ధికెక్కిన సుసర్ల సీతారామశాస్త్రిగారు వీరికి సంస్కృతోపాధ్యాయులుగా నుండిరి. ఈ యిద్దరి యుపాధ్యాయులవద్ద నీ రాజావారు మామూలు విద్యాభ్యాసముంజేయుటయేగాక నీతి మొదలగు నితరాంశములలోని ధర్మములను చాలామట్టుకు వారలవలన నుపదేశించబడిరి హెర్. మెజస్టీ. విక్టోరియా మహారాణిగా రిండియాచక్రవర్తినియను కితాబును ధరించుకొనినపుడు 1877-వ సంవత్సరములో విశాఖపట్టణములో జరిగిన దర్బారుకు వీరు వెళ్లియుండిరి. అచ్చట ప్రభువులలో వీరును, గతించిన విజయనగరపు మహారాజా వారును మాత్రము

* 1900 సంవత్సరంవరకు ఈ చరిత్రలో వీరిని 'రాజా' వారనే వ్రాయఁబడి యుండును.

'డైయిస్' బల్లమీద నా దర్బారులోఁ గూర్చుండిరి. బొబ్బిలి లడాయికిఁ బూర్వమునుంచి వైరముగల విజయనగరము, బొబ్బిలి కుటుంబస్థులగు వీరుభయులు నా దర్బారులో నదే ప్రథమముగ నొకరితో నొకరు మొలాఖత్తుఁ జేసికొనిరి.

1878-వ సంవత్సరములో వెంకటగిరికి వెళ్లి వీరి జ్యేష్ఠ సోదరులగు ప్రస్తుతపు వెంకటగిరి రాజాగారియొక్క పట్టాభిషేకమును సందర్శించిరి. పిఠాపురము, బొబ్బిలి, జటప్రోలు కుటుంబములకు దత్తతీయఁబడిన రెండవ, మూడవ, నాల్గవ సోదరులు వారల దత్తతలు జరిగినపిదప నిదే ప్రథమముగ నచ్చటికి విచ్చేసియుండిరి. అచ్చటనే యీ రాజాగారు 'పెద్దపులి'ని వేసిరి. ఇదియె వారి మొదటి పెద్దపులివేట. 1878-వ సంవత్సరములో వివాహముం జేసికొనఁబడిన వీరి మొదటి భార్యగారు 1880-వ సంవత్సరములో నిప్పటి కుమార రాజావారింగని పురిటిలోనె వైకుంఠవాసినులైరి. ఈ కుమార రాజావారగు రాజా వెంకట కుమార కృష్ణ రంగారావు బహదరుగారు 1880-వ సంవత్సరం మార్చి నెల తే 28 దీని జన్మించిరి.

ఈ రాజాగారి మైనారిటీ యాఖరుభాగములో వీరికిని, వీరి పెంపకపు తల్లిగారికిని గొన్ని పరస్పర విరోధములు కలిగినవి. అప్పటి విశాఖపట్టణపు కలెక్టరువారగు 'గారిస్టన్' దొరవారీ యుభయులకు నానుకూల్యముం జేయుటకుఁ జాలినంత ప్రయత్నముం జేసిరి. కాని యా రాజీ పూర్తికాకమునుపే యా దొరగారు బోర్డుమెంబరు పనికి వెళ్లవలసివచ్చెను. అటుపైని

ర్ంప పితూరి నివారణార్థమై ప్రత్యేక హోదాతో నంపఁ బడిన క్యాప్టేకల్' దొరవారు వాల్తేరులో మకాము జేసి యుండినపుడు రాజీజేసిరి. ఈ రాజాగారు 1880-వ సంవత్సరము సెప్టెంబరునెల తే 8 దీనాటికి మైనారిటీ తీరినప్పటికి 1881-వ సంవత్సరము జూలై తే 20 దీని, రాజీయనంతరమె ప్రభుత్వ ముం గైకొనిరి. అప్పటి ఖజానా నిలువ ర్పు. 140—15—0 లు మాత్రమే యుండుటగాక, లోకుల కీయవలసియున్న బాప తులు ర్పు. 46,000-ల వరకు నేర్పడియుండెను. వీరి తల్లిగారికి వారి జీవితకాలమువరకు ననుభవించుటకు సాలీయానా ర్పు. 60,000 లు రాబడిగల కరకవలస యెస్టేటును, మరికొన్ని గ్రామములు నిచ్చిరి. నవంబరునెల తే 30 దీని వీరి 'పట్టాభి షేకోత్సవము' జరిగెను. వీరి సోదరులగు శ్రీవెంకటగిరి రాజా గారు హైచేసియుండిరి. అప్పటి కలెక్టరుగారగు టర్నరు దొర వారు మసలందుపైని రాజావారినిఁ గూర్చుండఁబెట్టిరి. ఈ యు త్సవమునకు గొన్నిరోజులకు ముందుగానే రాజావారు తమ మొదటిభార్యగారి సోదరినే బెండ్లియాడిరి. ఈ మరుచటి సంవ త్సరములో వీరు బొబ్బిలిలో మిడిల్‌స్కూలుగ నుండినదానిని 'హైస్కూలు'గ జేసి యంతకుముందు స్కూలుకు గవర్న మెంటునుంచి యిప్పించఁబడుచున్న సహాయముం దీసికొనుట మాని తామే యన్ని ఖర్చులును భరించుచున్నారు. మఱియు 'సంస్థానపు బీదలసత్రము' నొకదానిని స్థాపించిరి. ఇంతియగాక 'బుధానందిని' యను విద్వత్సభ నేర్పరచిరి. ఈ సంవత్సరము

లోనే 'తిరుపతియాత్రం' జేసికొని, మదరాసుకును, వెంకట గిరికిని వెళ్లియుండిరి.

1883.

ఘనతఁజెందిన సర్. గ్రాంటు. డఫ్ గవర్నరువా రుత్తర సర్కారులలో దిరుగుచు ఫిబ్రవరునెలలో బొబ్బిలికి దైచేసి ప్రాతకోటలో విడియింపఁబడిరి. వారు బొబ్బిలిలో జూచినదానికి సంతసించినటుల బెజవాడలోని ప్రజల అడ్రెస్సునకు వారిచ్చిన జవాబులో నిట్లు శెలవిచ్చిరి:—

"ఈ యుత్తరసర్కారులలో దమకు చుట్టునుండువార లనేకవిధమైన మేలులం గలుగఁజేసెడివార్లు గలరు. వారెవ రనఁగా విజయనగరము, మందస, బొబ్బిలి, పిఠాపురముంవారలై యున్నారు."

ఈ సంవత్సరములోనే రాజాగారు వెంకటగిరిలో నుం డఁగా వెంకటగిరి రాజావారి రెండవ వివాహమును, శ్రీముద్దు కృష్ణయాచేంద్రులవారి వివాహమును జరిగినవి. వీరు బొబ్బిలి కుటుంబమునకు దత్తులగుటవలన సాధ్యమైనంత త్వరలో విధి విహితములైన శ్రాద్ధవిధులం జరుపుట ముఖ్యమని దలఁచి కాశీ, గయ, అలహాబాదులను వెళ్లి తమ పెంపకపుతండ్రి మొదలగు పూర్వులకు శ్రాద్ధవిధులం జరిపించివచ్చిరి. ఈ సంవ త్సరములోనే వీరి రెండవభార్యగారొక కుమారునిం గని పురిటిలోనే వైకుంఠవాసినులైరి.

1886.

ఈ సంవత్సరములో దక్షిణ ఇండియాలో నుండు ముఖ్యమైన యనేక పట్టణములం జూచుచు ననేక క్షేత్రములను సేవించిరి. అందు ముఖ్యములైనవి:—1. వుప్పాక, 2. సింగరాయకొండ, 3. నెల్లూరు, 4. వెంకటగిరి, 5. తిరుపతి, 6. కంచి, 7. చిదంబరము, 8. తంజావూరు, 9. కుంభకోణము, 10. నాగపట్టణము, 11. తిరువాలూరు, 12. రాజమన్నారుగుడి, 13, శ్రీరంగము, 14. మధుర, 15. రామేశ్వరము, 16. తుత్తుకుడి, 17. నీలగిరి, 18. కోయంబత్తూరు, 19. కాలికట్టు, 20. సేలము, 21. పుదుచ్చేరి, 22. బెంగుళూరు. వీరి సోదరులగు జటప్రోలు రాజావారి వివాహము వెంకటగిరిలో జరిగినపు డచట వీరుండిరి. మదరాసులో ఘనతజెందిన లార్డు డఫరన్ వైస్‌రాయిగారిని సందర్శించిరి. 'ప్రాజ్ఞహాలు'ను నగరిలోఁ గట్టించిరి.

1887.

ఈ సంవత్సరము రాజాగారికి నిండా దుఃఖకరమైనదిగా నుండెను. వీరి పెంపకపు తల్లిగారును, వీరి ప్రియమైన చిన్న కుమారుఁడును గతించుటయేకాక వీ రనేకమాసములవరకు ఖాయిలాగా నుండిరి.

అయితే యీ సంవత్సరములో ముఖ్యమైనయంశ మేదనిన శ్రీమహారాణీ చక్రవర్తినిగారి జూబిలీజ్ఞాపకార్థమై బొబ్బిలిలో నిండా యవసరమైన మార్కట్టుం గట్టించి జూన్ నెల తే 20 దీని హస్తిభారపు రాతినివేసి గవర్నమెంటువారి యుత్త

రువు నొంది 'విక్టోరియామార్కెట్టని' పేరిడిరి. మఱియు శ్రీమహారాణిగారికి దమ అడ్రెస్సును వెండిపెట్టెలో నుంచి యంపుకొనిరి. వీరీసంవత్సరము సెప్టెంబరు తే 28 దీని శ్రీవేణుగోపాలస్వామివారికి వెండిగరుడవాహనమును సమర్పించిరి.

## 1888.

రాజాగారు మదరాసులో స్టీమరు దిగగానే శ్రీగవర్నరుగారి ఏడేకాముపలన నెదురుకొనంబడి శ్రీగవర్నరుగారిబండి నెక్కి శ్రీగవర్నరుగారి బాడీగార్డులో నైదుగురు తురుపులు వెంటరాగా తమబసలోఁ బ్రవేశించిరి. ఈ మర్యాద జరుగుట కిదియె ప్రథమమైయున్నది. ఆ దఫాలో గవర్నరుగారు రిటర్ను విజిటిచ్చుటయెకాక 'ప్రైవేటుయంట్రీ'నిన్ని దైచేసిరి. శ్రీగవర్నరుగారు కాఙ్గ్రెస్ సభవారికి గౌరవార్థముగ నిచ్చిన 'గార్డెన్‌పార్టీ'లో గతించిన విజయనగరపు మహారాజావారును, ఈ రాజావారును అతిసఖ్యముతోఁ గలిసికొనిరి. వీరి యుభయుల ప్రభుత్వకాలములో నిదియె ప్రథమసమావేశమైయున్నది.

ఈ సంవత్సరములో రాజావారు ఉత్తర ఇండియాలో దూరయాత్రం జేసిరి. ఈ యాత్రలో 1 పునహా, 2. బొంబాయి, 3. బరోడా, 4. జెయిపూరు, 5. ఢిల్లీ, 6. ఆగ్రా, 7. లక్నో, 8. మధుర, 9. బృందావనము, 10. అయోధ్య, 11. అలహాబాదు, 12. కాశీ, 13. గయ, 14. కలకత్తా, 15. భువనేశ్వరము, 16. జగన్నాథము మొదలైన స్థలములకు వెళ్లిరి. ఆ యాత్ర

లోనే వీరు శ్రీవిక్టోరియా చక్రవర్తినిగారి మూడవకుమారులగు ది. డ్యూక్ ఆఫ్ కన్నాటు'వారిని, యప్పటి వైస్‌రాయిగారిని, యప్పటి బొంబాయి గవర్నరుగారిని సందర్శించిరి. వీరు తిరుగ గయకువెళ్లి గతించిన తమ పెంపకపు తల్లిగారికిఁ జేయవలసిన గయావిధులను జరిగించిరి. వీ రీయుత్తరయాత్రలం జేయు నపుడు అయోధ్య, బృందావనములనుండి శ్రీసీతారామ రాధా కృష్ణస్వాముల పాదుకలం దెచ్చి తమ నగరులో పూజామహాలు నందు ఏప్రిల్ తే 18 దీని ప్రతిష్ఠించిరి.

ఆ సంవత్సరమున శ్రీవిక్టోరియాచక్రవర్తినిగారి జన్మతిథ్యుత్సవ సందర్భమునుఁబట్టి ఘనతఁజెందిన వైస్‌రాయిగారు 'రాజా' యను కితాబు (వీరిమట్టుకుమాత్రము చెందతగిన) నిచ్చిరి. అయితే నీ బొబ్బిలిరాజులు జమిాందారీని సంపాదించినది మొదలు రాజులనే వ్యవహరింపఁబడుచు వచ్చిన సంగతి యెల్లవారికిం దెలసినదయ్యే యున్నది. కుటుంబ పారంపర్యమైన రాజాయను కితాబెవరెవరికి గలదని గవర్నమెంటులో ప్రశ్న గలిగినపుడు, ఈ గవర్నమెంటువారి యధికార మిా దేశమునకు వచ్చినది మొదలు వీరి పూర్వులను రాజులని వ్రాయుచుండినట్లు గనపరచదగిన యనేక యుత్తరములను, యనేకేతర కాకితముల నీ రాజాగారు గవర్నమెంటువారి కంపించిరి. ఘనతజెందిన వైస్‌రాయిగారు 1890-వ సంవత్సరం డిశంబరు నెల తే 16 దీని కుటుంబ పారంపర్యమైన 'రాజా' యను కితాబు నీ కుటుంబము వారికిని, మరియు విజయనగరము, జయపురము, వెంకట

గిరి, కాళహస్తి, కార్వేటినగరము, పిఠాపురము కుటుంబముల వారికిని, మలబారులోని మరికొన్ని కుటుంబముల వారికిని దై చేసిరి.

ఇందువిషయమై విశాఖపట్టణపు జిల్లా కలెక్టరు వారు గవర్నమెంటు చీఫ్ సెక్రెటరీగారికంపిన రిపోర్టులో నీ కుటుంబమునకు సంబంధించిన భాగ మీ క్రిందివిధై యున్నది:—

"బొబ్బిలి యనునది యీ జిల్లాలోని మూడు పెద్ద యిస్టేటులలోను నొకటియై యున్నది. తక్కిన రెండును జయపురము, విజయనగరమునై యున్నవి. సన్నద్ మిల్ కియ్యత్ ఇస్తిమిరారీలోని పేరు 'రాజా రాయఁడప్ప రంగారావు బొబ్బిలి జమీదారని' వ్రాయఁబడియున్నది. మరియు నా యాఫీసులోనుండిన యనేక కాగితములు మన మీ దేశమునకు వచ్చినది మొదలుకొని యీ బొబ్బిలి జమీదారు లీ కితాబుతో వ్రాయఁబడుచున్నటుల స్పష్టముగఁ గనబరచుచున్నయవి. ఈ జమీదారుగారు నేను కోరగానే 1807-వ సంవత్సరము మొదలనేక సమయములలో వీరి పూర్వుల కీ కితాబుతో వ్రాయఁబడుచుండిన యనేక యుత్తరములను నావద్దకంపిరి. వాటిలో బ్రతిదానియందు నీ కితాబు వ్రాయఁబడియుండుటే కాక మహమ్మదీయ ప్రభుత్వకాలములోఁగూడ నీ కితాబు వాడుకజేయఁబడుచున్నటుల నిదర్శనముగనున్నవి. వీరి పూర్వుఁడగు రాజా లింగప్ప రంగారాపుగారికి గుటుంబపారంపర్యములైన యనేక కితాబులు, మర్యాదలివ్వఁబడినటుల నీ రాజాగారు వ్రాసిరి. గాని ప్రసిద్ధ

మైన బొబ్బిలి లడాయిలో నివన్నియుంబోయి యుండును. 'శాశ్వతపుఁ గవులు' నిచ్చుకాలములో నీ జిల్లాలోని జమీందారులకు, ప్రొప్రయిటర్లకు నీయఁబడిన 'కబోలియతు'లన్నిటిని నే జూచినాను. రాజాయను కితాబు జయపురము, విజయనగరము, బొబ్బిలి జమీందారుల పేరులకు ముందు వ్రాయఁబడియున్నది. కాని యితరులకటుల వ్రాయఁబడి యుండలేదు.

బొబ్బిలి యనునది యీ ప్రెసిడెన్సీలోని పురాతన జమీందారీలలో నొకటైయున్నది. మన మీదేశములోఁ బ్రవేశించకమునుపు వారు స్వతంత్రాధికారముగలవారైయున్నారు. ఈ జిల్లాయొక్క చరిత్రలో దీనివిషయమయ్యె ముఖ్యముగా వ్రాయఁబడియున్నది. ఈ యుత్తర సర్కారులను జయించు సందర్భములో 1757-వ సంవత్సరములో బొబ్బిలిలో జరిగిన పెద్ద లడాయియే జిల్లా చరిత్రలోని ముఖ్యాంశమై యున్నది. ఆ యుద్ధమందే 'రంగారావుగారు' చంపఁబడిరి. విజయరామ రాజుగారు నౌకరిచే బొడిచి చంపఁబడిరి. ఈ విజయరామ రాజుగారు బుస్సీదొరగారి యాజమాన్యముక్రిందనున్న ఫ్రెంచి వారితోఁగలసి యుండిరి. అయితే వీరి తర్వాత వారు కలకత్తా నుండి 'క్లైవు' దొరగారిచే బంపఁబడిన ఫోర్డుదొరగారినిఁ గలసి ఫ్రెంచిసేనం దరుమఁగొట్టి మొగలాయి చక్రవర్తి క్రిందనుండు నీ దేశములో మన యధికారము స్థాపింపఁబడుటలో సహాయులుగానుండిరి. విజయనగరము పదపజయరామ రాజుగారే బొబ్బిలిలో జంపఁబడనియెడల నేటివరకును నీ సర్కారులు

నిజాము వారిక్రింద బహుశః యుండవలసివచ్చును. ఆరఫ్స్ దొరవారు బొబ్బిలి జమీందార్లవిషయమై వ్రాయుచు నిట్లనిరి :—

"రాజులమని చెప్పుకొనుచుండిన వీరు 'పాలేగార్ల'లో మొదటివారై యున్నారు."

1832-వ సంవత్సరములోను, నా సంవత్సరముకు దగ్గరగాను నీ జిల్లాలోఁ బ్రబలిన పితూరీలలో నీబొబ్బిలి జమీందారుగారు గవర్నమెంటువారి కనేకవిధములఁ గొప్ప మెహనతు కార్యములంజేసిరి. ముఖ్యముగ పాలకొండ జమీందారు దివానుం జంపిన కంబర వెంకటరాయుడిని యతని యల్లునింబట్టి యొప్ప జెప్పిరి. వారలం బట్టుకొనుటకు గవర్నమెంటువారు జేసిన సకల ప్రయత్నములు వృధయైనవి. ఈ విషయమయ్యే రసల్ధొరవారు తమ రిపోర్టులలో దగు రీతింగొనియాడి యుండిరి. అప్పటి గవర్నరుగారగు సర్ ఫ్రెడరిక్ యాడెమ్‌గారు గవర్నమెంటు కమిషనరగు రసల్ దొరగారికి వీరు జేసిన సహాయ విషయములో వీరి యోగ్యతనుగురించిన్ని, ప్రభు భృత్యన్యాయ మునుగురించిన్ని, మంచి యభిప్రాయముఁ గలవారై యుండినటుల నీ జమీందారుగారితో ముఖస్థముగ శెలవిచ్చిరి. మరియు పర్లాకిమిడి, విశాఖపట్టణము, గుంసూరు పితూరీల విషయములో వీరు జేసిన సహాయమునకు మెచ్చుకొని గవర్నమెంటువారు విశాఖపట్టణపు కలెక్టరుగారి ద్వారా జమీందారుగారికేవిధముగ తెలియఁబరచిన విశేష సంతుష్టికరముగ నుండునో

య్యా విధముగ వారి ప్రవర్తనవిషయమై గవర్నమెంటువారు మెచ్చుకొనినటుల దెలియపరచుమని రెవెన్యూబోర్డువారికి దెలియఁజేసిరి. ఇటీవల కాలములలోగూడ నీ బొబ్బిలి కుటుంబమువారు ప్రశస్తమైనట్టియు, నేర్పుగలిగినట్టియు, తమ యిస్టేటు వ్యవహారవిషయములో నెల్లప్పుడుం బ్రసిద్ధికెక్కి యుండిరి. వారియొద్ద ధనమెప్పుడునుగలదు. కార్స్టేకల్ దొర వారి మాన్యువలులో వ్రాసినట్లు అవసరోచితమైన రుణమును వీరివద్ద దీసికొనుటచే ననేక జమీందారీలు చెడకుండ సంరక్షింపఁ బడినవి.

బొబ్బిలి జమీందారుగారికి కితాబుయందుగల హక్కు, మనమీ దేశమును స్వాధీనముం జేసికొని నదిమొదలంగీకరింపఁబడుచుండుటయేకాక, ఆరమ్దొరవారి చరిత్రప్రకారము గూడ నంతకు పూర్వమును వాడుకఁజేయఁబడుచుండినటుల మీదఁ గనఁబరచఁబడియున్నది. ఈ కుటుంబములో నెవరికో యొకరి కిచ్చినదిగాదు. ప్రతి జమీందారునికిం గుటుంబ పారంపర్యముగ వాడుక జేయఁబడుచున్నది. మహారాజా యను కితాబీయఁబడక ముందు ప్రస్తుతపు జయపురపు జమీందారు గారికిని, గతించిన, ప్రస్తుతపు విజయనగరపు జమీందారులకును, రాజాయను కితాబు ప్రత్యేకముగ నివ్వఁబడకపోయినను వాడుకజేయఁబడుచుండినటులనే వీరి కుటుంబమునకును నిది సహజముగ కుటుంబ పారంపర్యముగ ననుసరించి వచ్చుచునేయున్నది. పూర్వము రెండుసమయములలో విజయనగ

రపు జమీందారుగారిని రాజాయని వ్రాయవలసినట్లు గవర్న మెంటువారి యుత్తరువై యున్నది. బొబ్బిలి, జయపురపువారును విజయనగరమువారితోటి వారేగాన విజయనగరము, జయపురము, బొబ్బిలి జమీందారులకుం గుటుంబ పారంపర్యమైన రాజాయను కితాబు గలదని విశదపరచుచున్నాను. ఇప్పటి విజయనగరము, జయపురము ప్రభువులకు వారిమట్టుకుగా నివ్వఁబడిన మహారాజాయను కితాబు గలదు. మఱియు నీయంశము నధికారముతో నెప్పటి కొకేమారుగా దెలియ పరచుటకు గోరుచున్నాఁడను.

యచ్. జి. టర్నరు అని యున్నది.

కలెక్టరు."

(నిజమైన నకలు.)

ఆర్. సూర్యారావు అని యున్నది.

డెప్యూటీ కలెక్టరు.

మీద నుదహరించఁబడినదియు, వీరికిగా నిచ్చినదియు నైన రాజా కితాబు సన్నదును టర్నరు దొరవారు బొబ్బిలికి వచ్చి దర్బారుజేసి రాజాగారి కందఁజేసిరి. ఆ సన్నదు నిచ్చునపుడు టర్నరుదొరగా రుపన్యసించుటలో దాను కలెక్టరుగ నుండినకాలములో ననేకుల కనేకవిధములైన సన్నదుల నిచ్చినప్పటికన్నను దమకు దీని నిచ్చుట విశేషసంతోషకరముగ నున్నదనియు, నీ రాజాగారికి కితాబు నిచ్చుటకు వీరు పురాతన కుటుంబపువారగుటయేకాక వీరి యుక్తప్రవర్తనయుం గారణ

మనియు, నీ రాజాగారిని మూర్షు దొరవారి క్రింద విద్యాభ్యాస కాలములో నుండినప్పటినుంచి యెరుగుదుమనియు, వీరి యుక్త ప్రవర్తన మపు డారంభమగుటయేకాక గద్దిపైని గూర్చున్నది మొదలు • స్థిరపడినదనియు, వీరనేకేతర జమీాదారులవలెగాక జమీాందారుని వ్యాపారమును జెరుపతగిన చుట్టునున్న పరివారము నెడబెట్టిరనియు, వీరు మొదటినుండియు మితవ్యయముం జేయుచు స్వతంత్రముగ వ్యవహరించుచున్నారనియుం జెప్పిరి. మఱియు వీరు పట్టాభిషిక్తులైనది మొదలుకొని యనేకోపయుక్త కార్యములం జేసిరనియు జనోపయుక్తములైన పనులకు ధారాళముగ జందాలనిచ్చిరనియు, నీ రాజాగారిరీతి నే జమీాందారుఁ డనుసరించినను తాను లాభమును పొందుటయెకాక తన ప్రజలయొక్క స్థితిగతులంగూడ విశేషాభివృద్ధికిం దెచ్చునని యుం జెప్పుచు, రాజాగారికి సౌఖ్యమును, నింక ననేకములగు కితాబులును, ఁగోరుచున్నాననియుం జెప్పెను.

ఇందుకు తగువిధమున రాజాగారు జవాబిచ్చిరి.

ఈ పైకితా బివ్వఁబడినపుడు మదరాసు మెయిలుపేపరులో నీ క్రిందివిధముగ వ్రాయఁబడియుండెను :—

"ఈ రాజాగారు రమారమి యిరువదియెనిమిది సంవత్సరముల ప్రాయముగలవారై యున్నారు. గుఱ్ఱపుసవారి బాగుగ చేయఁగలరు. వినోదవిద్యలయందును, వేటయందును, నాసక్తిగలదు. వీరియెడల రైతులు కనురాగముం గలదు. వీరి జాగ్రత్తగల జమీాదారీ వ్యవహారమే వీరి ధనవృద్ధికి గారణము.

వీరు చాలాసాపుగ నింగ్లీషు వ్రాయను, జదువను, గలరు. వీరు తెలివి తేటలుగలవారు, మర్యాదావంతులునై యున్నారు. అనేకపర్యాయములు దూరప్రయాణముఁ జేసినందున మూఁడు ప్రజధానులయందును చాలామందితో స్నేహముజేసిరి."

ఈ సంవత్సరము అక్టోబరునెలలోఁ బ్రస్తుతపు బొబ్బిలి మహారాణిగారైన వీరి మూడవభార్యను వివాహమాడిరి. ఈమె యక్కగారే వెంకటగిరి రాజాగారియొక్క ప్రస్తుతపు భార్య గారై యున్నారు. ఈ యూరికి మైలున్నరదూరములో వీరు వేయించిన రాజమోహన్ బాగులో రాజమహలును గట్టించిరి. ఈభవనము రాజాగా రప్పుడప్పుడు వెళ్లి మార్పుకొరకు నివసించుటకును, ప్రసిద్ధులగు నతిథులు బొబ్బిలికి వచ్చునపుడు వారల బసకొరకును గట్టించఁబడినది.

---

1889—1892.

ఈ రాజాగారి సోదరులగు వెంకటగిరి రాజాగారియొక్కయు, రాజా ముద్దుకృష్ణులుగారియొక్కయు, ముఖ్యమైన కోరికపైని వెంకటగిరికి వెళ్లి కుటుంబపు సొత్తులవిషయమై జరిగిన రాజీకి బ్రధానకారకులై యుండిరి. కుటుంబపుటాస్తి నిర్ణయ దస్తావేజు 1889-వ సంవత్సరం ఏప్రిల్ తే 8 దీని పుట్టినది. వీరింపనిమిత్తముగానే వెంకటగిరిలోను, మదరాసులోను నాలుగుమాసములవరకు నివసించిరి. మఱియు సంవత్సర మాఖరు కాకమునుపే వీరితండ్రిగారగు వెంకటగిరి లేటు రాజాగారివలన,

వారికి వెంకటగిరి యెస్టేటులోనుంచి యిప్పించఁబడవలసిన మెయింటినెన్సువిషయ మేర్పాటుచేయగలందులకై వీరు వారి వలన పిలువంబడిరి. లేటు రాజాగారు తమ జ్యేష్ఠకుమారు లగు ప్రస్తుతపు వెంకటగిరి రాజాగారిని దాము కోరినంత మొత్తము నిచ్చుట కొప్పించుటకుగాను, దమ యొదవకుమారు లగు రాజా ముద్దుకృష్ణయ్యగారికి దుర్బోధనలుచేసి వారిచే రాజ్యవిభాగపు దావానుఁ దెప్పించిరి. అంతియగాక దమ కనిష్ఠ కుమారులగు రాజా వేణుగోపాలకృష్ణయ్యగా రప్పటికి మైనరుగా నున్నందున వారికొరకు మరియొకరిచే నట్టి దావానే తెప్పించిరి. ఆరవకుమారులగు రాజా వెంకటకృష్ణయ్యగారు తమ తండ్రిగారి ప్రోత్సాహమునకు లోఁబడ లేదు. వారి ననుకూల పరచుటకు బొబ్బిలి రాజాగారికి సుమారు మూడుసంవత్సర ములకాలము పట్టినది. వీరు ప్రతిసంవత్సరమును మదరాసుకు వెళ్లి మూడు నాలుగుమాసముల చొప్పున నుండుచు నాఖరుకు వారలలో వారికి రాజీజేసిరి. వారలనఁగా పెదరాజాగారు, ప్రస్తుతపు రాజాగారు, రాజా ముద్దుకృష్ణయ్యగారునై యున్నారు. ఈ రాజీ జరుగకముందే రాజా వేణుగోపాలకృష్ణయ్యగారు మైనారిటీ వదలి తమకొరకుగా నొకరిచేఁ దమతండ్రిగారి దుర్బోధనవలన దావా తెప్పించఁబడినదని తెలిసికొని దావాను తీసివేసికొనిరి. రాజా ముద్దుకృష్ణయ్యగా రీసంగతి నెరిగినవారు గావున దండ్రిగారు కోరిన మెయింటినెన్సులోని యొకభాగము నిచ్చుట కొప్పుకొని దావానుఁ దీసివేసికొనిరి. ఈ విషయమునకు

గాను మదరాసుకు ప్రతిసంవత్సరము వెళ్లడపు శ్రమఁదొలగించు కొనుటకుగాను బొబ్బిలి రాజాగారును తండ్రిగారివలన గోరఁ బడుచుండిన మెయింటినెన్సుయొక్క మిగతభాగము నిచ్చుట కొప్పుకొనిరి. పాపమీ వృద్ధరాజాగారీ మెయింటినెన్సును చాలాకాల మనుభవించకనే 1892-వ సంవత్సరం జూన్ నెల తే 6 దీని వైకుంఠవాసులైరి.

ఈ రాజీ విషయమై లార్డు కాన్నిమారాగారు వెంకట గిరి రాజాగారికి వ్రాసినయుత్తర మీక్రిందిదై యున్నది.

"మై డియర్ రాజా,

మేనెల తే 6 దీ గల మీయుత్తరము చేరినది. మీ తండ్రిగారి దుర్బోధనవలన మీ యెస్టేటు విభాగముకొరకు వచ్చిన దావా తీసివేసి కొనఁబడినదని వినుటకు నిజముగ నాకు నిండా సంతోషమైనది.

కుటుంబకలత లెల్లప్పుడును ముఖ్యముగ నసహ్యమైనవై యున్నవి. మీ సోదరుఁడగు బొబ్బిలిరాజు నిండా తెలివి గలవాఁడు. అతనివిషయములో నాకు నిండా గురుతుకలదు. ఈ రాజీలోఁ బ్రవేశించుట మంచిపని జేసెను.

మీ కుటుంబముయొక్క క్షేమమును గోరుచున్నాను.

కాన్నిమారాయని యున్నది."

---

1888-వ సంవత్సరము మొదలుకొని లేటు విజయనగరపు మహారాజావారును, నీ బొబ్బిలి రాజాగారు నెక్కడెప్పుడు

గలిసికొనినను విశేషమైత్రితో మాటలాడుకొనుచు నుండే వారు. 1891-వ సంవత్సరములో లేటు విజయనగరపు మహా రాజావారు మదరాసులో నాకస్మికముగ నొకరోజున రాజాగారి బసకు వచ్చిరి. అప్పుడు దైవవశమువలన వీరు నింటివద్దనుం డిరి. వీరు మరుచటిదినమున వారి బసకు వెళ్లి కలిసికొనిరి. అదిమొదలు లేటు మహారాజావారు కాలగతి నొందువరకు దరుచుగ మదరాసులో నొకరిచోటున నొకరు వెళ్లి కలిసికొను చుండిరి.

1892-వ సంవత్సరమున మదరాసులో నీ రాజాగారు ఘనతఁజెందిన లార్డు ల్యాండ్సు డవును వైస్‌రాయిగారి దర్శ నముం జేసికొనిరి.

ఈ సంవత్సర మాగష్టునెల తే 29 దీని రాజాగారికి నొక కుమారుఁడు జన్మించెను. వీరిపేరు రాజా శ్రీరామకృష్ణ రంగారావు బహదరుగారు.

ఈ రాజాగారు మదరాసులో 1889-వ సంవత్సరములో శ్రీవిక్టోరియా చక్రవర్తినిఁగారి మనుమలగు గతించిన ప్రిన్సు ఆల్బర్టు విక్టరుగారియొక్కయు, 1891-వ సంవత్సరములో శ్రీ రష్యా చక్రవర్తిఁగారి జ్యేష్ఠపుత్రునియొక్కయుం దర్శనముం జేసి కొనిరి.

వీరు 1892-వ సంవత్సరం మెయి తే 21 దీని ర్పూ. 542—11—2 లు సాలీయానా రాబడిగలిగినట్టి గ్రామమును పది వృత్తులుగ నేర్పరచి శ్రీరామకృష్ణపురమను నగ్రహారముంజేసిరి.

---

1893.

ఈ సంవత్సరము ప్రస్తుతపు రాజాగారి పరిపాలనకాలములో ముఖ్యమైనదియు, విశేష సంతోషకరమైనదియునై యున్నది. ఏప్రిల్ నెల తే 14 దీని రాజాగారు యూరోపుదేశ యాత్ర నిమిత్తము వెడలి వీరి కుమారులగు కుమార రాజాగారి నింగ్లీషుపాధ్యాయుని వశమున మదరాసులో విడిచి వెంకటగిరిలోని తల్లిగారివద్దను, సోదరులవద్దను, శలవుంగైకొని బొంబాయిలో స్టీమరు నెక్కి, మార్సేలిస్సను పట్టణమువద్ద స్టీమరు దిగిరి. అచ్చటినుండి పారీసునగరమునకు వెళ్లి కొన్ని దినములచటనుండి మే నెల తే 19 దీని లండనుపురికిం జేరిరి. మదరాసు గవర్నరుగారగు 'లార్డు వెన్లాకు'గారు దయతో స్టేటు సెక్రిటరీ మొదలగు తగువారికి సిఫారసుత్తరములను వీరికిచ్చిరి. వీరి కనిష్ఠ సోదరులగు రాజా వేణుగోపాల బహదరుగారు మదరాసునుండి వీరివెంట వెళ్లిరి. హెర్. మెజస్టీగారి తరపు హి. రా. హై. ది. ప్రిన్సు ఆఫ్ వేల్సుగారు 'సెంటు జేమ్సు' నగరుననిచ్చిన 'లెవీకి' వీరిరువురు వెళ్లిరి. ఆ నగరిలో యంబాసిడర్సు మొదలగు గొప్పవారు వెళ్లు దేవిడినుంచి వీరు వెళ్లుటకుత్తరువైనది. ఆ లెవీలో నిండియా స్టేటు సెక్రిటెరీగారివలన బేరొక్కనఁబడిరి హెర్. మెజస్టీగారి జన్మ తిథ్యుత్సవమునాడు మామూలుగా ఫారెన్ ఆఫీసులో నివ్వఁబడిన యాదరణోత్సవమునకు వెళ్లిరి 'బకింగ్‌హాము'నగరులో జరిగిన రెండు రాజవిందులకును, నొక రాజ సంగీతపు కచేరికిని ప్రైవేట్ యంట్రీని వెళ్లిరి. హి. రా

హై. ది. ప్రిన్సుగారివలన నొకపబ్లికు భవనమునకు హస్తిభారపు రాయివేయఁబడిన యుత్సవమునకు డ్యూక్. ఆఫ్. కేంబ్రిడ్జిగారి వలన నాహ్వానించబడిరి. మరియు జూలై నెల తే 19 దీని హి. రా. హై. ది. డ్యూక్ ఆఫ్ కన్నాటుగారి దర్శనమునుఁ జేసి కొనిరి. అప్పుడు డ్యూక్‌గారు రాజాగారిని పునహాలో జూచి నది జ్ఞాపకమున్నదని శెలవిచ్చిరి. హెర్. మెజస్టీగారి దర్శనముం జేయుటకై ప్రిన్సుగారివలన నీయఁబడిన 'గార్డెన్ పార్టీ'కి వీరిరువురు వెళ్లిరి. హి. రా. హై. ది. డ్యూక్ ఆఫ్ యార్కు గారి వివాహమునకు ముందు వధూవరుల దర్శనార్థ మొక మహనీయునిచే నివ్వఁబడిన గార్డెన్ పార్టీలో నిండియా స్టేటు సెక్రిటరీగారా డ్యూక్‌గారితో నీ రాజాగారిని, వీరి సోదరులను మోలాఖీత్తుజేయించిరి. జూలై నెల తే 10 దీని హి. రా. హై. ది. ప్రిన్సు ఆఫ్ వేల్సుగారు రాజాగారికిని, వీరి సోదరులకును దర్శనమిచ్చి వీరితో గలిసికొనినందుకు సంతోషించితిమని శెల విచ్చిరి. దానికి రాజావారు తమరిటుల ప్రభుదర్శన మను గ్రహించుటయే మాకు విశేష గౌరవమని మనవిఁజేసిరి. విండ్సరుకోటలో జూలై నెల తే 17 దీని హెర్. మెజస్టీ చక్ర వర్తినిఁగారి దర్శనముం జేసికొని కృతార్థులైరి. ఈ యూరోపు దేశయాత్రలో నిదే ముఖ్యమైన విషయముగాన రాజాగా రపుడు వ్రాసిన దినచర్య పుస్తకములోని మాటలే యీ క్రింద వ్రాయఁబడినవి:—

"తే 17 ది. ఈ ప్రయాణములో ముఖ్యమైనదినము.

నేను నాబసను విడిచి పాడింగ్టన్ స్టేషనులో స్పెషల్ రెయిలు నెక్కి విండ్సరుకోటకు వెళ్లితిని. ఆ బండిలోనే శ్రీరాణి గారి రాజకార్యపు సభవారు కొందరు వెళ్లిరి. ఇండియాస్టేటు సెక్రిటరీగారి యేడేకాము స్టేషనుకు వచ్చి నన్ను కోటకుం దీసికొని వెళ్లెను. కోటనుండి వచ్చి కనిపెట్టియున్న యొకబం డిలో నేనును, ఆ యేడేకాము నెక్కి వెళ్లితిమి. ఆ బండికి రెండు గుఱ్ఱములు పూన్చబడినవి. ఆ బండి, కోచిమానువలన దోలఁబడక నందులో నొకగుఱ్ఱముమీద నెక్కినసవారుచే దోల బడెను. ఆ కోటలో నుత్తరువగునంతవరకు నిరీక్షించియుండుట కొక గదిలోనికిం దీసికొని వెళ్లబడితిని. అచ్చట కొన్నిఫల ములు ఫలహారమున కంపఁబడినవి. మూడుగంటలు కాగానే యుత్తరువుపై నేను పిలువఁబడి శ్రీరాణిగారి రూమువరకు నేడే కాముపలనం దీసికొని వెళ్లబడితిని. అచ్చట హాజరుగ కని పెట్టియుండిన యొకప్రభువు నన్నుఁ గలిసి శ్రీమహారాణిగారి రూసములోనికిం దీసికొనివెళ్లి యామెయెదుట నిలిపిరి. ఆమె నిలువఁబడియుండే యతిదయారసముతో 'షేక్‌హాండు' జేసిరి. హెర్. మెజస్టీగారి సంభాషణ కొంచెముసేపైనను బహుదయా సూచకముగాను, శ్లాఘనీయముగా నుండెను. వారిప్రక్క నున్నవారికుమార్తెయగు ప్రిన్సెస్. బియట్రిస్‌గారికి నన్ను మిగుల దయతో మొలాఖత్తు జేసిరి. హెర్. మెజస్టీగారు 74 సంవత్సరముల ప్రాయముఁగలవారైనను నేను వేసికొని వెళ్లిన మన హిందూదేశపు యుడుపులను జాగ్రత్తతో బరీక్షించిరి.

వారి సంభాషణ నిండు దయగలదిగా నుండుటయేగాక, వాక్చాతుర్యము నిండా మెచ్చఁదగియుండెను. గాన నేబదియారు సంవత్సరములనుండి ప్రభుత్వముం జేయుచుండిన యీ ప్రభురాలిదర్శనము నాకు లభ్యమగుటకు విశేష సంతోషము గలుగుటయేకాక గొప్ప గౌరవమును సహా గలిగినవాఁడనైతిని. ఇంగ్లాండుకు వెళ్లి హెర్. మెజస్టీగారి దర్శనముం జేయవలెనని నాకు బాల్యమాదిగాఁ గోరిక యుండెను. అది యిప్పుడు నెరవేరినది. అటుతర్వాతఁ గొంతసేపటికి రాజకీయ సభవారును, నేనును కోటను విడచి స్టేషనుకు వచ్చి స్పెషల్ బండిమీదుగా లండను నగరముఁ జేరితిమి. ఇంత దూరదేశమునకు వచ్చిన నా కిపుడు తనివితీరినది. మదరాసు రాజధానినుంచి యీ దేశమునకు వచ్చిన రాజులలో మొదటిరాజును నేనేయని చెప్పఁదగియున్నది.

ఓ యభీష్టదైవమా! వందనము. ఇదియె నాజీవితకాలములో సౌఖ్యకరమైనదినము."

దర్శనమైన కొద్దిదినములలోనే హెర్. మెజస్టీగారు తమ చేవ్రాలుగల తమ ఫొటోగ్రాపును రాజాగారికి నంపిరి. దాని నందుకొనుచు హెర్. మెజస్టీగారి సెక్రిటరీగారికి వ్రాసిన జాబులో, జేయఁదగిన వందనములం జేయుచు, రాజభక్తినిఁ గనఁబరచుచు, హెర్. మెజస్టీగారి జూబిలీ జ్ఞాపకార్థ మొక మార్కట్టును బొబ్బిలిలోఁ గట్టించితిమనియు, శ్రీమహారాణిగారు తమకు దర్శనమొసంగిన యంశమునకు జ్ఞాపకార్థముగా బొబ్బి

లిలో నొక టవునుహాలుం గట్టించెదమనియు, దానికి 'విక్టోరియా టవునుహాలను' పేరుంచుట కనుజ్ఞ దైచేయుటకుం బ్రార్థించు చున్నామనియు, హెర్. మెజస్టీగారి ప్రశస్తమైన యీ బహు మతికొరకు తమ యనేకవందనములను, ప్రభుభక్తినీ, కృతజ్ఞ తను, శ్రీవారికి తగురీతిని శృతపర్చుమనియుఁ గోరిరి.

ఇందువిషయమై యీ దొరవారు వ్రాసిన జవాబు:—

"అయ్యా!

మీ రంపినజాబును శ్రీమహారాణిగారి సన్నిధిలో సునామనీ చేసితిని. మీరు శ్రీమహారాణిగారి దర్శన జ్ఞాపకా ర్థమై యొక టవునుహాలుం గట్టించ నుద్దేశముగలవారైనది విని సంతసించితిమనియు, దానికి విక్టోరియా టవునుహాలను పేరు నుంచుట కుత్తరువు ననుగ్రహించితిమనియు మీకుం దెలుప మని నా కాజ్ఞఁ జేసిరి.

యచ్. యఫ్. పోన్సన్బీ, యనియున్నది.

---

రాజాగారు డ్యూక్ ఆఫ్ యార్కుగారి భార్యకు వివాహ కాలమందు నొక పనివానితనముగల దంతపుపెట్టె నంపించు కొనిరి. దాని నంగీకరించుచు సంతోషించితిమని జవాబు వ్రాయించిరి. శ్రీమహారాణిగారికి నొక దంతపు పెట్టెను దాఖలుజేసిరి. సెంటుమేరీ ఆసుపత్రికి 100 గినీ కాసులుం జందా నిచ్చిరి. ప్రధానమంత్రి మొదలగు ననేకులగు మహనీయుల గృహములలో జరిగిన యుత్సవములకు వెళ్లిరి. ఇండియా

స్టేటు సెక్రిటరీగారు మొదలగు కొందరు గొప్పవారల దర్శనముం జేసిరి. ఉత్సవ సమయములలో మిగిలిన రాజకుటుంబస్థుల యొక్కయు, మరికొందరి ప్రభువులయొక్కయు మొలాఖత్తు జేసిరి. అచ్చటనుండు కాలములో బ్రైటను, ఆక్సుఫర్డు, లివర్ పూలు, ఎడింబరో, జెస్ఫర్డు, యనుపట్టణములంజూచిరి. లండను నగరమువిడిచి యూరప్ దేశములోని పారీసు, లూసరన్, వెనీస్, ఫ్లారెన్సు, రోము పట్టణములం జూచుకొని బ్రిండిసీలో స్టీమరు నెక్కి బొంబాయికి సెప్టెంబరునెల తే 2 దీని జేరిరి. ఆ నెల తే 13 దీని బొబ్బిలిలో సురక్షితముగ బ్రవేశించిరి. వీరీ యాత్ర జేసినందుకుగాను వెంకటగిరి, బొబ్బిలి, ప్రజలు అడ్రెసుల నిచ్చిరి.

ఈ రాజాగారు శ్రీవేణుగోపాలస్వామివారి యాలయములో బ్రత్యేకముగ నాలయములం గట్టించి శ్రీసీతారామ రాధాకృష్ణస్వాముల నాయాలయములలో బ్రతిష్ఠ జేయించిరి.

1894.

రాజావారి యాహ్వానముపైని ఘనతజెందిన లార్డు వెన్లాకు గవర్నరుగా అక్టోబరునెల తే 4 దీని బొబ్బిలికి విజయముచేసి రాజమహలులో విడిదిజేసిరి. సాయంత్రము రాజాగారు తమ కుమారునితోఁగూడ వెళ్లి వారి దర్శనముం జేసికొని వచ్చిరి. వారి వెంబడినే శ్రీగవర్నరుగారు నగరులో రాజాగారికి 'రిటర్ను విజిటు' నిచ్చి విక్టోరియాటవునుహాలునకు హస్తిభారపురాతిని వేయునపు డీవిధముగ శెలవిచ్చిరి:—

"బొబ్బిలి రాజాగారూ, మరియు తగుమనుష్యులారా

మీరు గత సంవత్సరము ఇంగ్లాండుకు వెళ్లి హెర్. మెజస్టీ. యంప్రెస్‌గారి దర్శనముఁజేసికొని తత్సందర్శన జ్ఞాపకార్థమై కట్టింపఁబడుదానికి 'హస్తిభారపురాయి' (పునాదురాయి) వేయుమని నన్నుం గోరినందున నాప్రకారము జరిపించుటకు నాకు విశేష సంతోషమైనది. మీరిపుడు జేయఁబోవుదానికంటె ననుకూలమైన మరియొకదాని నాదర్శన జ్ఞాపకార్థమై జేయఁజాలరని దలఁచితిని. అందుచే నిందుకుగా నేనిచ్చటకు వచ్చుటయు, నీహస్తిభారపురాయి వేయుటయుం జరిగినందుకు నాకు మిగుల సంతుష్టికరముగను, దృప్తికరముగనున్నది. హెర్. మేజస్టీగారియెడల మీకుంగల ప్రభుభక్తి, విశ్వాసములకును, మీకుటుంబములోనివారలవలన నెల్లప్పుడుం గనఁబరచఁబడు ప్రభుభక్తిసూచక ప్రవర్తనలకు నీభవనము శాశ్వత నిదర్శనమైయుండును. మీరాలోచించిన యిది యీదేశపు ప్రజలకు మిక్కిలి యనుకూలమై యున్నది.

*　　*　　*　　*　　*　　*　　*

నేనిచ్చటికి వచ్చిన విషయమును సీమలోనివారలకు దెలుపుచు నీదేశమునకు సంబంధించిన ప్రతివిషయమున నాకుఁ బ్రీతిపూర్వకమైన యాదరణము కలదని వారలకుం దెలుపుదును. మరియు నీబొబ్బిలిలో దన ననుసరించియుండువారలకుం జేయఁదగినపనులం జేయుట కనుశక్తిగలిగినట్టియు, నెల్లప్పుడును హెర్. మేజస్టీగారియెడలఁ బ్రభుభక్తి, ప్రీతులం గనఁబరచుట

క్షాసక్తిగల యొక ప్రభువు గలఁడని చెప్పఁగలను. ఈ సుసమయ ములో మిమ్ముం గొనియాడుటకంటె నేనేమిచెప్పఁగలను. ఈ భవనము త్వరలోఁ గట్టఁబడి శాశ్వతమైనదై యుండును.

* * * * * * *".

రాజమహాలువద్ద జరిగిన విందుయొద్ద శ్రీ రాజాగారు శ్రీ రాణీగారియొక్కయు, గవర్నరుగారియొక్కయు నారోగ్యమును గోరిరి. అందుకు ప్రతిగా శ్రీగవర్నరుగారు రాజాగారి యారో గ్యమును నీక్రిందివిధమునఁ గోరిరి.

"దయతో నాయారోగ్యమునుఁగోరిన మీకును, దానిని విశేషాదరణముతో దీసికొనువారలకును నేవందనముం జేయు చున్నాఁడను. కొంతకాలముక్రిందట మీరు దయతో నన్నిచ్చ టకు రమ్మని కోరియుండిరి. ఆ చొప్పున నేనిచ్చటికి రాగిలిగినం దుకును, నేటిసాయంత్రమున నేనిచట హస్తిభారపురాతిని వేసి నందుకును, నాకు నిండా సంతోషము కలిగినదని చెప్పఁగలను.

* * * * * * *

ఇదిగో యిచ్చట నొకపట్టణమును, నొక యెస్టేటును, విశేష బాగుగను నేర్పుగను పరిపాలింపఁబడుచున్నవి. నాకందు విడిదియైన ప్రతిసమాచారమునుబట్టి యీదేశపుప్రజలు సుఖులై యుండిరనియు, నెమ్మదియు, నభివృద్ధియుంగలిగి సంతోషము తోనుండిరనియుం దెలియవచ్చినది. నిండాశ్రద్ధతో మీరు వారల క్షేమలాభములం గనిపెట్టుచుందురనియు నాకుఁదెలియ

వచ్చినది. అందుకుగా నేను గవర్నమెంటుతరఫున మనఃపూర్తిగ వందనములం దెలియజేయుచున్నాను.

*     *     *     *     *     *     *

మీవలెనే యీయుత్తర సర్కారులలోని భూఖామందు లభిరుచిగలిగి, యొకప్పుడైన సీమకువెళ్లి హేర్. మేజస్టీగారి దర్శనముం జేసికొని బ్రిటీషు రాజ్యమునకు ప్రభుభక్తియు, నను సరణయుం గలిగియుండుటకు నేను గోరుచున్నాను. నన్ను నీ విధముగ దయతో నాదరించినందుకు గవర్నమెంటుతరఫున వందనముం జేయుటకంటె నేనింకనేమి చెప్పఁగలను. ఈ నా విజిటు బహు సౌఖ్యకరముగను, యుల్లాసకరముగను యున్నది.

*     *     *     *     *     *     *."

శ్రీగవర్నరుగారు బొబ్బిలి లడాయి స్థలమునఁ గట్టఁబడిన స్తంభముయొద్దకు తే 5 దీ యుదయమున వెళ్లిరి. దీనిని 1891-వ సంవత్సరములో రాజావారు పూర్వపు కోటస్థలమువఁ గట్టించిరి. మరియు శ్రీగవర్నరుగారు తమ దొరసానికి బదులుగ సంస్థానపు ఘోషా ఆసుపత్రికి హస్తిభారపు రాతిని వేసిరి. అప్పుడు శ్రీగవర్నరుగారు యీరాతిని వేయుటకుగాఁ దమ్మును గోరినందుకు విశేష సంతోషమైనదనియును, తమ దొరసాని గారు రాఁజాలకపోయినందుకు జింతించితిమనియును, నీఘోషా ఆసుపత్రులవిషయమై మీకుటుంబమువారు చాలా ధన మిచ్చి రనియును, మదరాసు ఘోషా ఆసుపత్రికిఁ గేవల వెంకటగిరి రాజావారి యీవియె మూలమై యున్నందున మీకుటుంబము

వారికభిరుచిగలదనియు, నిది తయారైనపిదప స్త్రీలకు నిండా యాధారమైయుండుననియు, దీనిం జూచిన తగువారు మీవలె నిట్టిపనులం జేయుట కిదియె ప్రోత్సాహకమగుననియు, నీవిధముగ స్త్రీలకొరకు నుపయోగకరములగు కార్యములం జేయుటకు మీరు మార్గదర్శకులై యున్నందుకు మిమ్ములం గొనియాడుచుంటిననియు శెలవిచ్చిరి.

శ్రీగవర్నరుగారు నాటిదినము సాయంకాలమే విజయనగరముకు వెడలిపోయిరి.

రాజాగారు ఘోషా ఆసుపత్రిని, లేడీ అపాతికెరీ యుండుటకు బంగళాయును తామే కట్టించి వానిని శాశ్వతముగ జరుపుచుండుటకై రూ. 20,000 లను డిస్ట్రిక్టు బోర్డువారికిచ్చి వాటి నొప్పగించిరి.

ఈ జిల్లాకు ననేకోపయోగకార్యములంజేసిన టర్నరు కలెక్టరుగారియొక్క పేరు జ్ఞాపకముండునటుల దేనినైన నొక దానిం జేయవలయునను రాజాగారి ప్రోత్సాహమున విశాఖపట్టణములో నావశ్యకమైనసత్ర మాదొరగారిపేరుతోఁ గట్టించఁబడినది. దానికి వీరు రూ. 6,000 లు చందా నిచ్చిరి.

---

## 1895.

ఈ సంవత్సరపు సంవత్సరాది యుత్సవ సందర్భమున హేర్. మేజస్టీ చక్రవర్తినిగారు రాజాగారికి 'నైట్ కమాండరు ఆఫ్ ది ఇండియన్ యంపైరను' కితాబు ననుగ్రహించిరి. మద

రాసు మెయిలుపేపరులో పత్రికాధిపతి యీ క్రిందివిధమున రాజావారివిషయమై వ్రాసెను:—

"గొప్పకితాబులను జెందినవారిలో బొబ్బిలి రాజాగారే మనరాసు యిలాకావారిలోనివారై యున్నారు. ఈ ఘనుఁడు కనిపెట్టతగిన యభివృద్ధికరమైనకార్యములం జేయువారు. వీరు ఇండియాయొక్క యితర భాగములలోని యనేకులవలెగాక సీమకు నావికాయాత్ర జేయుటకు గల యడ్డముం దొలఁగ దీసికొనిరి. వారచటనుండి వచ్చినదిమొదలచట వారికిఁ గలిగిన యనుభవము వారిబుద్ధికుశలతచే విరివి చేయఁదగినదిగానున్నటుల బొటుబడుచున్నారు. లార్డు వెన్లాకుదొరగారీమధ్య నుత్తర సర్కారులకు వెళ్లినపు డత్యావశ్యకమైనట్టియు, ముఖ్యమైనట్టియు, రెండు భవనములకు హస్తిభారపురాళ్లను వేసిరి. సీమకు వెళ్లినందుకు జ్ఞాపకార్థమయ్యే వీటిని స్థాపించుచున్నామని రాజాగారే యొప్పుకొనుచున్నారు."

మేనెల తే 30 దీని నీలగిరిలో ఘనతజెందిన లార్డు వెన్లాకు దొరగారిచే రాజావారు పైనిజెప్పిన కితాబుచే నలంకరింపఁబడిరి. ఈవిధమైన యుత్సవములలో నిదియే ప్రథమమై యున్నది. హిస్. హైనస్. బరోడా గెయిక్వారు మహారాజావారాయుత్సవమునకు విజయంచేసిరి. రాజావారు బొబ్బిలికి వచ్చిన పిదపఁ బ్రజలిచ్చిన యడ్రెస్సుకు వందనముం జేయుచు, మీ కోరికలనన్నిటి నొక్కసారిగ దీర్చుటకు బూనుకొనఁజాలమనిన్ని, కాలక్రమమున నిందులో చాలావాటిని నెరవేర్చెదమనిన్ని

వ్యాఖ్యానము జేసిరి. ఈ సందర్భమునంబట్టి రైతులయం దను గ్రహించి రూ. 30,000 లు రిమిషను లిచ్చిరి. ఘనతజెందిన 'లార్డు యెల్జిన్' వైస్రాయిగారు మదరాసుకు వచ్చినపుడు రాజావారు వారి దర్శనముం జేసికొనిరి. ఆ వైస్రాయిగారి భార్యపేరున విక్టోరియా ఘోషా ఆసుపత్రిలో నొక 'బెడ్డు'ను స్థాపించిరి.

---

## 1896.

ఈ సంవత్సరములో రాజావారు మరియొక బెడ్డును వెన్లాకు దొరసానిగారిపేరుతో మీదఁ జెప్పఁబడిన యాసుపత్రి లోనే స్థాపించిరి.

నవంబరు నెల తే 3 దీని విశాఖపట్టణపు కలెక్టరు దొర గారగు 'హెూారర్' దొరగారు బొబ్బిలిలో గట్టించఁబడిన 'సంస్థానపు ఘోషా ఆసుపత్రిని' దెరచిరి.

లేటు విజయనగరపు మహారాజావారి స్థానమున చట్ట నిరూపణ సభలో రాజావారిని శ్రీగవర్నరుగారు మెంబరుగ నియమించిరి.

---

## 1897.

ఈ సంవత్సరపు క్షామనివారణార్థమై రాజావారు రూ. 10,000 లు జందా నిచ్చుటయెగాక వచ్చిన బీదలకందరికి బీదల సత్రములో నన్నముఁ బెట్టించిరి. చెరువులు మొదలగువాని

మరమ్మతుల నిమిత్తమై రూ. 25,000 లను ఖర్చుజేసిరి. నిరు పేదలకును, సంస్థానపు నవుకరులకును చౌకధరలకు ధాన్య మమ్మించిరి.

హెర్. మెజస్టీగారి 'డైమండు జూబిలీ' జ్ఞాపకార్థమై రాజావారు దర్బారు జేసిరి. ఆ దర్బారు కన్ని తెగలవారును వచ్చియుండిరి. రాజావారి యుపన్యాసము తరువాత ననేకోపన్యాసములు జరుపఁబడెను. ఈ శుభసమయమునకుగా సంతోషపూర్వకమైన యడ్రెస్సును వెండిపెట్టెలోనుంచి హెర్. మెజస్టీగారికి పంపించిరి.

ఈ సంవత్సరాంతమున జరిగిన శ్రీవెంకటగిరి కుమారరాజావారి వివాహమునిమిత్తము రాజాగారు వెంకటగిరికి వెళ్లి యుండిరి. అప్పటిలో వీరి సోదరులగు వెంకటగిరి రాజాగారికిని, రాజా ముద్దుకృష్ణయ్యగారికిని కొన్ని స్వల్పమనోమాలిన్యములు కలిగియుండెను. వాటి నా వివాహసమయమునకు రాజాగారనుకూలముగ రాజీచేసిరి.

---

1898.

రాజావారి యాహ్వానముచే ఘనతజెందిన సర్. ఆర్థర్. హావిలాక్, గవర్నరుగారు విక్టోరియా టవునుహాలును దెరచుటకు ఫిబ్రవరునెల తే 21 దీని బొబ్బిలికి దయచేసి రాజమహలులో బసఁజేసిరి. నాటిదినమున జరిగినవిందున శ్రీగవర్నరుదొరవారు రాజావారి యారోగ్యముంగూర్చి యిట్లు ప్రతిగా ననిరి:—

"నాయారోగ్యముం గోరుటలో స్తుతిపూర్వకమైన మీ దయగల వాక్యములంగూర్చి మీకు వందనముం జేయుచున్నాము. రేపటిదినమున నే జేయఁబోవు టవునుహాలుం దెరచెడవు యుత్సవమునిమిత్తమై రాజావారు చెప్పినప్రకారముగ వారి యాహ్వానమే, నే నీసర్కారులకు వచ్చుటకు నిశ్చయమైన కారణము. అవకాశమైతేమాత్రము ఈ వైపునకు రావలెనని తలంచియుండిన నే నీయుత్సవమునకుగాఁ జేసిన కరారుంబట్టి నా ప్రయాణమును మరియొక సమయమునకు మార్చుకొనుట కవకాశము లేకవచ్చితిని. ఐనను చాలినంతకాలము గలిగియుండునటుల నేర్పరచుకొని యీదేశమునకు వచ్చి నేటి దినమున రాజాగారి కతిథిగ నుండినందుకు నాకు నిండా సంతోషమైనది. హావిలాక్ దొరసానిగారుకూడా వచ్చియుంటే రాజాగారి కింతకంటె నధికమైన సంతోషము గలిగియుండుటకు సందియము లేదు. అయితే రాజావారు చెప్పినటుల నిది దూరపుప్రయాణమగుటయే కాక బహుతొందరగ జేయఁబడు ముసాఫరీయైనందున నామె రాఁజాలకపోయిరి. ఆమె కిట్టిదూరపుతొందరప్రయాణముం జేయుట యసాధ్యము. నేను కూర్చుండుటకుమునుపే బొబ్బిలి రాజాగార్కి యారోగ్యమును గోరి పానము జేయుటకు, తగుమనుష్యులారా, మిమ్ములం గోరుచున్నాఁడను.

ఈ బొబ్బిలి రాజాగారు మనకందరికిం దెలిసినటుల నీ దేశమున జరిగిన యుద్ధములలోఁ బ్రసిద్ధికెక్కినట్టియు, నీ సర్కారుల చరిత్రలోఁ గమనించఁదగినట్టియు వంశముయొక్క

సంతతివారును ప్రతినిధియునై యున్నారు. ఈ రాజాగారు విద్యాసమర్థులును, మరియు దేశాటనముం జేయుటలోఁ గని పెట్టిచూచి తిరుగువారును, వీరొక పెద్ద భూఖామందులున్ను దాని నెట్లు పూర్తియైన లాభముతోఁ బాలించవలెనో యా విషయముం దెలిసినవారునై యున్నారు. మఱియు నాచట్ట నిరూపణసభలో మదరాసు రాజధానిలో విస్తారమైన భూఖా మందుల లాభముసుఁ దెలియఁజేయు విలువైన మెంబరుగ నున్నారని నే నిర్ధారణగ జెప్పఁగలను. ఈ మదరాసు రాజ ధానిలోను, మఱియు హిందూదేశములోను, నీ బొబ్బిలి రాజు గారివంటివా రనేకు లుండుట నా కిష్టమనియుం జెప్పఁగలను."

మరుచటిదిన ముదయమున రాజావారు శ్రీగవర్నరు గారి దర్శనముం జేసికొనివచ్చిరి. ఆ వెంబడినే శ్రీగవర్నరు గారు 'రిటర్న్ విజిటు'కు నగరిలోనికిఁ దయచేసిరి. నవీనముగ దయారయిన 'దర్బారు మహాలు'లో వీరికి రాజావా రతిథి సత్కారముం జేసిరి. ఈ మహా లిదిమొదలుగ వాడుకజేయఁ బడుచున్నది. అచ్చటనుండి శ్రీగవర్నరుగారు విక్టోరియాటవును హాలునకు వెళ్లి 'డైసుబల్ల'మీద నాసనముం దీసికొనఁగానే రాజావా రా టవునుహాలుం దెరువమని యథావిధిగఁ బ్రార్థించి టవునుహాలుయొక్క వెండిబీగమును శ్రీగవర్నరుగారి కందఁ జేసిరి.

ఆ పైని శ్రీగవర్నరుగా రిట్లు శలవిచ్చిరి:—

"ఈ రాజాగారి (విపులముగఁ దెలియఁదగినట్లు) టవును

హాలుం గట్టుటకు గల యుద్దేశమును, జరిత్రను, వ్యక్తపరచిరి. కాని బ్రసిద్ధికెక్కిన నా పూర్వపు గవర్నరుగారివలన నారంభించఁబడిన యీ పనినిఁ బూర్తిజేయుటకుగా నన్ను గోరినందుకు నాకు సంతోషమును, గౌరవమునుఁ గలదని జెప్పుటకంటె నందువిషయమై చెప్పుటకు మరియేమి యున్నది. దీనిం గట్టించుటకు రాజాగారికి గల యుద్దేశమును నేను మనఃపూర్తితో మెచ్చుకొనుచున్నాను. మఱియు బొబ్బిలి పురజనులకు రాజావారివలన నీయఁబడిన యీ గృహము వారికి చిరకాలముపయోగించునని నమ్ముచున్నాను. ఈ మాటలతోనే యీ విక్టోరియాటవునుహాలు యథావిధిగ దెరచఁబడినదని దెలియఁజేయుచున్నాను."

ఆపైని యా టవునుహాలులోనే పురజనులును, జమీందారియందు నివసించువారలును శ్రీగవర్నరుగారికి నొక యడ్రెస్సు నిచ్చిరి.

అందుకు శ్రీగవర్నరుగారు వందనముం జేయుచు, బొబ్బిలి రాజాగారు మీ కుపయోగకరములైనట్టియు, విలువైనట్టియు, ననేక కార్యములను జేసియుండిరనియు, మీరు వారిని స్తుతించినందుకు విశేష తృప్తినొందితిననియు, పాఠశాలలు, ఆసుపత్రులు, ఇంక యితరములైన ధర్మకార్యములును, నీటివసతియును సమృద్ధిగఁ గలుగఁజేసిరని మీరే జెప్పుచుంటిరనియు, ఇటుల మీరు జెప్పుకొనుట వివేకవతులగు మీ రాజావారిని విశేష కృతజ్ఞతతోఁ గొనియాడుచుండుటయేయనియు

వారి యౌదార్యముం బట్టి మీరు నన్నడుగవలసిన దేదియు లేదని మీరే చెప్పుచుంటిరనియు, శెలవిచ్చిరి.

* * * * * * *

క్షామనివారణార్థమై బొబ్బిలిచుట్టు నున్నవారికి రాజావారు చేసిన సహాయమునకును, గవర్నమెంటువారి యుద్యోగస్థు లతిశ్రద్ధాభక్తులతో గష్టసమయములో పాటుపడినందుకు గవర్నమెంటుతరపున శ్రీగవర్నరుగారు మెచ్చుకొనిరి. అటు తరువాత శ్రీగవర్నరువారు యుద్ధస్తంభమును, సంస్థానపు ఘోషా ఆసుపత్రిని జిత్తగించి రాజమహాలుకు వెళ్లి నాటి మధ్యాహ్నమే బయలుదేరి విజయనగరముకు వెళ్లిరి.

ఈ యేప్రిల్ నెల మధ్యభాగములో శ్రీబొబ్బిలి కుమార రాజావారియొక్క వివాహ మతివిభవముతో జరుపబడినది. రాజావారి తల్లిగారును, వెంకటగిరి రాజా కె. సి. ఐ. ఇ. గారును, భార్యాసహితముగ రాజా ముద్దుకృష్ణయాచేంద్రులువారును, మఱియు రాజా వెంకటకృష్ణయాచేంద్రులువారును వెంకటగిరినుండి వచ్చిరి. మదరాసునుండి రాజా వేణుగోపాలకృష్ణయాచేంద్రులువారును, శ్రీపిఠాపురపు కుమార రాజావారి ద్వితీయపుత్రులును వచ్చియుండిరి. సంగంవలస జమీందారుగారును వివాహమునకు వచ్చియుండిరి.

ఘనతజెందిన శ్రీగవర్నరుగారు రాజావారిని చట్టనిర్మాణ సభలో మరల మెంబరుగ నిర్ణయించిరి. ఈ సంవత్సరం జూన్ నెలలో రాజావారు నీలగిరివెళ్లి యచట జరిగిన చట్టనిర్మాణ

సభలో 'మదరాసు రైతువారీ బిల్లు' (టెనెన్సీబిల్లు) నంతయు నెదిరించి యాక్షేపించిచెప్పిరి.

---

1899.

శ్రీరాజావారి ప్రపితామహీగారు తొంబది సంవత్సరములు జీవించి మేనెలలో వైకుంఠవాసినులైరి. ఆమెయెడల రాజావారికిని, యామె నెరిగిన ప్రతివారికిని, విశేష గౌరవముగలదు. గాన రాజావారు విశేష భక్తిశ్రద్ధలతో నుత్తరక్రియలం జరిగించిరి. ఆయమ తమపౌత్రుని పౌత్రులగు శ్రీకుమార రాజావారినిం జూచెను. ఇది దుర్లభముగదా! ఈ పూజనీయురాలి పేరితో మదరాసులోని 'విక్టోరియా ఘోషా ఆసుపత్రి'లో రాజాగారు లోకశాశ్వతపు 'శయ్యను' స్థాపించిరి.

విశాఖపట్టణనివాసుల కోరికపైని శ్రీరాజావారు హెర్. మేజస్టీగారియొక్క 'డైమండుజూబిలీ' జ్ఞాపకార్థమై యచట నొక టవునుహాలుం దామే గట్టించెదమని వాగ్దానము జేసిరి. అది 'విక్టోరియా డైమండుజూబిలీ టవునుహాలని' పిలువంబడును.

అక్టోబరు నెల తే ౧౨ దీని శ్రీకుమార రాజావారికి సుపుత్రిక జన్మించెను. రాజాగారి కీబిడ్డ మొదటి మనుమరాలు. ఈయమకు శ్రీవిక్టోరియా వెంకటరమణమ్మగారని పేరుంచంబడెను. ఈపేరులోని విక్టోరియా యనుభాగము రాజాగారికి హెర్. మేజస్టీ. చక్రవర్తినిగారి యందుగల భక్తి విశ్వాస ప్రేమలంబట్టి యుంచంబడెను.

---

## 1900.

రాజావారీసంవత్సరము జరిగిన పారీసు సంత జూచుటకుగా నింగ్లాండుకు దిరిగి వెళ్లుటకు గాచియుండిరి. కాని వీరి ప్రపితామహీగారి ప్రథమాబ్దికము మేనెల కడపటి భాగమందుఁ దటస్థించినందున నాపైని బయలుదేరినచో, 'నరేబియా' సముద్రములో తుపానులు సంభవించునని సీమకు వెళ్లుట మానిరి.

శ్రీగవర్నరుగారీరాజాగారి నేప్రిల్ నెలలో మూడవసారి 'చట్టనిర్మాణ సభలో' (లెజిస్ లేటివు కౌన్సిల్) మెంబరుగ నియమించిరి.

మేనెల ప్రారంభమున పాచిపెంట సమీపమున కొండవాండ్లనేకులుచేరి పితూరిజేయఁ దలఁచియుండఁగా రాజావారు గవర్నమెంటుకు దాని నణచుటకై సహాయముం జేసెదమని యీక్రిందివిధమున విశాఖపట్టణపు కలెక్టరుగారికి వ్రాసిరి:—

" అయ్యా,

ఈ మధ్య నిద్దర బోలీసు కానిస్టేబులను జంపిన కొండవాండ్ల మూకనిమిత్తమై మీరు సాలూరు వచ్చినట్లు నాకు దెలియవచ్చినది. ఇంతియకాక విశాఖపట్టణములోనుండు 'రిజర్వు పోలీసు' వారలు త్వరలో వచ్చెదరని వింటిని. నేను సమీపములోనుంటినిగాన గవర్నమెంటుకు సహాయుఁడనగుటకు గోరుచున్నాను. నాయొక్క శిఫాయిలు, వెలమవారు మీకు హెచ్చుగ నుపయోగింతురని నా తాత్పర్యముగాదు. అయితే

గ్వర్న మెంటువారియెడల నాకుంగల రాజభక్తిం జూపుట కవకాశమును దయచే గలుగఁజేయుటకు మిమ్ముం బ్రార్థించుచున్నాను. పూర్వకాలమందిట్టితరుణములలో మాపూర్వులకు నిటుల రాజభక్తింజూపుట కవకాశ మిచ్చియున్నారు. అల్లర స్థలమునుంచి తంతియుండుచోటువరకు శీఘ్రముగా వార్తలంపుటకు గుఱ్ఱపు సవారులు గావలసినను, కొండలమీద భారపు సామానులు మోయుటకు నేనుఁగులు కావలసినను తమయొద్ద కంపుటకు సిద్ధముగ నున్నాను.

పి. యస్. రంగారావు, కె.సి.ఐ.ఇ. అని యున్నది.

రాజా ఆప్ బొబ్బిలి.”

అందుకు కలెక్టరుగారు వ్రాసిన జవాబు:—

ఈ నెల తే ౫ దీని వ్రాసిన మీయుత్తరమునకు నందు వ్యక్తపఱుపఁబడిన కాలానుగుణమైన సహాయముం జేసెదమని నందుకు మనఃపూర్వకముగ వందనముం జేయుచున్నాననియు, నవసరము దటస్థించినచో మీసహాయముం గోరెదనని యిదివరకొకజాబు వ్రాసియుంటిననియు, నిప్పుడట్టితరుణము లేదని చెప్పుటకు సంతోషముగనున్నాఁడననియు, నీవిషయమును గవర్న మెంటువారికి సంతోషముతో విశదపరచుచున్నాననియును కలెక్టరుగారు జవాబు వ్రాసిరి.

తిరిగీ జూన్ నెల తే 4 దీని కలెక్టరువారీ క్రిందివిధమున వ్రాసిరి :—

విశాఖపట్నం కలెక్టరువారి ఆఫీసు,
1900 సం॥ రం జూన్ తే 4 ౬.

"కలెక్టరును, జిల్లా మేజస్ట్రీటునగు హ్యారల్ట్ దొర గారివద్దనుంచి—

మహారాజా. సాహెబ్. మెహెర్బాన్. దోస్తాన్! మహా రాజా-శ్రీరావు ది హానరేబిల్ సర్ వెంకటశ్వేతా చలపతి రంగారావు బహదరు, కె. సి. ఐ. ఇ., బొబ్బిలిగారికి.

" మహారాజా,

మేనెల తే 9 దీని నేనుత్తరమును వ్రాసియుంటిని. మీరు రాజభక్తియుక్తమగు సహాయమును జేసెదమనినందుకు గవర్న మెంటువారి వందనములను మీకంపునటుల నాకుత్తరువైనది. దానిని మీకు సంతోషముతో దెలుపుచున్నాను.

ఆర్. సూర్యారావు అని యున్నది.
ఫార్ కలెక్టరు అండు మేజస్ట్రీటు."

---

ఈ సంవత్సర క్షామనివారణార్థమైన చందాకు మహా రాజావారు రూ. 5,000 ల నిచ్చిరి. సంస్థానపు బీదల సత్రము కొరకు నొక భవంతిని గట్టించిరి. అది హెచ్. మేజస్టీగారి జన్మ తిథియందు మొదటిసారి వాడుకజేయఁబడినది. ఇప్పటివరకు

మహారాజాగారు రూ. 27,777-13-5 ల ల రాబడిగల గ్రామములను, భూములను రూ. 698,820-7-9 లకుఁ గొనిరి. వీటిపైని పేష్కషు వగైరాలు రూ. 6,973-15-5 లైయున్నది. ఉత్తర సర్కారులలోని యనేకులగు జమీందార్లకును, ప్రొప్రైటర్లకును, ఋణముల నిచ్చియున్నారు. హెచ్. మేజస్టీగారి రెండు జూబిలీ యుత్సవముల సందర్భములలోను, నితర సమయముల లోను రైతులకు రూ. 393,361 లు రిమిషను క్రింద నిచ్చిరి.

హెచ్. మేజస్టీగారి గత జన్మదినోత్సవ సందర్భములో 'వైస్రాయి' గారు వీరికి 'మహారాజా' యను కితాబు నిచ్చిరి. ఈ విషయమై 'మద్రాసు మెయిల్ పత్రికాధిపతి' యిట్లు వ్రాసెను:—

"బొబ్బిలి రాజాగారికి మహారాజాయను కితాబునిచ్చుట మాకు సంతోషమని చెప్పఁగలము. ఈ బొబ్బిలి రాజుగారీమద్రాసు రాజధానినుండు జమీందారులలో ముఖ్యమైనవారిలో నొకరై యున్నారు. సరిహద్దుఁదగిన మదరాసు యిలాకా జమీదారీలలో నొకదానికి ఖామందులై యున్నారు. దాని నేవిధమైన నేర్పుతో నేలవలెనో యది వీరికిఁ దెలియును. వీరు బాగాజదివినవారు. మర్యాద నెరిఁగినవారు. సమర్థతతోఁ బాలించువారు. ప్రశస్తమైన తన జమీందారీని వృద్ధి నొందించుటకై బుద్ధికుశలతతోఁ దమ రాబడిని ఖర్చు జేయుచుందురు. ప్రతి సంవత్సరపు దసరాలోను గత సంవత్సరపు జమీదారీ వ్యవహార మెటు నడపఁబడినదో యావిషయము జదువఁబడును.

మాకుఁ దెలియవచ్చిన భోగట్టాలలో వీరు రైతులను బీడించి వసూలు జేయుచుండినటులఁ దెలియరాలేదు. అర్హమైన తరుణములలో 'రిమిషనులు' రైతులకు ధారాళముగ నివ్వఁబడుచుండును. రైతులకొరకు జెరువులు మొదలగు జలాశయములను, రోడ్లను, దారులను, మంచి స్థితిలోనుంచుటకుగా జాలాపని జరుగుచుండును. ఈ రాజాగారు ఇంగ్లాండుకు వెళ్లిరి. శ్రీమహారాణిగారివలన దర్శన మివ్వఁబడి గౌరవించబడిరి. ఈదర్శన జ్ఞాపకార్థమై బొబ్బిలిలో టవునుహాలుం గట్టించిరి. వారి రాజధానిలో నొక మంచి స్కూలు నుంచి యున్నారు. మరియు వీరు తరుచుగ మదరాసు చట్టనిరూపణ సభలో, మదరాసు భూఖామందుల తరఫున ప్రతినిధిగ నున్నారు. అచ్చట వీరు మితముగను, తెలివిగను, యంశములం జెప్పుచు నుందురు."

ఈ కితాబు సందర్భముం బట్టి పట్టణముయొక్కయు, సంస్థానముయొక్కయు, ప్రజలందరు నొక యడ్రెస్సు నీ మహారాజువారికి డిశంబరునెల తే 1 దీని దాఖలుజేసిరి. మరియు నేతద్విషయ జ్ఞాపకార్థమై చందామూలముగ 'మహారాజా పార్కు' యనుదానిం బ్రజలు వేయించిరి.

ప్రజల అడ్రెస్సుకు శ్రీమహారాజావారిచ్చిన జవాబు:—

"సుజనులారా!

మీరు నాకిప్పుడు మిగుల దయతోనిచ్చిన యడ్రెస్సునుఁగూర్చి మనఃపూర్వకముగ వందనముం జేయుచున్నాఁడను. ఈవెండిపెట్టెయందలి శిల్పము శ్రేష్ఠముగనున్నయది. మరియు

నిధి యీసమయమును జ్ఞాపకము జేయఁదగినదిగా నున్నది. మీరు నన్నుఁగొంతమట్టు స్తుతించినను, మన మదరాసు రాజధానియొక్క ప్రస్తుతపు, వెనుకటి గవర్నరుగార్లు నన్నుఁగూర్చి దయతో ప్రశంసించిన మాటలనే ఈ యడ్రెస్సులో మీరనువదించినందుకు నేను మిగుల సంతసించుచున్నాను.

ఈసమయ జ్ఞాపకార్థమై నే నేదైన నొకదానిం జేయుదునని నే నిందు నమ్మకముతో, మీ రీసమయమునఁ దేనినిం గోరుట మానితిమని జెప్పిరని తలఁచెదను. చేయఁబూనుట కేది యుచితమోయని నేను యోచించుచుండఁగా నాభార్యయగు మహారాణిగారు, నేను మీకుం జేయఁగోరున దెద్దియైన దానికిం దనపేరుంచుమని కోరిరి. ఈ రెండుప్రయోజనముల నెరవేర్చుకొనుటకై మీకు "మహారాణీ హిందూబాలికా పాఠశాల" నిచ్చుటకంటె మరియొకదానిం జేయ బూనుకొనజాలనుగదా! క్రైస్తవసంఘమువా రుంపించిన బాలికా పాఠశాలలుగల యనేక స్థలములయందును, గవర్నమెంటువారే "హిందూ బాలికా పాఠశాలలను" స్థాపించినారనే యంశము మీ కందరికిం దెలిసేయున్నది. కాబట్టి ముందు నేనుంచబోవునది, యిదివర కీపట్టణమున క్రైస్తవసంఘమువారివలన స్థాపింపంబడిన దానికిం బోటీగా నుండ నేరదు.

బొబ్బిలిపట్టణ నివాసులారా! నాయందు విశేష దయతోను, అనురాగముతోను, నాపేరున నొక "జన్మోద్యానమును" చందామూలముగ మీ రిదివరకే వేయుచున్నారు.

దానియొక్క రస్తాలును, చిన్న త్రోవలును, ప్రాకారములును, శీఘ్రముగా తయారగును. ఈసమయ జ్ఞాపకార్థమై మీరీ జనోద్యానమును వేయుచున్నందుకు నేను మీకు మిక్కిలి వందనముం జేయుచున్నాఁడను. పగటి వ్యాపారశ్రమను తీర్చు కొనుటకై, సాయంకాలమున మీరందరు విహరించుట కిది ప్రశస్తమైన స్థలమగునని నమ్ముచున్నాను. నేనింక జెప్పఁబోవు దానిని వినినచో, మీరందరు విశేషానందముం జెందుదురని నే నమ్ముచున్నాఁడను. అది కొంతమట్టు కాత్మస్తుతిగా నుండి నను నేను దానిం జెప్పనియెడల మీకుం దెలియఁబడదు.

నేను సుమారు 13 సంవత్సరముల ప్రాయముగలవాఁ డనై యుండఁగా నా జీవితకాలములో నెరవేర్చఁగోరిన 'యైదు మనోరథములం' దలంచుకొనియుంటిని.

(1) ఘనతజెందిన, ఇండియా చక్రవర్తినీగారి దర్శన ముంజేసి కృతార్థుండనగుటయు,

(2) కె. సి. ఐ. ఇ బిరుదునొందుటయు,

(3) చట్టనిర్మాణసభలో నొక సభ్యుఁడనగుటయు,

(4) మహారాజాయను బిరుదునొందుటయు,

(5) అయిదవది కేవల దైవికమైనది. అది నిండుగా నెరవేర్చఁబడినపుడు మీకుం దెలియఁగలదు.

కితాబులవిషయమైన నాకోరికలకు పూజ్యులగు మా పితామహులుగారు వైకుంఠవాసులగుతరి, మా పెంపకపు

తండ్రిగారితో శలవిచ్చినమాటలే యాధారముల్తై యున్నవని నొక్కి చెప్పఁగలను. మాతండ్రిగా రామాటలప్రకారము నెరవేర్చుకొనుటకు దగినంతకాలము జీవించియుండలేదు. అందరికిని తమ పూర్వులయొక్క మంచికోరికలను నెరవేర్చుట విధయైనసంగతి మీకందరికిం దెలియునుగదా! అందులో మా కుటుంబమువంటి కుటుంబములవిషయములోఁ జెప్పనేల!

మీరు మిక్కిలి దయతో నాకిచ్చిన యడ్రెసునుగురించి మీకు మరియొకసారి వందనముం జేయుచున్నాను."

డిశెంబరు నెలాఖరులో ఘనతజెందిన లార్డు కర్జన్ వైస్రాయిగారి దర్శనము మదరాసులో జేసికొనిరి. వెళ్లబోవు శ్రీగవర్నరుగారి భార్యగారిపేరున నొక శాశ్వతపు 'బెడ్డును' మదరాసులోని విక్టోరియా ఘోషా ఆసుపత్రిలో స్థాపించిరి.

---

## 1901.

శ్రీవిక్టోరియా చక్రవర్తినిగారు పరమపదించిన యతి దుఃఖకరమైన సమాచారము తంతిద్వారా తెలియఁగానే అన్ని ఆఫీసులు, స్కూలు మూయఁబడినవి. ఎవరును నగరులోనికి

శిరోవేష్టనములతో రాకుండునటుల వుత్తరువు జేయఁబడెను. దేవాలయములో సహా నాటిదినము వాద్యములు నిలిపివేయఁబడెను. నగరులో 31 ఫిరంగి కాల్చఁబడెను. జెండా సగముకు దించఁబడెను. నాటిదినము మొదలు హెర్. మేజస్టీగారి సమాధి దినమైన ఫిబ్రవరు తే 2 దీవరకు నగరులో నౌబత్తు మొదలగు నన్ని వాద్యములు నిలిపివేయఁబడి జెండా సగముకు దించఁబడియుండెను. ఆ చక్రవర్తినీ మహారాణివారి పాలనములోనుండు నందరికి నిర్ణయమైన విచారసూచకదినములలో సంస్థానము యిలాకా అందరుద్యోగస్థులును మహారాజావారి తోపాటు యెడమచేతికి నల్లగుడ్డ కట్టుకొనునటుల నుత్తరవుఁ జేయఁబడెను.

మరియు తమకుఁగల మనస్ఫూర్తియైన విచారమును ప్రస్తుతపు మన చక్రవర్తిగారికిఁ దెలుపుటకు గోరుచు ఘనత జెందిన మదరాసు గవర్నరుగారికిని, చక్రవర్తిగారియొక్క చీఫ్ సెక్రిటెరీగారికిన్ని తంతిసమాచారములు పంపిరి. సమాధి దినమునాడు 1,200 మంది బీదలకు నన్నము పెట్టించఁబడెను. నాటి సాయంకాలము రాజచిహ్నమైన ఫిరంగీదెబ్బలు, ఆఖరు దెబ్బ సూర్యాస్తమయముతో ముగియునట్లు ఫిరంగులు కాల్చఁబడి, జెండా దించివేయఁబడెను.

మార్చినెల తే 5 ది శ్రీవిక్టోరియా చక్రవర్తినిగారి మిమోరియల్ మీటింగులో శ్రీమహారాజావారిచ్చిన యుపన్యాసము:—

"సభాసదులారా!

మనమిప్పు డిచటఁ జేరినపని విచారగ్రస్తమైనదైనను సుగుణసంపత్తి గలిగినట్టియు, ప్రజలవలన బ్రేమించఁబడినట్టి పూజనీయులగు మన క్వీన్ విక్టోరియా చక్రవర్తినిగారి మరణ విషయమై మనకుఁగల విశేషానుతాపమును, భరింప శక్యము గాని దుఃఖమును వ్యక్తపరుచుట భృత్య న్యాయమైనందున మన మిచ్చటఁ జేరితిమి. ఈ మహారాణిగారు 1819-వ సంవత్సరం మేనెల తే 24 దీని జన్మించి, 1837-వ సంవత్సరం జూన్ తే 20 దీని రాజ్యభారమును వహించి, 63 సంవత్సరముల 7 మాసముల 2 దినములకాలము ప్రభుత్వముం జేసినపిదప దైవానుమతిని యుత్తరలోకమున కీ సంవత్సరం జనవరునెల తే 22 దీ సాయంకాలమున 6 గంటల 30 నిమిషములకు బిలుపింపఁబడిరి. ఈమెగారు మృతులగుటచే నన్నితరగతుల ప్రజలును బహు దుఃఖాక్రాంతులైరి. ఈపెగారి సుగుణసంపత్తి మనపురిలోని చాలామందికి దెలియఁబడనప్పటికిని ప్రతివారు నా దుఃఖకరమైన వార్తను భరింప శక్యముగాని విచారముతో వినిరి. ఈయమగారి సుగుణసంపత్తులు, అనఁగా ప్రభువుగా నుండురీతియు, భార్యగానుండు విధమును, తల్లిగానుండు మాదిరియు నితరులను సరిపోల్పతగనివై యున్నటుల మనకుఁ దెలిసినవయ్యే యున్నవి. మన హిందూశాస్త్రములలో సహస్ర మాస జీవులైనవారు పవిత్రులనియు, వారిచోటి కితరులువెళ్లి వారిం బూజించవలయుననియుం జెప్పంబడియున్నది. మాసము

లనఁగా చాంద్రమాసరీతిచే ననియు స్పష్టముగ జెప్పఁబడియుం డెను. ఈవిధముగ గణితింపఁగా నీ చక్రవర్తినిగారు వేయిన్ని పదిమాసములు జీవించిరి. సహస్రమాస జీవులే పూజనీయు లైనటులఁ జెప్పఁబడియుండఁగా నీ చక్రవర్తినిగారు సహస్రమాస ములు జీవించుటయె కాక యీ కలియుగములో నిండియాను బాలించినవారిలో నీయమయే యుత్తమ ప్రభురాలై యుండెం టంబట్టి మన మీామెగారియెడల మరెంత స్వామిభక్తి పూజ్య తం గనపర్చవలెనో చూడుడు! త్రేతాయుగములో శ్రీమహా విష్ణువుయొక్క యవతారమైన శ్రీరాములవారు, రాజును, కుమారుఁడును, భర్తయు, నెట్టి సుగుణసంపత్తి గలిగియుండవ లెనో యటులఁ బ్రసిద్ధికెక్కిరి. ఈ క్రింద నే జెప్పు నభిప్రాయ ములో మీాలో ననేకు లేకీభవించెదరని తలఁచెదను. గతిం చిన మన చక్రవర్తినిగారు తప్పక శ్రీ మహాలక్ష్మియొక్క యవ తారమై యితరులకు ప్రభువుయొక్క, భార్యయొక్క, తల్లి యొక్క సుగుణ సంపదలకు నిదర్శకురాలై యీ ప్రపంచ ములో జన్మించియుండి యుండవలెను.

ఓ సభాసదులారా!

ఇప్పు డిచటనున్న మీా యందరికంటె నే నీచక్రవర్తిని గారి మరణమునకు హెచ్చు ఖేదమును జెందియున్నాను. ఏల నంటే, ఈ మధ్య మీాకుఁ దెలిపియుండిన నా యైదుమనోరథ ములలోను మొదటిదియు, ముఖ్యమైనదియునైన దానిప్రకా రము నేను సీమకు వెళ్లి, విండ్సరుకోటలో మన ప్రియమైన తల్లిగారి దర్శనముంజేయు గొప్ప భాగ్యముం బడయుటయెగదా

ఈ మధ్య మదరాసు పట్టణనివాసు లచట 'టవును హాలులో' సభజేసి యీామె జ్ఞాపకార్థమై అందుకుగా నిర్ణయించఁబడిన కమిటీవారివలన ముందు నిశ్చయింపంబడునట్టి తగువిధమున నొకదానిని స్థాపించుట కేర్పరచిరి.

గనుక మనమందరముంగూడ నట్టి జనానుకూలమైన దానికిం జందాల నిచ్చి మనకు విశేష పూజనీయమగు నీ ప్రభురాలియందు భృత్యన్యాయమును, భక్తిని, యచ్చెరువును, ప్రేమను, కనఁబరచుట నా కోరికయై యున్నది.

ఇట్టి యసమాన చక్రవర్తినిగారియొక్క జ్ఞాపకార్థమైన దొకటి ప్రసిద్ధచారిత్రముఁగల మనపట్టణములో లేకుండఁ జూచుటకు నా కిష్టములేదు. తగుమనుష్యులారా! ఇచ్చటిదానికిం జందాల నిమ్మని మిమ్ముల నడుగుదునని తలంచవలదు దానిని నేనే మీకిచ్చెదను. అది "విక్టోరియా జ్ఞాపకార్థపుస్తకభాండారమై" యున్నది. అది మన విక్టోరియా టవునుహాలులోని యొక రూములో నుంచఁబడును."

ఈ గతించిన చక్రవర్తినీగారి పరిపాలనకాలములో 20 సంవత్సరములుగా యీా మహారాజావారు ప్రభుత్వముచేసి యుండుటంబట్టి ఆ యమగారి జ్ఞాపకార్థము స్థాపించఁబడబోవు వాటికి రూ. 20,000 లు ఖర్చుపెట్టించిరి. అవి యెవ్వియనఁగా:—

రూ. 5,000 లు. ఆల్ ఇండియా మిమోరియల్ ఫండు నిమిత్తము

రు. 5,000 లు. మద్రాసు ప్రావిన్షియలు మిమోరి యల్ ఫండ్ నిమిత్తము.

రు. 1,000 లు. లేడీ కర్జన్, విక్టోరియా మిమోరియల్ మిడ్‌వైఫ్ స్కాలర్‌షిప్ చందా నిమి త్తము.

రు. 2,000 లు. లేడీ యాంప్టిహిల్‌గారు విక్టోరియా కాస్టు అందు ఘోషా ఆసుపత్రిలో వేయించిన 'బెడ్డు' శాశ్వతముగా నుం పించేనిమిత్తము శ్రీబొబ్బిలి మహారాణి వారిపేరను యిప్పించినవి.

రు. 170 లు. విక్టోరియా కాస్టు అందు ఘోషా ఆసు పత్రిలో చక్రవర్తినిగారిపేర వేయించే 25 బెడ్డు చందాకుగాను రాజబంధువు లలో కొందరి స్త్రీలపేరును యిప్పించి నవి.

రు. 5,000 లు. శ్రీమహారాజావారు విశాఖపట్టణములో కట్టించుచున్న విక్టోరియా డయమండు జూబిలీ టవున్‌హాలు నిమిత్తము స్న. 1,309 ఫసలీలో శాంక్షను చేయించి యున్న రు. 20,000 లు గాక అందు నిమిత్తము తిరుగ శాంక్షన్ చేయించినవి.

రూ. 1,830 లు. బొబ్బిలిలోని విక్టోరియా టవున్ హాలు లో నుంపించుటకు నిర్ణయమైన విక్టోరియా మెమోరియల్ లైబ్రరీనిమిత్తము యిప్పించినవి.

రూ. 20,000. యిరవై వేల రూపాయిలు.

శ్రీమహారాజాగారికి ఫిబ్రవరి నెల తే 20 దీని పౌత్రుఁడు జన్మించెను. వీరికి రాజా శ్వేతాచలపతి రామకృష్ణ రంగారావు బహద్దరు యను నామము నుంపించిరి. ఈ సందర్భమునఁ బరమ సంతోషముతో నుండుతరి పిడుగుపడినటుల నీ మహారాజా వారి కత్యంత ప్రేమాస్పదురాలగు వీరి మనుమరాలు మార్చి నెలాఖరులో స్వల్పదినముల కాయిలాతో వైకుంఠవాసినులగుటచే, వీరేగాక కుటుంబస్థులందరు దుఃఖసముద్రములో మునిగిరి.

వీరు కోర్టు ఆప్ వార్డ్సు బిల్లు కవున్సిలులోనికి తీసుకు రాబడినతరి ఆగష్టు నెలాఖరులో నీలగిరికిఁ దయచేసిరి. అక్టోబరు నెల తే 6 దీని జిల్లా కలెక్టరుగారగు ఏలింగు దొరగారు విక్టోరియా టవునుహాలులో డైమండు జూబిలీ జ్ఞాపకార్థముగా మహారాజావారు నందుంపించుటకు తెప్పించిన గతించిన శ్రీ మహారాణీ చక్రవర్తినిగారి చిత్రపటముం దెరచిరి. ఇది లండను నగరములో తయారు కాబడినది. పరదా దించబడగానే 31 ఫిరంగులు కాల్చఁబడెను. నాటిసభ హాలునంతయు నిండియుండెను. మదరాసులోని విక్టోరియా టవునుహాలుకు రూ. 1,000 లు చందా నిప్పించిరి.

ఈ మహారాజావారు 'మహారాజా'యను కితాబునొంది నందున బొబ్బిలిలో విజయముచేసియున్న శ్రీవేణుగోపాలస్వామి వారికి 'రజితగజవాహనము'ను సమర్పించిరి.



THE VAIJAYANTI PRESS, 32, MOUNT ROAD, MADRAS.